# కకుత్స్థ విజయము

మట్ల అనంతరాజు

సంపాదకుడు

డా॥ జి. నాగయ్య, ఎం. ఏ; పి. హెచ్. డి.






ఆంధ్రప్రదేశ్ సాహిత్య అకాడమి
కళాభవన్ - సైఫాబాదు
హైదరాబాదు 4

**KAKUTSA VIJAYAMU**- A Telugu classic by MATLA ANANTHA RAJU of 16th Century A.D. Edited by Dr. G. Nagaiah, M.A;Ph.D; Reader, Department of Telugu, Sri Venkateswara University, Tirupathi, Andhra Pradesh.

---

ఆంధ్రప్రదేశ్ సాహిత్య అకాడమి
హైదరాబాద్-500 004

ప్రచురణ : 312

ప్రథమ ముద్రణ : 1980

ప్రతులు : 2,000

**వెల రూ: 5-00**

ప్రతులకు :
ఆంధ్రప్రదేశ్ సాహిత్య అకాడమి
కళాభవన్, సైఫాబాద్,
హైదరాబాద్-500 004

ముద్రణ :
*పద్మావతీ ఆర్ట్ ప్రింటర్స్*
హైదర్‌గూడ హైదరాబాద్.

---

Paper used (Partly) for the Printing of this book was made available by the Government of India at Concessional rate.

# తొలి పలుకు

చాలాకాలం కింద ముద్రితమై ఇప్పుడు అలభ్యంగా ఉన్న ప్రాచీన తెలుగు కావ్యాలను పునర్ముద్రించి అందించాలని అకాడమి ఆశయం. దీనికి అనుగుణంగా ఇంతవరకు ప్రబోధ చంద్రోదయం, శుకసప్తతి, హంస వింశతి, వరాహపురాణం వంటి కావ్యాలను ప్రచురించింది. 1904 లో పుస్తకరూపంలో ఈ ''కకుత్స్థ విజయం'' తొలిసారిగా వెలువడింది.

16వ శతాబ్దంలో వెలసిన మట్లఅనంతరాజు ఈ కావ్యాన్ని రచించినాడు. సలక్షణంగానూ, ప్రౌఢంగానూ, రసాస్వదంగానూ ఇందులో రచన సాగింది. నాటకీయత కూడ ఈ కావ్యమున చోటు చేసుకొన్నది.

ఈ కావ్యమునకు విపులమైన పీఠికను సమకూర్చిన విద్వాంసులు శ్రీ వేంకటేశ్వర విశ్వవిద్యాలయంలో రీడరుగా ఉన్న డా. జి. నాగయ్యగారు. తొలి ముద్రణంలో దొరలిన దొసగులనెన్నింటినో ఏరివేసి చక్కని పాఠమును సిద్ధము చేసి అకాడమి వారితో సహరించినారు. డాక్టర్ జి. నాగయ్యగారికి అకాడమి కృతజ్ఞతాభివందనములు తెలియజేస్తున్నది.

ఇరివెంటి కృష్ణమూర్తి
కార్యదర్శి

30-12-1980

# విషయానుక్రమణిక





# పీఠిక

కకుత్స్థవిజయ ప్రబంధకర్త మట్ల అనంతరాజు. అతడు కదనవీరుడే కాదు; కావ్యలోలుడు కూడ. ''రాజవేషంబుఁ గాంచు భారతి.'' కకుత్స్థ విజయాన్ని సవిమర్శకంగా సమీక్షించడానికి ముందుగా మట్ల అనంతరాజు వంశ చరిత్రను సంగ్రహంగా వివరించడమైంది.

మట్ల అనంతరాజు పెదముత్తాత సోమరాజు. ఈ సోమరాజు కొడుకు పోతరాజు. పోతరాజు కొడుకు వరదరాజు. మట్ల అనంతరాజుకు పినతండ్రి యైన ఈ వరదరాజు విజయనగరాధీశుడైన శ్రీ కృష్ణదేవరాయలకు అల్లుడైనట్లు క్రింది పద్యాన్ని బట్టి తెలుసుకోవచ్చు.

''వనజదళాక్షశంకరులు వార్ధికి నద్రికిఁబోలెఁ గృష్ణరా
యనికి ననుంగుటల్లుఁ డటులై తనరున్వరదక్షమాధవుం
డనిమిషవాహినీముని గజాశ్వ మహీరుహధేను భీమవా
హన మకుటావతంసకుధరా భరణాదిక హేతు కీర్తియై''

—కకుత్స్థ (1-39)

విజయనగర సామ్రాజ్యాన్ని తుళువ వంశరాజుల్లో చివరివాడైన సదాశివరాయలు (1543-1576) పరిపాలించే నాటికి మట్లవారు ఈ చుట్టరికాన్ని మరింత సన్నిహితమయ్యేటట్లు కావించుకొన్నారు. రాజ్యంతో చెలరేగే గడ్డు సమస్యల సమాలోచన సందర్భాల్లో సదాశివరాయలకు మట్ల వారి సలహాలు అత్యంతావశ్యకములైనాయి. రాజ్యతంత్రాలావాపచతురత చేత, నిశిత బుద్ధి కౌశలం చేత మట్లవారు ఆ ప్రాంతాల్లో ఆనాడు ప్రముఖులైన మేధావులుగ ప్రసిద్ధి గాంచినారు. క్రమేణా వారు విజయనగర సామ్రాజ్యాధీశుని చే మధురాంక, పొత్తపి నాడులకు అధిపతులైనారు.

సదాశివరాయలు ఆరవీటివారి చేతిలోని కీలుబొమ్మ. అతని పరిపాలనా కాలంలోనే ఆరవీటి వంశంలోని అళియ రామరాయలు (1543-1564), తిరుమల

దేవరాయలు (1571-72) ఆతని కుమారుడు శ్రీరంగదేవరాయలు (1572-1585) అధికారాల్ని చెలాయించినట్లు తెలుస్తున్నది. శ్రీకృష్ణ దేవరాయల అల్లుడైన అళియ రామరాజు లాంఛనంగా సామ్రాజ్యాన్ని స్వీకరించకపోయినా సార్వభౌముని కన్నా ఎక్కువ అధికారాలతో పాలించినాడు. అతని బంధువు లంతా మండలాధిపతులో, దండనాయకులో అయినారు. తళ్లికోట యుద్ధం (1564) తో అళియ రామరాజు మరణించిన తరువాత అతని తమ్ముడు ఎర్ర తిమ్మరాజు సదాశివరాయలతో పాటు సకల సంపదలతో విజయనగరాన్ని వదలి పెనుగొండను చేరుకొన్నాడు. ఈ ఎర్ర తిమ్మరాజు సదాశివరాయలను త్రోసి రాజని తిరుమలదేవరాయలనే పేరుతో తానే పట్టం కట్టుకొని పెనుగొండను రాజధానిగా చేసుకొని విజయనగర సామ్రాజ్యాన్ని పరిపాలించినాడు. రామ రాజభూషణుని వసుచరిత్రకు కృతిపతి ఈ తిరుమలదేవ రాయలే. ఇతని కాలంలోనే విశాలమైన విజయనగర సామ్రాజ్యానికి విచ్ఛిత్తి కలిగింది. సామంతులు ఎవరికి వాళ్ళే స్వతంత్రులైనారు. తిరుమలదేవ రాయలు సామ్రాజ్యాన్ని మూడు భాగాలు చేసి తన ముగ్గురి కొడుకులను మూడుచోట్ల పరిపాలకులుగ నెలకొల్పినాడు. పెద్ద కొడుకు శ్రీరంగదేవ రాయలు పెనుగొండ ముఖ్యపట్టణంగా తెలుగుదేశాన్ని ఏలినాడు. రెండవ కొడుకు శ్రీరామ రాజు శ్రీరంగ పట్టణం కేంద్రంగా కన్నడ భూభాగాన్ని పరిపాలించినాడు. మూడవ కొడుకు వెంకటపతి రాయలు చంద్రగిరి రాజధానిగా తమిళదేశానికి పాలకుడైనాడు.

1585 లో శ్రీరంగదేవరాయలు మరణించిన తరువాత పెనుగొండ విభాగం అల్లకల్లోలమైంది. ఆ విభాగాన్ని కూడా పట్టం కట్టుకొని పరిపాలించ మని చంద్రగిరి పాలకుడైన వీరవెంకటపతి రాయలను సామంత రాజులు కోరి నారు. సామంతుల కోరిక మన్నించి వెంకటపతిరాయలు పెనుగొండ విభాగానికి కూడ పాలకుడైనాడు. అతడు రాజధానిని చంద్రగిరి నుండి పెనుగొండకు మార్చుకొనినాడు. తన తండ్రియైన తిరుమలదేవరాయల వల్ల కోల్పోయిన పూర్వవైభవాన్ని మళ్ళీ రాయ సామ్రాజ్యానికి తీసుకరావడానికి వెంకటపతి రాయలు ప్రయత్నించి చాలవరకు కృతకృత్యుడైనాడు. ఈ ప్రయత్నాల్లో వీరవెంకటపతి రాయలకు సహకరించి సాయపడిన సామంత రాజుల్లో ప్రముఖంగా పేర్కొనదగినవారు మట్లవారు.

## మట్ల వంశం :

మట్లవారు సూర్యవంశపు రాజులు. చోళవంశ క్షత్రియశాఖకు చెందిన వారని క్రింది పద్యాన్ని బట్టి చెప్పవచ్చు.

''శ్రీ చోడవంశభవ యహి
తాచారభిదాప్రచండ యయ్యర గండా
భూచరఖేచరలోచన
గోచర సుమభల్ల మట్లి కోనయ యెల్లా''

— కకుత్స్థ 3-1.

మట్ల అనంతరాజు మనుమని మనుడైన మట్ల వెంకటరామరాజుకు అంకితంగా నడిమింటి వెంకటపతి రచించిన అభిషిక్త రాఘవ మనే ప్రబంధావ తారికలో మట్ల వంశ మూల పురుషుడైన బొమ్మరాజుకు దేవచోడుడనే నామాంతరి మున్నట్లు చెప్పబడినది. అందువల్ల మట్ల వారు దేవచోడ వంశస్థులన వచ్చు. వారు పొత్తపి చోళులకన్నా, ఒరయూరి చోళులకన్నా కూడా భిన్నులు. కాశ్యప గోత్రోద్భవులు, మట్లవారి పూర్వనామం వంగలి వారైనట్లు శ్రీ తిమ్మా వజ్ఝల కోదండరామయ్యగారు 'మట్లవారి మీది చాటువులు' అనే వ్యాసంలో విశదపరచినారు: ''వంగలి కోనమరాజు వీరికి మూల పురుషుడైనట్లు తెలియు చున్నది. వంగలి కోనమరాజు తమ స్వస్థలము వీడి కడపమండలము రాయచోటి తాలూకాలోని 'మట్లి' యను గ్రామమునకు వచ్చి యందు స్థిరనివాసము కల్పించు కొనిరి. నాటినుండి వంగలి వారను పూర్వనామము పోయి వీరి నివాస స్థల మగు మట్లి గ్రామము పేర వీరు 'మట్ల' వారయిరి.''[1]

## మట్ల వారి చరిత్ర – మూలాధారాలు :

మట్ల ఎల్లరాజు కొలువులో ''ఆంధ్ర కవితాపితా మహాంకుడును నుభయ ఛత్ర చామరశంఖ సంఘాతాంకుండునగు నుప్పుగొండురిపురి వేంకటకవి''

---

1) ఆంధ్రపత్రిక సచిత్ర వారపత్రిక సంచిక. 5-4-1950. పుట 27.

ఉండేవాడు. ఈ మహాకవి ఏయే గ్రంథాలు వ్రాసినాడో తెలియదు. ఆరవీటి పెదవెంకట రాయల కంకితంగా మీనకేతనాభ్యుదయాన్ని రచించిన ఉప్పు గుండూరి పెరియన్న ఈ వేంకటకవి పుత్రుడే అని చాగంటి శేషయ్యగారి అభిప్రాయం.[1] ఉప్పుగొండురిపురి వేంకటకవిని మట్ల ఎల్లరాజు "శాశ్వతంబగు ధర్మంబేది" అని అడిగినాడట. అతడు "సప్తసంతానములలో కావ్యము శాశ్వతంబు" అని చెప్పి, అతని కొడుకైన అనంతరాజు 'సత్కవి' అని ఇట్లా విశద పరచినాడు:

"మహి నీ పుత్రుఁ డనంతుఁడు
బహుమహిమలఁ జెప్పనేర్చు భవ మౌళిధునీ
లహరీ ఘుమ ఘుమిత వచో
మహితంబులు కృతులు స్వరస మాధురి నవురా"

— కకుత్స్థ (1-11).

ఈ విధంగా ఆంధ్ర కవితా పితామహుడు వివరించిన తరువాత అనంతరాజు తన తండ్రి అభిప్రాయాన్ని గుర్తించి తాను రచించిన కకుత్స్థ విజయాన్ని తండ్రియైన ఎల్లరాజుకు అంకిత మిచ్చినాడు.

కకుత్స్థ విజయ కృత్యాదిలో కృతిపతి వంశ వర్ణనా సందర్భంలో చేసిన మట్ల వారి వంశావళిని బట్టి మట్లవంశ మూల పురుషుడు బొమ్మరాజు. ఈ బొమ్మరాజు కొడుకు తిమ్మరాజు. తిమ్మరాజు కొడుకు కోనరాజు. కోనరాజు కొడుకు ఎల్లరాజు. ఎల్లరాజు నాల్గో భార్యయైన రంగాంబకు మట్ల అనంతరాజు జన్మించినాడు. మట్ల అనంతరాజు తన వైభవాన్ని తానే వర్ణించుకోవడం ఆత్మస్తుతి అవుతుందేమో అనుకొని, తన కుమారుని కీర్తిని, మనుమల పరాక్రమాదుల్ని వివరించి చెప్పడం సబబు కాదని భావించి ఆ వాక్యాలను వేంకటకవి ఎల్లరాజుకు విన్నవించినట్లుగ వర్ణించి యున్నాడు.

---

1. ఆంధ్ర కవి తరంగిణి: 11 సంపుటం. పుట 85.

మట్ల అనంతరాజు వైభవాన్ని వర్ణించి చెప్పే పద్యాల్లో ఒకటి :

"జడరాశిఁ జొరఁబాఱె బడబానల జ్వాల
        చిద్రూపు హరుఁ జేరె శీతరోచి
యొకమూలఁ బడియుండె నొదిగి కృశానుండు
        హాలాహలము మ్రింగె శూలపాణి
యాకసంబెగఁబ్రాఁకె నజ్ఞాతహితకారి
        పాతాళమున కేఁగెఁ బాపఱేఁడు
కదలఁగా వెఱచె నక్కనకాచలేంద్రంబు
        పారికాంక్షితఁ గాంచె నారదుండు
నెవని విక్రాంతి కీర్తియు నేఁచి తఱుమ
వాని నుతియింప వశమె శేషాహికైన
నిఖిలరాజన్య కోటీర నిహిత చరణు
మట్లనంత మహీనాథు మతిసనాథు"

— కకుత్స్థ (1-14)

మట్ల అనంతరాజు కొడుకైన తిరువెంగళరాజు కీర్తి వైభవాన్ని వర్ణించే పద్యమిది :

"ఫాలలోచనుమ్రోల హాలాహలము మెచ్చు
        శశిమ్రోల రాహువు సన్నుతించు
శరదంబుదముచెంత ఝంఝానిలమునెంచుఁ
        దుహినసంతతి చెంత మిహిరుఁ దలఁచు
నలినసంతతి చెంత నాగంబు స్తుతిసేయు
        నురగవల్లభు పొంత గరుడు నొడువు
హరిదంతికడఁ గాళికాశ్వముఁ గొనియాడు
        భారతికడ వీరభామఁ బొగడు
మట్ల తిరువేంగళ నృపాలు మహితకీర్తి
        యెంత గయ్యాళి రచ్చలకెల్ల నెక్క

తత్తదుచిత స్థలంబులఁ దవిలి తవిలి
...   ...   ...   ..."

—కకుత్స్థ (1-24)

ఈ తిరువేంగళ రాజుకు ముగ్గురు భార్యలు, ఐదుగురు కొడుకులు-(1) కుమార అనంతరాజు (2) ఎల్లరాజు (3) చిన్న అనంతరాజు (4) రఘునాథ రాజు (5) వెంకటాద్రి రాజు-ఉన్నారు. కకుత్స్థవిజయంలో తిరువేంగళ రాజుకు చెన్నమాంబకు జన్మించిన కుమార అనంతరాజు, ఎల్లరాజు, చిన్న అనంతరాజులను మాత్రమే వరుసగా మూడు పద్యాల్లో మట్ల అనంతరాజు వర్ణించాడు. తక్కిన ఇద్దరు కకుత్స్థవిజయ రచనాకాలం నాటికి జన్మించలేదని భావింపవచ్చు.

మట్ల అనంతరాజు మొదటి మనుమడైన కుమార అనంతరాజును వర్ణించిన పద్యమిది:

"కరుణాగరిష్ఠులు కమలాక్షుఁ డనియును
వీరాగ్రగణ్యులు విజయుఁడనియు
దాతలందఱుఁ గల్పధరణీజ మనియును
సత్యశీలురు హరిశ్చంద్రుఁడనియు
భోగసంపన్నులు పురుహూతుఁడనియును
వైణికాగ్రేసరు ల్వాణి యనియు
బుధులెల్లరును శేషభోగీంద్రుఁడనియును
హరిభక్తులెల్లఁ బ్రహ్లాదుఁడనియు
నానరఁగొనియాడఁ గాఁపురంబుండనేమొ
దయయు శౌర్యంబు నీగి సత్యవ్రతంబు
విభవ సంగీత పాండిత్య విష్ణుభక్తు
లనఁగఁ దనరుఁ గుమారుఁ డనంతవిభుడు"

—కకుత్స్థ (1-28)

మట్ల అనంతరాజు రెండో మనుమడైన ఎల్లరాజు వర్ణన క్రింది పద్యంలో చూడండి:

''శాత్రవాభ్రవ్రాత ఝంఝానిలం బెవ్వఁ
డెవ్వాఁడు రిపుతమోహిమకరుండు
కుటిలాసుహృద్వింధ్య కుంభోద్భవుం డెవ్వఁ
డెవ్వాఁడు రిపుభూభృదింద్రహేతి
వైరిభోగివ్రాత వైనతేయుండెవ్వఁ
డెవ్వాఁడు రిపుసింధురేభవైరి
దర్పితారాతిద్రుదావ పావకుఁ డెవ్వఁ
డెవ్వాఁడు రిపుహిమాహిమకరుండు

వాఁడు విలసిల్లు దశదిశావలభిసులభ
ఢౌకమానానకాస దృఢ్ఘాన్నినాద
బధిర పరపంథి సైంధవ ప్రబల మాద్య
దిభుఁడు తిరువేంగళ నృపాలు నెల్ల విభుఁడు''

— కకుత్స్థ (1-29)

మట్ల అనంతరాజు మూడో మనుమడైన చిన్న అనంతరాజు వైభవం క్రింది పద్యంలో వర్ణింపబడినది:

''వేయు మొగంబుల విభజనం బెడలించి
యాననం బొకఁడౌ ననంతుఁడనఁగ
నెద మోచికొనియున్న యిందిర నేత్రాంబు
జాసక్తిఁ జేయు ననంతుఁ డనఁగ
సర్వరాజతమాని జనపతిత్వముఁ బూని
యఖిలోర్విఁ దాల్చుననంతుఁడనగ
నలుగేలు నిరుగేలు నలువునఁ గొనకొని
యనుకంపఁదాల్చు ననంతుఁడనగ

దినదినంబును జాల వర్ధిష్ణుఁడయ్యె
మట్లనంతుని గారాబు మనుమఁడాప్త
పద్మహేళి యనంత నృపాలమౌళి
పుణ్యగుణభాసమానుఁడగణ్యయశుఁడు''

— కకుత్స్థ (1-30)

పైన పేర్కొన్న పద్యాలన్నిట్లోనూ అలంకారాలు, వర్ణనాంశాలే కాని చరిత్రకు పనివచ్చే విషయాలేమీ వాటిల్లో లేవు. మట్ల రాజులు ఎప్పటి వారో, ఏయే రాజులను జయించినారో ఎట్లాపరిపాలించినారో మొదలైన వివరాలు తెలుసు కోడానికి ఈ పద్యాలంతగా ఉపకరించవు.

మట్ల అనంతరాజు మనుమడైన కుమారానంతరాజు తన తండ్రియైన తిరువేంగళరాజుకు అంకితంగా కుముద్వతీకళ్యాణా[1]న్ని రచించి ఉన్నాడు. కకుత్స్థవిజయ కృత్యవతరణిక కన్నా కూడ మట్లవారి చరిత్ర రచనకు కుద్వతీకళ్యాణావతారిక ఎక్కువ ఉపయోగపడుచున్నది.

మట్ల అనంతరాజు మహిమను, మహత్తర విజయాలను కుమారానంత రాజు తన కుముద్వతీకళ్యాణంలో ఇట్లా కీర్తించినాడు :

''తరమె నెవ్వడు బలోద్ధతి నంటి పెన్గొండ
యండను కుతుపశాహావనీశు
చెండె నెవ్వని బారు ఘంటికోట ప్రాంత
శూరాశ్వరాయతు భారబలము
గెలిచె నెవ్వండు...... గిరిరాజ కంప నె
నప్ప భూపాల సైన్య వ్రజంబు
అడచె గుఱ్ఱముకొండ యరుత నెవ్వాడు రావిళ
వెళిగొండ వెంకట వీరవరుల
మధుర వీరప్ప నెవ్వాడు మట్టుపెట్టె
నెమ్మితో రాయకార్యంబు నిర్వహించె

1. మద్రాసు అడయారు లైబ్రరీలో అతి శిథిలావస్థ యందున్న కుముద్వతీ కల్యాణం తాళపత్ర ప్రతి (నెం. 75036) నుండి అవతారికా భాగాన్ని వ్రాయించి పంపిన మిత్రులు డాక్టర్-దేవరకొండ చిన్నకృష్ణయ్య గారికి కృతజ్ఞతలు.

అతడు రిపురాజదోర్గర్వహరణ బాహు
శాలి మట్ల యనంత భూజాని హేళి''

— కుముద్వతీకళ్యాణం (1-42)

(అముద్రితము)

మట్ల కుమారానంతరాజుకు ఆశ్రితులైన విద్వత్కవిజనంబులు అతని వైభవాన్ని 9 పద్యాల్లో వినుతించినట్లు కుముద్వతీ కళ్యాణావతారికలో కుమారానంతరాజు రచించినాడు అందులో ఒక పద్యంలోని చారిత్రక విశేషాలను పరికించండి:

“కలకడ పట్టణ క్రమ దక్షిణాశీత
గుండ్లూరి సంగ్రహాకుండవిభవ
వేములపల్లీదుర్గ విజయధాటీ ధుర్య
అనిమొనల పాల గిర్యరి విధార
భప్పల్లి శాత్రవ శేనాలి భంజన
తంగెడుపల్లె సాధన సతుగ్ర
పీలేటికారిపు భేద కోగ్ర చమూహ
అంతుల కొకూర్ల కాళ్వార్త విజయ
మాధవరపు సంహార మహితతేజ
శెట్టి పలిసాల సాధ్య సిద్ధ శౌర్య
ఉదయగిరి దుర్గ నృపభయదోగ్రయాత్ర
మహిత బలవంత మట్ల కుమారనంతా''

—కుముద్వతీ కళ్యాణం (ప. 17)

మట్ల వెంకట రామరాజు (1693) కు అంకితంగా నడిమింటి వెంకటపతి రచించిన అభిషిక్త రాఘవం [1] అనే ప్రబంధంలోని అవతారిక కూడా మట్ల

---

1 అముద్రితం. ఈ గ్రంథం మద్రాసు ప్రాచ్య లిఖిత పుస్తకభాండాగారంలో ఉంది.

అనంతరాజు అతని కుమారుడైన, తిరువేంగళరాజు మొదలైన మట్లవారి చరిత్రను తెలుసుకోడానికి ఉపకరిస్తుంది

మట్ల అనంతరాజును గురించి అభిషక్తరాఘవంలో ఇట్లా ఉంది :

''గాయకు లశ్వరాయ బలఖానులు మట్ల యనంతరాజ కౌ
క్షేయక ధారఁ ద్రెవ్విరని చెప్పెడి దింతియ కాక వేలుపున్
రాయలసీమలోనఁ జతురంగ బలంబులతోడ వైరముల్
పాయకయున్నవారు సరిపాళెము వైచిన యట్లజస్రమున్''[1]

నడిమింటి వెంకటపతి అభిషిక్త రాఘవాన్ని బట్టి రచింపబడిన మట్లవారి వంశావళి ఒకటి మెకంజీ లోకలు రికార్డు (15-6-1922) లో ఉంది. మద్రాసు ప్రాచ్య లిఖిత పుస్తక భాండాగారంలో మెకంజీ దొర సేకరించిన స్థానిక చరిత్ర సంపుటాల్లో ఇరవై రెండో సంపుటంలో మట్లవారిని గురించి ఒక పెద్ద కైఫీయతు ఉంది. అందులో మట్లవారిపై నాడు వారి సంస్థానంలోని భట్రాజులు వ్రాసిన చాటు పద్యాలెన్నో పేర్కొనబడినాయి. ఈ కైఫీయతు చాటూదాహరణ పూర్వకంగా శాసనాద్యాధారాలతో మట్లవారి చరిత్రను ప్రామాణికంగా తెలుపుతుంది. స్థానిక చరిత్రల సంపుటాల్లోని చాటువులను, భట్రాజులు చెప్పిన వాటిని, మరికొన్నిటిని సేకరించి శ్రీ తిమ్మావజ్ఝల కోదండ రామయ్య గారు 1950 ఏప్రిలు ఆంధ్రపత్రిక సచిత్ర వారపత్రికలో ప్రకటించి యున్నారు. తిరుమల తిరుపతి దేవస్థానం వారు ప్రకటించిన శాసన సంపుట నివేదికల మూలంగా తిరుమలలోను, ఇతర ప్రదేశాల్లోను మట్లవారు కావించిన దానాదికాలు తెలుస్తున్నాయి.

*మట్ల అనంతరాజు సాధించిన మహత్తర రాజకీయవిజయాలు:*

మట్ల రాజుల్లో ప్రముఖంగా పేర్కొనదగినవారు ఎల్లరాజు, అతని కొడుకు అనంతరాజు. మట్ల అనంతరాజు శా. శ. 1527 లో సిద్ధవటంలో

---

1. ఆంధ్ర కవి తరంగిణి. 11 వ సంపుటం. పుట 72 నుంచి గ్రహింపబడినది

సిద్ధవటేశ్వరుని ఆలయం చుట్టూ రాతి ప్రాకారంపై వ్రాయించిన **శిలాశాసనంలో** ఇట్లున్నది :

''శాకేఽశ్వాంబకబాణభూపరిమితే వర్షే చ విశ్వావసా
వౌన్నత్యేన చిరాయుషా చ గుణభూజా చంద్రతారం విభుమ్
యస్యానంతనృపేణ తేన జనకే నైవూటుకూరీరణే
ప్రాప్తే సిద్ధవటైయ ముజ్జ్వల శిలాసాలో విశాలః కృతః.

**సీస మాలిక :**

శాలివాహన నామ శక వర్షములు వేయు
నేనూట యిరువదియేడుచనిన
విశ్వావసువనంగ వెలయు వత్సరమున
సకల హిందూరాజ్య సార్వభౌమ
వీర వెంకటరాయవిభుఁడు చంద్రగిరీంద్ర
సీమ సామ్రాజ్యంబు చేయునపుడు
భానువంశాంభోజభానుఁ డంభోరాశి
గంభీరుఁడై వరగండమూర్తి
బిరుదసామజ సింహ భీమకేతన భర్త
దేవచోడాన్వయ భూవిభుండు
రణభూపరీభూత రావెల వెలిగొండ
వెంకటాద్రి మహీశ వీరవరుఁడు
జంబులమడక భూసంగ్రామ జయశాలి
కటకపురీ చూరకాపహారి
నందేల క్రిష్ణమ నరనాథ జయదాన
దక్షదోర్దండ విచక్షణుండు
అఖిల కర్ణాట సింహాసనాధీశ్వర
దక్షిణ బాహాభిధానధారి
విదళిత కొండ్రాజు వెంకటాద్రి విభుండు
చెన్నూరి హరణ సంపన్న గృహుఁడు
విబుధస్తుత కకుత్స్థవిజయ ప్రబంధాది
కావ్యనిబంధన గ్రంథకర్త

శ్రీ మదెల్లమరాజు చెరువుపేర తటాక
ఘటనానుభావ సంఘటిత యశుఁడు
ద్రవిడభూమధురాది రాజ (దాట, నాథ) చలద్రయ
బలరక్షణక్షీణ బాహుబలుఁడు
పెనుగొండ సమర యావన పాదుషా గర్వ
ఖర్వీకరణ చణాఖర్వభుజుఁడు
రంగమాంబా కుమారవతంస రత్నంబు
పరభీమ బిరుదుల భాయిబండి
వినుతావనీశ్వర వేశ్యా భుజంగుండు
బల్లరగండాంక భాసురుండు
మన్నెహం వీరుండు మగల రాయఁడు రాచ
బెబ్బులి పరరాజభీకరుండు
మట్ల తిర్వేంగళ మానవాధిపరత్న
రత్నాకరుడనంతరాజశౌరి
తమ తండ్రి యెల్ల భూరమణుండు కొండ్రాజు
తిరుపతి రాజుపై బెరిగి కొట్టి
తనకత్తిమొనఁదెచ్చుకొనిన సిద్ధవటంబు
చెలమ పట్టున బెద్ద చెర్వు చేసె
హృదయముప్పొంగ సిద్ధవటేశ్వరునకు
ఔపచారికమైన శాలాంతరనుగ
బురము చుట్టును వరణమై పరిణమింప
ధాత్రి గట్టించె నాచంద్రతారకముగ.'' (1)

''కకుత్స్థ విజయ ప్రబంధాది కావ్య నిబంధన గ్రంథకర్త'' యైన మట్ల అనంతరాజే ఈ శాసనకర్త అని చెప్పవచ్చు. ఈ సీసమాలికా శాసనాన్ని బట్టి మట్ల అనంతరాజు పదహారో శతాబ్ది తుది పాదంలోనో పదిహేడో శతాబ్ది

---

1) ఇది డాక్టర్ కృష్ణస్వామయ్యంగారు సంగ్రహించిన దక్షిణ హిందూదేశ శాసనాది చరిత్రాంశ గ్రంథంలోనిది.

ప్రథమ పాదంలోనో ఉండేవాడని నిశ్చయింపవచ్చు. ఈ శాసనాన్ని బట్టి, ఇతరాధారాలను బట్టి మట్ల అనంతరాజు సాధించిన మహత్తర విజయాలు :

*మట్ల అనంతరాజు తన తండ్రియైన ఎల్లరాజుకు జంబులమడక, ఓటుకూరు యుద్ధాల్లో తోడ్పడడం :*

మట్లవారికి కడప మండలంలో సిద్ధవటం, పొత్తపి సీమలలో పొందలూరు సెనగలూరు, పొన్నంపల్లె గ్రామాల్లో మాన్యాలున్నాయి (2). ఈ మండలాన్ని కొండ్రాజు తిరుమలరాజు పరిపాలిస్తున్నాడు. అతడు వెంకటపతి రాయల అధికారాన్ని ప్రతిఘటించి రాయలకు విశ్వాసపాత్రులుగా ఉంటూ సహాయపడు తున్న మట్లవారి మాన్యాలను కైవసం చేసుకొన్నాడు. మండలాధిపతి కొండ్రాజు తిరుమలరాజుకు ఈ సందర్భంలో తోడ్పడినవాడు నంద్యాల కృష్ణమరాజు. పింగళి సూరన తన కళాపూర్ణోదయాన్ని ఈ నంద్యాల కృష్ణమరాజుకే అంకిత మిచ్చినాడు.

స్వామిద్రోహియైన కొండ్రాజు తిరుమలరాజు తన అమరభూముల్ని ఆక్ర మించుకొన్న విషయాన్ని మట్ల ఎల్లరాజు వెంకటపతి రాయలకు విన్నవించినాడు. తన అధికారాన్ని ప్రతిఘటించిన కొండ్రాజు తిరుమలరాజును, నంద్యాల కృష్ణమ రాజును లొంగదీయాలని వెంకటపతి రాయలు నిశ్చయించి తానే స్వయంగా యుద్ధానికి బయలుదేరినాడు అతనికి బాసటగా మట్ల ఎల్లరాజు, పెమ్మసాని వారూ, మరికొందరు నాయకులు సేనలను నడిపించినారు. నంద్యాల కృష్ణమ రాజు జంబులమడుగులో వెంకటపతి రాయల్ని ఎదిరించినాడు. కాని యుద్ధంలో నిలువలేక తిరోగమించి నంద్యాల కోటలో తలదాచుకొనినాడు. వెంకటపతి రాయల ఆదేశంచే మట్ల ఎల్లరాజు నంద్యాల కోటను మూడునెలలు ముట్టడి చేసి నాడు. తుదకు నంద్యాల కృష్ణమరాజు సంధికి ప్రాకులాడగా మట్ల ఎల్లరాజు అతనికి ప్రాణభిక్ష పెట్టించి చంద్రగిరి కోటలో ఆమరణాంతం బంధించినాడు.

---

2) Further Sources of Vijayanagara History. vol II. No. 214. P. 328.

నంద్యాల వారి భూముల్ని వెంగటపతి రాయలు పెమ్మసాని వారికీ, తదితరులకు పంచిపెట్టినాడు.

మట్ల వారి మాన్యాలను ఆక్రమించుకొన్న కొండ్రాజు తిరుమలరాజును మట్టుపెట్టి ఆ సీమ సీమనంతటినీ కట్టుకోమని వెంకటపతి రాయలు మట్ల ఎల్ల రాజుకు అనుజ్ఞ యిచ్చినాడు. కొండ్రాజు తిరుమలరాజుకు, మట్ల ఎల్లరాజుకు ఊటుకూరు దగ్గర ఘోరసంగ్రామం జరిగింది. ఆ సందర్భంలో ఎల్లరాజు సన్నిధానవర్తులైన భట్లు ఇట్లా శ్లాఘించినారు :

"చక్కగా నలుకవా చొక్కనాథు డెఱుంగ
మీఱి వైరులనెల్ల నూరికాడ
కొట్టవా దామెన గొర్లగా పొలితో
రణభూమి పోతు గొండ్రాయనికిని
జెండవా పొత్తపినుండి పాఱగ బాఱ
జండి వైరుల నీరు కొండలెక్క
గొండూరి మలలమ్మకును బ్రీతిగ దఱిమి
కొట్టించవా తలల్ గుట్టలుగను.

ఆహహా ! గుఱ్ఱాలు గొడుగులు నందలములు
విడిచి పాఱంగ దఱుమవా వెంటనంటి
సమర నిశ్శంక ! మట్టిలి శాసనాంక
భాగ్యముల కొల్ల ! కోన భూపాలు నెల్ల !". 1

మట్ల ఎల్లరాజు తన శత్రువైన కొండ్రాజు తిరుమలరాజును యుద్ధంలో కక్షతో చంపడంతో తృప్తిపడకుండా ఆ రాత్రి రణము కుడిపించినాడు. రణము కుడపడం అంటే "శత్రువులు నిహతులైనచోట వారి రక్తముతో కలిపిన అన్నము వారి తలపును కలలో పెట్టుకొని యొదలికి భస్మము పూసికొని, జుట్టు విరియబోసుకొని యర్ధరాత్రి కాలమున నొంటిగా దిగంబరులై భూతబలి మంత్ర

---

1 'మట్లవారి మీద చాటువులు'. పుట ౭౭ నుండి గ్రహింపబడినది.

ములు చదువుచు డాకిన్యాదులకు బలిపెట్టుట''[1] అని. ఈ ఆచారం తెలంగాణాలో రేచర్ల వంశ్యులలోనే వాడుకలో ఉన్నట్లు కనిపిస్తుందని మల్లంపల్లి సోమ శేఖరశర్మగారు వ్రాసినారు ఈ వీరాచారాన్ని కకుత్స్థవిజయంలో మట్ల అనంతరాజు ఇట్లా వర్ణించినాడు:

''ఫాలదృగగ్ని దృగ్జ్వలన భాపరిభావిభుజాసి దర్శనో
న్మీలిత సాధ్యసస్థగిత నిష్ఠురలోచన వైరివీరభూ
పాలక ఫాలరక్త రసపాన పలాశన తుష్టభూత భే
తాళపరీతభైరవ పతత్రిదణమార్గ నటద్భట వ్రజా''

—కకుత్స్థ (౪-166)

మట్ల ఎల్లరాజు కొండ్రాజు తిరుపతిరాజును ఇట్లాగ సంహరించి సిద్ధవటం సీమకు అధిపతి అయినాడు.

మట్లవారూ వీరవెంకటపతిరాయలూ ఒకే పక్షంలో ఉండి నంద్యాల కృష్ణమరాజు, కొండ్రాజు తిరుపతిరాజులతో పోరాడి జయమును గాంచిరని 'Further sources of Vijayanagara History' అనే గ్రంథంలో ఉదాహృతములైన కైఫీయత్తుల మూలంగా తెలుస్తున్నది. క్రింది కైఫీయత్తులను కొన్నిటిని గమనించండి:

''శాలివాహన శకం ౧౫౨౦ (1520) హేవళంబి సంవత్సరమందు నంద్యాలకోటలో నంద్యాల శ్రీకృష్ణమరాజుగారు ప్రభుత్వము చేస్తూ వుండగాను చంద్రగిరి దుర్గము నుంచి వీర వెంకటపతి దేవ మహారాయలు సైన్యముతో వచ్చి.........''

—అలవకొండ కైఫీయతు.

''తరువాత వెంకటపతి రాయలు పెనుగొండలో నున్న చంద్రగిరిలో నున్న సింహాసనారూఢుడై రాజ్యం చేయుచుండగాను మట్ల యల్లమరాజుగారు

---

1. తెలుగు భాషాసమితి ప్రచురణ విజ్ఞాన సర్వస్వం. ౪వ సంపుటం. పుట 305.

వెంకటపతిరాయలవారి పక్షమై జంబులమడకవద్ద, నంద్యాల కృష్ణమరాజుగారితో యుద్ధంచేసి కృష్ణమరాజుకు అభయం యిచ్చి, సిద్ధవటం యేలుతూవున్న కొండ్రాజు తిరుపతిరాజుగారు యీ వూటుకూరు గ్రామాన వుండగాను యల్లమ రాజుగారు వారితో యుద్ధము చేసి జయించి సిద్ధవటం తమ స్వాధీనం చేసికొనిరి'

—ఊటుకూరు కైఫియతు.

వెంకటపతిరాయల అధికారాన్ని ప్రతిఘటించిన నంద్యాల కృష్ణమరాజును బంధించడంలోను, కొండ్రాజు తిరుమలరాజును నిర్జించడంలోను తన తండ్రియైన ఎల్లరాజుకు క్రీ.శ. 1598–99 ప్రాంతాల్లో జరిగిన జంబులమడుగు, ఊటుకూరు యుద్ధాల్లో తోడ్పడడమే కాకుండా మట్ల అనంతరాజు స్వయంగా మహత్తరవిజయాలను సాధించినాడు.

## *పెనుగొండ యుద్ధంలో గోలకొండ సైన్యాలను తరిమికొట్టడం :*

వెంకటపతిరాయలు పెనుగొండ రాజ్యాన్ని సుస్థిరం చేసుకొని పరరాజు లాక్రమించిన తమ భూభాగాల్ని విడిపించుకొనసాగినాడు. క్రీ.శ. 1589 నాటికి అతడు గోలకొండ సైన్యాలనుండి ఉదయగిరిని స్వాధీనం చేసుకొనినాడు. పెనుగొండసేనలు విజృంభించడాన్ని గోలకొండను పాలిస్తున్న మల్కిభరాముని కుమారుడైన మహమ్మదు కులీకుతుబ్‌షా సహించలేక తానే స్వయంగా సైన్యాలను నడిపించుకొని పెనుగొండను ముట్టడించినాడు. సుల్తాన్‌సేనలు హఠాత్తుగా ముట్టడిస్తాయని వెంకటపతిరాయలు ఊహించలేదు సామంతుల సైన్యాలను దక్కించుకోడానికి తనకు కొంత వ్యవధి కావాలి. అందువల్ల వెంకటపతి రాయలు రాజనీతిని ప్రయోగించి, సంధిబేరాలు సాగించి కాలయాపన చేసినాడు. ఈలోగా పెనుగొండ కోటలోనికి సంభారాలు సమకూర్చినాడు. మట్ల అనంత రాజు, జగదేకరావు, తంజావూరు రఘునాథ నాయకయ్య మొదలైన సామంతులు ముప్పైవేల పదాతిబలాలతో నాలుగువేల తుపాకి ఫౌజుతో కోట లోనికి ప్రవేశించినారు. ఈ సామంతుల ధాటికి సుల్తాన్ సేనలు ఆగలేక పలాయనం చిత్తగించినాయి ఇట్లాగ 1593లో ఇతర సామంత నాయకులతో కలిసి మట్ల అనంతరాజు పెనుగొండను పరిరక్షించినాడు

రావెళ్ల సైన్యాన్ని నిర్జించి గుర్రంకొండను సాధించడం :

మట్ల అనంతరాజు, కస్తూరి రంగప్పనాయకుడు గోలకొండ సుల్తాన్ సేనలను తరిమికొట్టినారు. గోలకొండ సైన్యాలకు గుర్రంకొండలో రావెళ్లవారు సహాయపడి పెనుగొండ సేనల్ని ప్రతిఘటించినారు వెంకటపతి రాయల అనుమతితో మట్ల అనంతరాజు దండుతో పోయి గుర్రంకొండ దుర్గాన్ని ఎలాగైనా పట్టుకోవాలని సంకల్పించుకొనినాడు మట్ల అనంతరాజు మృత్యువును ధిక్కరించి రావెళ్లవారిని నిర్జించి గుర్రంకొండ బురుజులు కూలద్రోయించినపుడు భట్లు అతని ఘన విజయాన్ని పొగడిన చాటు పద్యమిది:

''కార్చిచ్చుకరణి బెన్మాకలాకసమందు
మందుతిత్తులకును సందడిలక
ఘూర్ణిల్ల జిచ్చులు గ్రుమ్మరించు తుపాకి
డబ్బుడిబ్బునకు దబ్బిబ్బుగాక
జడిగొని పెను చిత్తజల్లుగా భోరన
దుముకించు రాళ్లకు దొట్రుపడక
ప్రతిశబ్దముల్ దిశల్ వగుల నార్భటిసేయ
బలుఫిరంగీ గుండ్ల కళుకులేక
యాహవముచేసి పాదుశాహిదులెంచ
గూలద్రోయవె గుర్రముకొండ బురుజు
మట్ల యెల్లధరాధిరాణ్మణీ యనంత !
రాజ దేవేంద్ర! విక్రమ రాఘవేంద్ర''[1]

మట్ల అనంతరాజు గుర్రంకొండ దగ్గర రావెళ్ల సైన్యాన్ని జయించిన విషయాన్ని వివరించే మరొక చాటు పద్యమిది :

[2]''ఉదయాద్రి మన్నీల మదమిఱక జేయవా
ఘోరాజిలో గమలకూరియొద్ద

1, 2-ఈ పద్యాలు 'మట్లవారిమీద చాటువులు'- ఆంధ్రపత్రిక, సచిత్ర వార పత్రిక 5-4-1950. పుట 37 నుండి గ్రహింపబడినవి.

రావిళ్లమూకల రీవు లింకించవా
కొంచక గుర్రముకొండ యొద్ద
బాళెంబు దియ్యక పచరించి నిల్వవా
గుఱుతుగా గోళాల కోట యుద్ద
జేకొన్న చిరకీర్తి జెలరేగి మించవా
చప్పన్న దేశాది సభల యొద్ద
రాజదేవేంద్ర! పౌరుష రామచంద్ర
దానరాధేయ త్రిభువన నాతరాయ
విమల గుణశూర యెల్ల భూవిభుకుమార
మంతుకెక్కిన బలవంత! మట్లనంత ''

*కోలారు ముట్టడి:*

కోలారు ప్రాంతాలకు అమరనాయకుడైన తిమ్మన గౌడ కూడా వెంకటపతిరాయల అధికారాన్ని ధిక్కరించినవాడే. అతనికి కూడా బుద్ధి చెప్పాలని నిశ్చయించి వెంకటపతి రాయలు మట్ల అనంతరాజు, వెలుగోటి కస్తూరి రంగప్ప, తంజావూరు రఘునాథ నాయకరయ్య మొదలైన వీరులతో దండు వెడలినాడు. కోలారు ముట్టడిలో కోటపై నడిచే బాధ్యతను వెంకటపతిరాయలు మట్ల అనంతరాజుకు అప్పజెప్పినాడు మట్ల అనంతరాజు కోలారును స్వాధీనం చేసుకొని విజయాన్ని సాధించినాడు.

*మధుర నాయకుల్ని మట్టుపెట్టడం:*

రాయ సామ్రాజ్యాన్ని ప్రతిఘటిస్తున్న పాండ్యరాజులకు బుద్ధి చెప్పడానికి వెంకటపతి రాయలు మట్ల అనంతరాజును మధుర మీదికి పంపించినాడు. రాయల ఆదేశం ప్రకారం మట్ల అనంతరాజు మధుర వీరప్ప నాయకుణ్ణి సంహరించినాడు.

*వేలూరు లింగమనాయకుణ్ణి ఓడించడం:*

ఉత్తరార్కాడు జిల్లాలోని వేలూరును పాలించే లింగమ నాయకుడు కూడా వెంకటపతి రాయల అధికారాన్ని ప్రతిఘటించినవాడే. అతడు తన

బావమరిదియైన దావుల పాపయ్యను సర్వసైన్యాధ్యక్షుని చేసి 'నూరు ఏనుగులు, అయిదువందల జతల గుర్రాలు, వెయ్యిమంది అందలాల సామంతులు, పదివేల మంది విలుమూక, పన్నెండు వేలమంది తుపాకీమూక, ముప్పయి వేఁమంది పదాతులతో' యుద్ధానికి బయలుదేరినాడు. ఉత్తరమల్లూరువద్ద క్రీ శ. 1601లో సంకులసమరం జరిగింది. ఈ యుద్ధంలో మట్ల అనంతరాజుతో పాటు ఆతని కుమారుడైన తిరువేంగళరాజు కూడా పాల్గొనినాడు. మట్ల అనంతరాజు దామెరల చెన్నయ్య మొదలైన రణవీరుల సహాయంతో వేలూరు లింగమ నాయకుణ్ణి జయించి వేలూరు కోటను వెంకటపతి రాయలకు స్వాధీనం కావించినాడు.

"తనకు వేలూరు వరరాజధాని గాఁగ
వీర వెంకటపతిరాయ విఁభుడు మిగుల
ధరణిఁ బాలించె ధర్మతత్పరతఁ జెలఁగి"

అను రామరాజీయంలోని పద్యాన్ని బట్టి వెంకటపతిరాయల కాలంలో రాజధాని చంద్రగిరినుంచి వేలూరుకు మార్చబడినట్లు తెలుస్తున్నది. అందువల్లనే వేలూరునకు రాయవేలూరు అను పేరు వచ్చింది.

ఇట్లు రెండవ వెంకటపతిరాయల (1586-1614) వద్ద సేనానిగా ఉండి మట్ల అనంతరాజు పైన పేర్కొన్న మహత్తర విజయాల్ని సాధించినాడు. మట్ల అనంతరాజు 1606 నాటికి వెంకటపతి రాయలను "సకల హిందూరాజ్య సార్వభౌముణ్ణి" చేసి తాను మహామండలేశ్వరుడై సిద్ధవటం సీమను పరిపాలించినాడు.

*మట్లవారి సీమ:*

కకుత్థ్సవిజయ పీఠికా భాగంలోని షష్ఠ్యంతాల్లో "సిద్ధవట పటు పుట భేదన......" అనే భాగాన్నిబట్టి మట్ల అనంతరాజు రాజధాని సిద్ధవటమని శ్రీ. కొ.రా. వేం. కృష్ణారావుగారు ఊహించినారు.[1] కాని మట్ల అనంతరాజు

---

1. కకుత్థ్స విజయం-పీఠిక, మొదటి కూర్పు. సరస్వత్యనుబంధము-86 (1904).

వంశీయులు "నేటి కడప మండలములోని పూర్వభాగమునకు అణకువయగు బద్వేలు(పెద్దప్రోలు), సిద్ధవటము, కడప, పుల్లంపేట(పుల్లమ్మపేట)లేక రాజం పేట(రాజమ్మపేట) తాలూకాలను తమ యేలుబడిక్రిందికి దెచ్చుకొని, రాజంపేటకు సమీపముననుండు అనంతరాజు పేటను రాజధానిగా చేసికొని, విజయనగర పాలకులకు సామంతులై సీమాపరిపాలనము గావించిరి. వీరికి లోకువగా నుండి మండలభాగము వీరిపేర 'మట్లవారి సీమ' అయినది.' [1]

ఎఱ్ఱగుంట్లకోట రైల్వే కోడూరు దగ్గరున్నది. చిప్పిలి, నగరిపాడు, సిద్ధవటం మొదలైన ప్రదేశాల్లో మట్ల రాజులకు బలమైన కోటలుండినట్లు తెలుస్తున్నది. కకుత్స్థ విజయంలో అయోధ్యాపుర వర్ణన సందర్భంలో నగరిపాటి కోటలను మట్ల అనంతరాజు పేర్కొని ప్రశసించి యున్నాడు.

"పెదనగరిపాటి కోటలు
పదిగలవవి వజ్రమణుల పనులవి యెల్లన్
మొదలి తెగ మూఁటఁ దేరులు
మదకరులును హరులు రాజ్యమాన్యములుండున్."

-కకుత్స్థ (1-117)

నగరిపాడు నేడు ఒక చిన్న గ్రామం అక్కడ పది కోటలున్నాయని పై పద్యాన్నిబట్టి తెలుస్తున్నది. కాని ఈనాడు అక్కడ ఒక్కటికూడ లేదు. కొన్ని రాళ్ళగుట్టలున్నాయి. ఎర్రగుంట్ల కోటలో మాత్రం శిథిలమైన ఈనాటి కోటను మట్ల వంశంలో కడపటివాడై, కార్వేటి నగర సంస్థానాధీశ్వరులతో వియ్యమందుకొన్న మట్ల వేంకటపతిరాజు విక్రయించినాడు. సిద్ధవటంలోని కోటను గురించి కూడ కకుత్స్థవిజయం పీఠికా భాగంలోని షష్ఠ్యంతాల్లో (1-98) ఉంది. తక్కిన చోట్లలో మట్లవారి కోటలు నామమాత్రావశిష్టము లయినవి.

---

1. కోదండరామయ్య, తిమ్మావజ్ఝల- 'మట్లవారిమీద చాటువులు'- ఆంధ్ర పత్రిక, సచిత్ర వారపత్రిక 5-4-1950. పుట 27.

*మట్ల అనంతరాజును పేర్కొన్న తెలుగు కవులు :*

మట్ల అనంతరాజు రాయసామ్రాజ్య పునఃప్రతిష్ఠాపనకు తోడ్పడడమే కాకుండా మహామండలేశ్వరుడై పరిపాలనాదక్షుడుగ, కవిరాజుగా కూడ రాయల మార్గానుయాయియై వినుతి కెక్కినాడు.

మట్ల అనంతరాజు ఆస్థానంలో చౌడన్న, ఘంటన్నలనే హాస్యగాండ్రు ఉన్నట్లు కింది పద్యాన్ని బట్టి తెలుస్తున్నది.

''అన్నిట మంచివారు విమలాత్ములు హాస్యకళాధురంధరుల్
సన్నుతనీతిపాలకులు జాణలు నైపుణు లెవ్వరంటి రా
పన్నగ మట్లనంత నరపాలునిఁ గొల్చి మహానుభావులై
వన్నెకు నెక్కినట్టి గుణవంతులు ఘంటన చౌడగాండ్రురా ?''

కవి చౌడప్ప కకుత్స్థవిజయకర్తయైన మట్ల అనంతరాజుకు సమకాలికుడైనట్లు కొన్ని చాటు పద్యాల మూలంగా కూడ తెలుసుకోవచ్చు. కవి చౌడప్ప శతకంలో మట్ల అనంతరాజును ప్రశంసించిన పద్య మిది :

''లేరా రాజులు భూమిని
వారల నెవఁ డెఱుఁగు సకలవైభవముల నీ
వే రాజవు నీతికి విను
మారాజును నేనె కవుల మట్ల యనంతా!''

కాని ఈ శతకంలోని మరో రెండు పద్యాల్లో మట్ల అనంతరాజు మనుమడైన కుమార అనంతరాజుని ప్రశంస ఉన్నది.

''మట్ల కుమార యనంతుని
పట్లను వినయంబు లేని ప్రభువులు మహినే
పట్లను చెడిపోదురు చే
కట్లనుబడి కుందవరపు కవి చౌడప్పా !

''మీరిన పగుల మట్లకు
మారానంతుఁడు విక్రమార్కుని రీతిన్
మారుకొనినఁ బోనియ్యఁడు
గాతణమున కుందవరపు కవి చౌడప్పా!''

పైన పేర్కొన్న పద్యాలను బట్టి కవి చౌడప్ప మట్ల అనంతరాజు, మట్ల కుమారానంతరాజు ఇరువురి కాలంలోనూ కూడ ఉండి ఉన్నట్లు చెప్ప వచ్చు 'సరసాగ్రేసర చక్రవర్తి' యైన చౌడప్ప తన కవిత్వ ప్రౌఢితో మెప్పించిన ధరణీ నాయక కోటిలో మట్ల అనంతరాజే కాకుండా అతనికి సమ కాలికుడైన రఘునాథనాయకుడు కూడ ఉన్నాడు.

''నేరుతునని మాట్లాడగ
వారిజభవునంత వాని వశమా తంజా
వూరి రఘునాథ నాయని
గారెరుగగ గుందవరపు కవి చౌడప్పా!''

అను పద్యాన్ని బట్టి చౌడప్ప కొంచెం జాగ్రత్తగా వ్యవహరించి రఘు నాథనాయకరాజు సభలో నవ్వు పుట్టించినట్లున్నది. చౌడప్పతోపాటు మట్ల అనంతరాజు కొలువులో హాస్యకళాధురంధరుడుగా పేరుగాంచిన ఘంటనను గురించి వివరాలు తెలియవు.

మట్ల అనంతరాజును పేర్కొన్న మరొక తెలుగు కవి సవరం చిననారా యణ. అతడు కువలయాశ్వచరిత్రను రచించి తన పెంపుడు తండ్రియైన పెదనారాయణకు అంకితం ఇచ్చినాడు. ఈ పెద నారాయణ వీర వెంకటపతి రాయల పట్టాభిషేకానికి హాజరైనట్లు, అతని అనుగ్రహానికి పాత్రుడైనట్లు కువల యాశ్వ చరిత్ర పీఠికను బట్టి తెలుస్తున్నది. మట్ల అనంతరాజు వెంకటపతి రాయలకు సేనాని. కువలయాశ్వ చరిత్రావతారికలో కృతిపతి ఆధిక్యాన్ని ప్రశంసించే పద్యంలో ''తన కీర్తి మట్లనంత నృపాలముఖ్యగోత్రా మరేంద్రులు కొనియాడికొనఁగ'' (1-50) అని సవరం చిననారాయణ చెప్పి నాడు. దీన్నిబట్టి కువలయాశ్వ చరిత్రకారుడైన సవరం చిననారాయణ మట్ల అనంతరాజుకు కొంచెం తరువాతివాడని చెప్పవచ్చు.

మట్ల అనంతరాజు కకుత్స్థవిజయానికి సవరం చిననారాయణ కువల యాశ్వచరిత్రకు కొన్ని విషయాల్లో సామ్యాలున్నాయి. రెండు ప్రబంధాలు ఇంచుమించు ఒకే కాలంలో వెలువడినవే. రెండు గ్రంథాల్లోను అయిదాశ్వాసాలే ఉన్నాయి. రెండూ, గ్రంథకర్తల తండ్రులకు అంకితమీయబడినవే. ఇరువురు కవులునూ తమ తండ్రుల ఆస్థానములందుండే పండితకవులచే కీర్తింపబడి ప్రోత్సహింపబడినవారే. రెండిట్లోనూ కథాభాగాలు అత్యల్పంగా వర్ణనాంశాలు అధికంగా ఉన్నాయి. సంస్కృతపదబాహుళ్యమున్న ప్రబంధాలే రెండూనూ. ఇరువురి కవిత్వాలు ప్రౌఢమై, సలక్షణమై, రసానుగుణమైనట్టివే.

*మట్ల అనంతరాజు మతం :*

మట్ల అనంతరాజు మతాన్ని తెలుసుకోడానికి కకుత్స్థ విజయకృత్యాది ఇష్టదేవతాస్తుతి కొంత తోడ్పడుతున్నది. మట్ల అనంతరాజు కృత్యాదిని 'ఆయురారోగ్య' ప్రాప్తికి 'అలమేల్మంగావరుని' ఒక పద్యంలోను, 'మధుర శీతల సురభి వాఙ్మయ తరంగాలు' తన జిహ్వపై ప్రవహింపదలచడానికి వాగ్దేవి అత్తగారైన మహాదేవిని మరో పద్యంలోను పేర్కొని స్తుతించినాడు. 'వచశ్శుద్ధి' కోసం విష్ణువు చక్రాన్ని, శంఖాన్ని, ఖడ్గాన్ని, గదను, చాపాన్ని ఇంకోపద్యంలోను, తాను రచించే కకుత్స్థ విజయ కావ్యాన్ని 'జగద్విఖ్యాతం' చేయించడానికి విష్ణువు సేనానియైన విష్వక్సేనుని వేరొక పద్యంలోను వినుతించినాడు. శుద్ధవైష్ణవ దేవతలనే కృత్యాది దేవతాస్తుతిలో పేర్కొని స్తుతించడాన్నిబట్టి మట్ల అనంతరాజు వైష్ణవమతానుయాయి అని చెప్పవచ్చు.

మట్ల అనంతరాజు ''శ్రీమత్తిరుమల తాళ్ళప్పాచార్య చరణ సరసీరుహ సేవాసమాలబ్ధ సామ్రాజ్య ధౌరేయు''డనని ఆశ్వాసాంత గద్యలో తన గురువైన తిరుమల తాళప్పాచార్యుని భక్తితో స్మరించినాడు. వేంకటపతి రాయల మతగురువు తిరుమల తాతాచార్యులని తరిగొప్పుల మల్లన చంద్రభాను చరిత్రా వతారికనుబట్టి తెలుస్తున్నది. కళాపూర్ణోదయ కృతిపతియైన నంద్యాల కృష్ణమ రాజు గురువుపేరు తిరుమల శ్రీనివాసాచార్యులు ఈ శ్రీనివాసాచార్యులే సాంబోపాఖ్యాన కర్తయైన రామరాజు రంగప్పరాజుకు గురువు, మంత్రోపదేష్ట కూడ. తిరుమల తాళప్పాచార్యులు, తిరుమల తాతాచార్యులు, తిరుమల

శ్రీనివాసాచార్యులు - ఈ మువ్వురు వైష్ణవ మతాచార్యుల సంబంధ బాంధవ్యా లెట్టాంటివో తెలియరావు. తిరుమల తొళప్పాచార్యులు మట్ల అనంతరాజుకు మతదీక్షాగురువే కాదు ; కవితా విద్యాగురువు కూడ.

*కథా సంవిధానం :*

మట్ల అనంతరాజు 'మేధావైశద్యనిరీక్షాపేక్ష' తో నిబంధన చేసిన కకుత్‌స్థవిజయ ప్రబంధంలోని కథా స్వరూపమిది:

నారద సఖుడైన పర్వతుడు ఉపదేశం చేయడంవల్ల "పితామహ గృహార్చా విగ్రహంబైన రంగనివాసిం దన యింటి"కి తెచ్చుకొని పూజలు సల్ప డానికని ఇక్ష్వాకు బదరికాశ్రమానికి వెళ్ళి తపస్సు చేస్తున్నాడు. అతని ఉగ్ర తపస్సును భంగం చేయడానికి ఇంద్రుడు ప్రతి వసంతమాసంలోను దివ్య భామలను పంపించినాడు కాని వారి ప్రయత్నాలు ఫలించలేదు. తుదకు ఇంద్రుని పనుపున కర్పూరతిలక అనే అప్సరస ఇక్ష్వాకు తపస్సును భంగం చేస్తానని పంతంపట్టి వచ్చింది తన అందం, చందం అతని ముందేమీ పని చేయలేదని తెలుసుకొని "వంచిన తలయెత్తుట మనసించక" ఇంటికి పోయింది. జన్మాంతరము లెత్తి అయినా సరే ఇక్ష్వాకును పొందాలనుకొన్నది కర్పూర తిలక.

శ్రీరంగశాయి ఇక్ష్వాకు తపస్సుకు మెచ్చి అతని సంకల్పాన్ని సిద్ధింప జేసినాడు. ఇక్ష్వాకు తన పురానికి తిరిగివచ్చి విశ్వకర్మచే ఒక దివ్యాలయాన్ని రాతిప్రతిమలతో నిర్మింపజేసి అందు శ్రీరంగవిభుని నిలిపి పూజిస్తున్నాడు. ఇక్ష్వాకు ఒకనాడు కొలువు దీర్చి ఉండగా ఒక ప్రతీహారి,

"శిరసున నొక చాయ జిలుగురుమాలుతో
　　జీరణంబొక చెంపఁ జిక్కఁ జెక్కి
చికిలి నిగ్గులు చిమ్ము చిన్నారి క్రొవ్వాఁడి
　　చేబాడిద భుజాగ్ర సీమఁ జేర్చి
పసిఁడి కట్టులఁ బొల్చు పవడంపుఁ బిడితోడి
　　యులిదట్టి పొరవెంట మొలనమర్చి

పదను దప్పక లోహపాషాణముల బట్టు
చిత్రికపల్లు డాచేత బూని
నిగనిగని కెంపు ముక్కును నీలనయన
కాంతులును బచ్చరెక్కలకైవు గల్గు
కృతకకీరంబు వలకేల నతిశయిల్ల''[1]

అతని వద్దకు వచ్చినాడు. ఆ వడ్రంగి ఎవరో కాదు. దేవతల పనుపున మారువేషంలో వచ్చిన దేవశిల్పి. అతడు ఇక్ష్వాకుకు,

''నేమివినిర్భిన్ననిమ్నోన్నతంబుగా
నవనిభాగమున బిట్టుబుగఁ జాలు
చువ్వన నెగసి విష్ణుపదాంతరమున రె
క్కలు వచ్చెనో యనఁ గదలఁ జాలు
త్రోవ నిన్నడుగక దుస్సాధ్యగమనమై
దందహూక జగంబు దరియఁ జాలు
రవిరశ్మి రహిత ఘోర ప్రదేశంబులు
వెలుగించుకొని చొచ్చి వెడలఁ జాలు
పెంచి యొకచోట ననువై నటించఁజాలు
మించి యొకచోట విభువై చరించఁ జాలు''[2]

నట్టి దివ్యరథాన్ని రప్పించి ఇచ్చినాడు

ఇక్ష్వాకుకు నూర్గురు కొడుకులు. పెద్ద కొడుకు పేరు వికుక్షి. మహర్షులు అతణ్ణి సుకుమారుడని పేర్కొన్నారు. ఇక్ష్వాకుదేవశిల్పి ఇచ్చిన దివ్యరథాన్నెక్కి తన పెద్ద కొడుకైన సుకుమారుడు రథసారథ్యం చేస్తుండగా గగన సంచారం చేసినాడ. రథాన్ని తోలుతూ సుకుమారుడు తనలో ఇట్లా అనుకొన్నాడు :

''ఒక వేల్పుతో మాటలకు నిల్పవలసినఁ
బగ్గముల్ గదియంగఁ బట్టుకున్నఁ

1. కకుత్స్థ విజయం. (2-23)
2. కకుత్స్థ విజయం. (2-33)

గెలని వింతలు చూడఁ దలఁపు గల్గినచోట
　　నెప్పుడప్పటి వాఁగె త్రిప్పుకున్న
ముంచిపోవు విమానములు కూడఁ గోరినఁ
　　గేలెత్తి ధేయని తోలకున్న
జగదంతర ప్రజా సమ్మర్ద పథముల
　　హాధిరాయని వేగ మాగకున్న

మసలుఁ గేడించుఁ దిరుగు సమ్మతిగ నురుగు
రథిక హృదయం బెఱింగి యౌరా గుణాలు
నొగల కొక్కండలంకార మగుట కాక
యేను సారథినని వాని బూననేల''

— కకుత్స్థ (2-48)

ఆ రథం గగన మార్గంలో పోతుండగా 'క్రొత్తయెలమి'తో ఆ దారంట వస్తున్న నారదుని ఇక్ష్వాకు చూచి నమస్కరించి తన రథంపై ఎక్కించుకొని కుశలప్రశ్నలడిగినాడు కలహాలు లేక కళ్లు కాయలు కాచి బడలికతో ఉన్న నారదుడు కయ్యాలు చూడడానికని ఆ రథంలోనే కూర్చున్నాడు ఆ తరువాత ఎన్నో వింతలు విడ్డూరాలు జరిగినాయి. తన వంశంవాళ్లే అయిన ఇక్ష్వాకును అతని కొడుకైన సుకుమారుని చూచి సూర్యుడు కరుణించినాడు. సుకుమారుని గర్భంలో తన అంశాన్ని దాచినాడు. ఉత్తరోత్తరా అతని కడుపున ఒక కాయ కాయడానికి ఒక విత్తు దాచినాడు.

రథం సాగిపోతుండగా గగనమార్గంలో ఒక కాసారం ఏర్పడింది. పక్షులెన్నో వచ్చి వాలినాయి. వాస్తవానికి అది కాసారం కాదు ఒక రాక్షసుడు అవి పక్షులు కావు అతని పరివారం. తండ్రి కొడుకు లిరువురు యుద్ధం చేసి ఆ రాక్షసుల్ని ఓడించినారు. తన తండ్రియైన ఎల్లరాజుతో కలిసి తాను ఎట్లా యుద్ధాల్లో పాల్గొన్నాడో అట్లాగే తనతో కలిసి తన కొడుకు తిరువెంగళరాజు యుద్ధాల్లో పాల్గొనినాడు. మట్ల అనంతరాజు ఇక్ష్వాకు సుకుమారుల ఆ ఉమ్మడి యుద్ధాన్ని తన జీవితంలోని ఘట్టాలను తలచుకొని కాబోలు స్వానుభవ పూర్వకంగా ఇట్లా వర్ణించినాడు :

"జనకుండు దుమికి కచుని( గీటడంచిన(
దనయుండు పృథురోము తల యదల్చె
గురు(డు భేకగ్రీవు కుత్తుక దునిమిన
సుతు(డు రోహితుని జీవితము( గొనియె(
దండ్రి యధ్వరవిఘాతకు బారి సమరిన(
గొడుకు శంఖదకాఖ్యు గోలుమస(గె
నయ్య రాజీవబాహాసురు( బొలి( గొన్న
బిడ్డండు కునఖుని( బిలుకు మార్చె
దివిజ రాజాది దిక్పాల దేవతాక
విశిఖముల నిట్లు దైతేయువిశసనంబు
సలిపిరిక్ష్వాకు సుకుమారులలయకెలమి(
గొంతవడి వంతువడి మరుత్కోటి వొగడ"

—కకుకుత్స్థ (2-119)

ఆ ఆకాశసమరాన్ని నారదుడు రథంలోనుంచే తిరుబాటుగా చూస్తూ "కొలువో యిది రణమొ యిష్టగోష్ఠి కథకుం దలసూపె" నని మెచ్చుకొన్నాడు. గగన కాసార కథను, ఆ రాక్షసుని జననవేళను, అతని కాపేరు అన్వర్థమని సరస్వతి పలకడం, బ్రహ్మ ఇచ్చిన వరంవల్ల బహు మాయావియై "అవని యవనిగ నాకసంబాకసముగ జలము జలముగ గాడ్పు గాడ్పుగను బాంచ భాతికాంగంబు సరసియై బయలు బ్రా(క" అతడు తేజంతో రాజిల్లే విధానాన్ని మొదలైన కథలను 'వచః ప్రయోగచాతురిన్' నారదుడు ఒక పక్క చెప్ప సాగినాడు. ఆ గగన కాసార యుద్ధం ముగిసిన తరువాత తండ్రీ కొడుకులు నారదునితో కలసి వివిధ లోకాలను సందర్శించినారు.

చివరకు నారదుడు కర్పూరతిలక కథను కూడ ఇక్ష్వాకుకు వినిపించి నాడు. "ఆ నాడు నీ తపోమహిమ ముందు తన అందం ఏమీ పని చేయలేదని తెలుసుకొని బాధపడి, కర్పూరతిలక తపస్సు చేసి అయినా సరే నీకు 'మోహపు దేవి' కాగోరి, కణ్వమహాముని ఆశ్రయించింది. ఆ ముని 'అవని(బుట్టు'మని ఆమెకు వరంలాగ మారిన శాపాన్ని ఇచ్చినాడు. 'కణ్వముని యనుంగుబట్టి(గా జేపట్టి'నాడు. 'జన్మాంతరంబు లెత్తియైనను భవత్సంయోగంబ కావలయునని

యభిలషించి యున్న యక్కన్నియం బరిగ్రహించుట యుచితంబు' అని నారదుడు చెప్పినాడు. నారదుని వల్ల కర్పూరతిలక విరహాన్ని తెలుసుకొని ఇక్ష్వాకు ఆమెను అనుగ్రహించినాడు. ఇక్ష్వాకు రాకడలు ఒక తెల్ల తుమ్మెద కర్పూరతిలకకు చెప్పింది.

''చెప్పిన తేటిఁగాంచి మునిచెద్దియి మనోజునకున్నహాయ మీ
యప్పటి కొండపుట్టె సకియా యిక నోడకు మన్న యన్నులం
దెప్పిరి చూచె నప్పుడొక తీఋననున్న విరాళిబాల యా
త్రిప్పుల నన్నుఁ బెట్టఁ డిఁకఁ దెచ్చు విభున్మరుఁ డంచు వేడుకన్.''

—కకుత్స్థ (3-144).

ఇక్ష్వాకు తన పెద్దభార్యయైన 'వికుక్షి తల్లియనుజ్ఞ' (కకుత్స్థ3-148)తో కర్పూరతిలకను వివాహమాడినాడు. మట్ల అనంతరాజు తన తండ్రికి నాలుగోభార్య కొడుకు. కాబట్టే ఇట్లా వ్రాసి ఉంటాడు. ఇక్ష్వాకు కర్పూర తిలకను వివాహం చేసుకొని గృహ ప్రవేశం చేసినాడు. నూతన దంపతులు లజ్జాభరం వదలి క్రీడించినారు.

''అధరాధరామృతం బాస్వాదనము సేయు
మోహ మందఁగఁ జేసి ముద్దుఁబెట్టు
దరహాస మాననాంబురుహసీమ ఘటించు
మునిపంట నొయ్యన మోవి నొక్కు
నెడనెడఁ గిల్గంటు సడలిన ముడిగొల్పుఁ
జేలాంచలంబునఁ జెమరు తుడుచు
నసదులేఁ బల్కులఁ గొసరి పేరుఁ బిల్చుఁ
గనుదోయి సౌఖ్య సంక్రమముఁ దేల్చు
గబ్బి గుబ్బల నెదనాటఁ గౌఁగిలించుఁ
బారువములకుఁ గళరవాభ్యాస మొసఁగుఁ
జేరికొనఁ గోట మక్కువఁ జెక్కునొక్కు
యువతి సురతంబుఁ జల్పు నయ్యుత్పలాక్షి''

—కకుత్స్థ. (4-18)

అప్పటికే నూర్గురు కొడుకులను కన్న ఇక్ష్వాకుని ''భావ భవ బ్రహ్మను భవావిష్కృత హృదయు''ణ్ణి చేసిన తరువాత మట్ల అనంతరాజు తాను వ్రాస్తున్నది కకుత్స్థవిజయ మనీ, కథానాయకుడింకా జన్మించలేదని గుర్తు తెచ్చుకొన్నట్లున్నది వెంటనే ఇక్ష్వాకుచేత సుకుమారునికి పట్టంకట్టించి అతనికి కకుత్స్థుడు జన్మించినాడని చెప్పినాడు కకుత్స్థుడు పెరిగి ''వీర శృంగార మయాకారుడై'' తన తండ్రికి అండగా ఉంటున్నాడు. ఒకనాడు సుకుమారుని సముఖానికి,

''త్రెంచి గురువెందపేరు క్రొమ్మించు వడిస
మేఘమునఁ దోఁచు నొక కఱ్ఱిమేని యెఱుకు'' [1]

వచ్చి క్రూరమృగాల వల్ల తాము పడే బాధలను వివరించినాడు. సుకుమారుడది రాక్షసమాయగా అనుమానించి తన కుమారుడైన కకుత్స్థుని వేటకు పురమాయించినాడు. వేటలో, అసుర సంహారంలో కకుత్స్థుడు తన ప్రజ్ఞను చూపినాడు దీపధ్వజుని ''నెచ్చలు ల్మృప్పుంద్రలోపల మొదలివారైన'' తిర్యఘ్న, మృగఘ్న, నరఘ్న, అర్యఘ్నులనే నల్వురు ''ఏవేళ కేరూపు వలసిన దాల్తురు''. ఆ మృగరూప రాక్షసుల్ని కకుత్స్థుడు మట్టుపెట్టినాడు. కకుత్స్థుని వేటనైపుణ్యాన్ని వేయికళ్లతో చూడవలసిందే అని బోయరాజన్నాడు. తాను అంతే చేసినానని ఆ మాటలో సహస్రాక్షుడు ప్రవేశించినాడు. ఈశ్వర తేజోజనితుడైన దీపధ్వజుని వృత్తాంతాన్ని ఇంద్రుడు కకుత్స్థునికి వివరించినాడు. కకుత్స్థు డధిరోహించి దీపధ్వజునితో యుద్ధం చేయడానికి వీలుగా వజ్రి వృషభంగా ఇట్లా మారినాడు ·

''పకుటంబు మాయమై చికిలి కొమ్ములు పుట్టెఁ
బెనుదోరమై పెద్దపెరిఁగె మొగము
రెండుండి పెఱకన్ను లుండక పొడలుబ్బె
సోఁగలై యడ్డంబు సాగె చెవులు
కంఠహారము డాఁగి గంగడోలుదయించె
వెడలుపు నిడుపునై మెడ పొసంగె

1. కకుత్స్థవిజయం (4-49.)

మునుపున్నపవి లేక వెనుక వాలముదోఁచెఁ
గేలు గాలున నలుగాలు నిలిచెఁ

గరపదాబ్జంబు లిరువాయి గౌరిజలయ్యె
నంస శిఖరములుమ్మా(పురంబై తనర్చె
నడువఁ దడవని కాని కొల్వుదుగ నుటికి
వెస బసవరాయఁడై ఉంకెవేసె వజ్రి''

—కకుత్స్థ (4-158)

కకుత్స్థుడు పురంజయుడనే పేరుతో ఇంద్రవాహనుడైన దీపకేతుడనే రాక్షసుణ్ణి, అతని పరివారాన్ని సంహరించినాడు.

గ్రంథాంతంలో ఫలశ్రుతి ఇట్లా ఉంది :
''ఇది ధనరాసుల కథయని
చదివిన వ్రాసినను వినిన సకలము భద్ర
ప్రదుఁడగుచు రంగనాయకుఁ
డొదవించు సిరులు నిక్కమూర్వీనాథా!''

— కకుత్స్థ (5-194)

*కథానిర్మాణంలో అనుకరణలు :*

తెలుగున వెలసిన ప్రాచీన సాహిత్యమంతా సంస్కృత సాహిత్యానికి ఏదో ఒక విధంగా అనుకరణమే. అనుకరణమనేది సాహిత్యంలో తప్పనిసరి.

పదహారో శతాబ్దంలో అసాధారణ ప్రజ్ఞావంతులైన ఇరువురు కవులు విభిన్నమైన పద్ధతులను కొత్తగా ప్రవేశపెట్టి తెలుగు సాహిత్యంలో చెరగని ముద్రలు వేసినారు. పింగళి సూరన కళాపూర్ణోదయాన్ని సృష్టించి ఒక నవ్య రీతికి నాంది పలికినాడు రామరాజ భూషణుడు వసుచరిత్రను రచించి మరొక కొత్తపంథాకు శ్రీకారం చుట్టినాడు కొత్త కథను కల్పించి గమ్మత్తుగా నడిపించి వైచిత్ర్యాన్ని చూపడం పింగళి సూరన పద్ధతి. చిన్న కథను తీసుకొని అడుగడుగునా శ్లేషచమత్కారాదులతో కావ్యాన్ని నడిపించడం రామరాజభూషణుని పద్ధతి. ఈ ఇద్దరు కవులూ పాఠకులను ఆశ్చర్యచకితులను చేసినవారే; సమకాలిక కవులపై ప్రగాఢమైన ప్రభావాన్ని ప్రసరింపజేసినవారే.

రామరాజు రంగప్పరాజు రచించిన సాంబోపాఖ్యాన రచనా కాలాన్ని గురించి చర్చిస్తూ కట్టి సాంబమూర్తి శాస్త్రిగారు 'వసుచరిత్రము, కళాపూర్ణోదయ ప్రభావతీప్రద్యుమ్నములు, చంద్రభాను చరిత్రము మొదలగు ప్రబంధము లెల్ల దీనికి తరువాత రచింపబడినవేయని తెలియనగును''[1] అని వ్రాసినారు.

మట్ల అనంతరాజు కథా నిర్మాణంలో సాంబోపాఖ్యానాన్ని, కధ చెప్పే తీరులో కళాపూర్ణోదయాన్ని అనుసరించి కకుత్స్థవిజయాన్ని రచించినాడు. రామరాజ భూషణుని శ్లేష చమత్కారరచన కకుత్స్థవిజయంలో అంత కాన రాదు.

సాంబోపాఖ్యానంలో కథానాయకుడైన సాంబుని పుట్టుక చతుర్థాశ్వా సంలో చెప్పడం జరిగింది. సాంబుడు పుట్టడానికి పూర్వం ఎన్నో విషయాలను రామరాజు రంగప్పరాజు వర్ణించినాడు. ఈవిషయాలకు ఉత్తర కథలో చెప్పిన విషయాలకు బొత్తిగా సంబంధముండదు. అందువల్ల సాంబోపాఖ్యానంలో కథైక్యం లేదనే చెప్పాలి.

మట్ల అనంతరాజు కకుత్స్థవిజయంలో కూడ కథైక్యం లేదు ఇందులో 587 గద్య పద్యాలైన తరువాత నాలుగో ఆశ్వాసం 35వ పద్యంలోగాని కకుత్స్థుడు జన్మించడు. కకుత్స్థుడు పురంజయుడనే పేరుతో ఇంద్రవాహుడై దీపపతాకుడనే రాక్షసుణ్ణి సంహరించే అల్పమైన కథను ఆధారంగా చేసుకొని మట్ల అనంతరాజు అనల్పకల్పనలతో పెంచి అయిదాశ్వాసాల ప్రబంధంగా కకుత్స్థ విజయాన్ని రచించినాడు. కకుత్స్థవిజయానికి ముందు కకుత్స్థుని తండ్రి సుకుమారుని కథను, అతని తండ్రి ఇక్ష్వాకు ఇతివృత్తాన్ని విపులంగా వివరించినాడు. ఈ ఇక్ష్వాకు సుకుమారుల కథకు కకుత్స్థుని కథకు ప్రకృష్ట మైన సంబంధమేదీ లేదు. ఈ ప్రబంధంలో మట్ల అనంతరాజు ముఖ్యోద్దేశ్యం రస ప్రకటనమే కాని కథాసంవిధానం కాదు.

కకుకుత్స్థవిజయంలో కథ చెప్పే తీరంతా కళాపూర్ణోదయానికి అనుసర ణమే. కళాపూర్ణోదయంలోని కథ శృంగార ప్రధానమైంది కావడం వల్ల బాగా

---

1. సాంబోపాఖ్యానము-పీఠిక, p. viii. ఆంధ్ర సాహిత్య పరిషత్తు వారి ప్రచురణ (1932).

రక్తి కట్టింది. కకుత్స్థవిజయం వీరకావ్యం. కళాపూర్ణోదయం తరువాత తెలుగు ప్రబంధాల్లో నారదునికి ప్రాముఖ్యం హెచ్చింది కళాపూర్ణోదయంలో నారదుడు ఒక లోకంలో జరిగిన కథకు సూత్రధారి. కకుత్స్థవిజయ కథలో నారదుడు కేవలం కథకుడు మాత్రమే కళాపూర్ణోదయంలో పింగళి సూరన చూపించిన మార్గంలోనే నడచి మట్ల అనంతరాజు కకుత్స్థ విజయ ప్రబంధంలో నాటకశయ్యను కథారచన కనువుగా ప్రవేశపెట్టినాడు. ''చెప్పే తీరు ఎంత బాగున్నా చెప్పిన కథలో పసలేక పోవడం చేత ఈ కావ్యం అంత రాణించదు'' (1) అని ఆరుద్రగారు కకుత్స్థవిజయాన్ని గురించి చెప్పిన మాట అక్షరాలా నిజం.

*మట్ల అనంతరాజు కవితా విశేషాలు:*

'మేధా వైశద్య నిరీక్షాపేక్ష'తో కకుత్స్థవిజయాన్ని రచించిన మట్ల అనంతరాజు 'మేధా వారిజగర్భు'లైన వ్యాస వాల్మీకులను మాత్రమే గ్రంథారంభంలోని పూర్వకవిస్తుతిలో పేర్కొన్నాడు. తెలుగు కవుల నెవ్వరిని స్తుతించకపోవడాన్ని బట్టి అనంతరాజు పూర్వాంధ్ర కవులను అంతగా అనుసరించలేదనే చెప్పవలసి వుంటుంది.

మట్ల అనంతరాజు కవిత్వంలోని విశేషాలు కొన్ని :

*వర్ణనలు :*

'కవయతీతి కవిః'. వర్ణించే వాడు కవి అని చెప్పడంవల్ల కావ్యమంతా వర్ణనమే అనవలసి వస్తుంది. కాని సాధారణంగా 'వర్ణన' శబ్దాన్ని ఈ అర్థంలో గ్రహించడం లేదు నగరం, శైలం, సూర్యోదయం, చంద్రోదయం ఇత్యాది వర్ణనమే కావ్యంలో వర్ణన శబ్ద వాచ్యంగా భావించడం జరుగుతున్నది కావ్యంలో అష్టాదశవర్ణనలుండాలని ఆలంకారికుల నియమం. వేట, మౌనీంద్ర పుణ్యాశ్రమం, కన్యాంగ సౌందర్య కథనం, దౌహృదం- అనువాటిని కూడా చేర్చి కావ్యంలో ఇరువదిరెండు వర్ణనలను అప్పకవి చెప్పినాడు. వాటిలో కొన్ని తక్కువైనా దోషం లేదు.

---

1. సమగ్ర ఆంధ్ర సాహిత్యం IX. పుట 150.

కకుత్ స్థ విజయంలో కథాకాల పరిధి పెద్దది కావడం వల్ల అందు అష్టాదశ వర్ణనలకే కాకుండ, అప్ప కవి అదనంగా చెప్పిన వర్ణనలకు కూడా అవకాశం కలిగింది.

పురవర్ణన : 1 ఆశ్వా. (111-143)

మట్ల అనంతరాజు సాకేతపురంలోని కోటలను, గరిడీలను, వారకాంతలను, చాతుర్వర్ణ్యాన్ని, పుష్పలావికలను, ఉపవనాంతాలను విపులంగా 33 పద్యాల్లో వర్ణించినాడు.

వనవిహార వర్ణన : (3-91, 92)

జలకేళి వర్ణన : (2-89)

తనయోదయ వర్ణన : కకుత్‌స్థుని జననం. (4-35)

సూర్యాస్తమయ వర్ణన : (3-99)

చంద్రోదయ వర్ణన : (3-102)

విరహ వర్ణన : 3 ఆశ్వా (106, 107)

విరహంలో ఉన్న కర్పూరతిలకకు చెలుల శిశిరోపచారాలు: 3 ఆశ్వా. (108-125)

దౌత్యవర్ణన : (3-144)

యాత్రావర్ణన : ఇక్ష్వాకు సుకుమారులు నారదునితోపాటు బ్రహ్మలోక, ఇంద్రలోకాల్ని సందర్శించడం. 3 ఆశ్వా.

సముద్ర వర్ణన : (4-165)

సరోవర్ణన : (2-81)

వివాహవర్ణన : కర్పూర తిలకా ఇక్ష్వాకుల వివాహం. 3 ఆశ్వా. (117-163)

సంభోగ వర్ణన : 4 ఆశ్వా. (15-21)

యుద్ధ వర్ణన :

కకుత్స్థ విజయంలో ఇక్ష్వాకు సుకుమారుల గగన కాసార యుద్ధం (2 ఆశ్వా), వేట సందర్భంలో కకుత్స్థుడు మృగరూప రాక్షసులతో చేసిన యుద్ధం (4 ఆశ్వా), కకుత్స్థుడు ఇంద్ర వాహనుడై దీప ధ్వజునితో కావించిన యుద్ధం (5 ఆశ్వా) విపులంగా వర్ణింపబడినవి.

మౌనీంద్ర పుణ్యాశ్రమ వర్ణన :

బదరికాశ్రమంలోని మునుల తపోవిభవ మహిమాభివర్ణన మీ క్రిందిది:

''మునులిష్ట సల్లాపమున నున్నఁ జెంగటఁ
జంచరీకము ఝుంకరించ వెఱచుఁ
దపసుల పైఁ రంచుఁ దలపోలంబునఁ బోవు
మెకము నీవరిచేను మేయవెఱచు
వ్రతులు కాషాయ వస్త్రము లారఁగట్టినఁ
బ్లవగపోతము చెట్టు ప్రాఁక వెఱచు
మౌనుల మణులువో దీన నున్నవి యంచు
నంచ తామరకాయ చించవెఱచు

నేమనఁగవచ్చుఁ గొనియాడనెవ్వఁ డెఱుఁగు
నజభవాదులకైన నత్యద్భుతంబు
బదరికాశ్రమ వాస్తవ్య పారికాంక్షి
వివిధ నియమోపచిత తపోవిభవ మహిమ.

ఆశ్రమ స్థలరక్షకావరణంబుగాఁ
గంపకోట ఘటించు గంధకరటి
యుటజాజిరంబుల నూబిపాఱఁగ గ్రొచ్చి

యేటికల్దిని వైచు నేకలంబు
మునికుమారులఁ దోఁడికొనిపోయి యడవిలోఁ
బుట్టతేనియ త్రవ్వి పెట్టు నెలఁగు
పొదముండ్లు చెలిపి తపోధనుల్చనుత్రోవ
ఘంటాపథము సేయుఁ గాసరంబు

జపతపోమను గాధ నిష్ఠలకును బ్రతి
బంధకము సేయు రాక్షసభటుల మీద
నెలయఁ గల్గించుకొని పోయి గెలిచి వచ్చు
నచటి కంఠీరవములు సంయముల ప్రోల''

— కకుత్స్థ (1-150, 151)

పై బదరికాశ్రమ వర్ణనకు నాచనసోముని క్రింది బదరికాశ్రమ వర్ణన మార్గదర్శకమై ఉంటుంది.

''పవనవేగవిశీర్ణపాదపాగ్రంబుల
జడియకుండఁగఁ బట్టు సామజములు
పూజార్థ నియమిత పుష్పవాటికలపై
మధుకరంబులఁ జోఁపు మర్కటములు
నవభృథస్నాన పర్యంత నిర్మలతకై
కాసారములఁ గాచు కాసరములు
నిజ నిజోటజభాగ నీవార సీమలు
సౌరక కావలి యుండు సూకరములు

గలిగి కంసవైరి కన్నుల పండువై
చెలువు మిగిలెఁబూర్ణ కలశ విగళ
దాలవాలవారి హారితమునుచారు
కాశ్రమంబు బదరికాశ్రమంబు''

—ఉత్తర హరివంశము (2-109)
(వావిళ్లప్రతి-1967)

బదరికాశ్రమ వర్ణన : (1-159)

కన్యాంగ సౌందర్య కథన వర్ణన: 3 ఆశ్వా. (71,72)

దౌహృదవర్ణన . కకుత్స్థుని తల్లియైన అంశుమతి గర్భవైభవ వర్ణన: 4 ఆశ్వా. (30-34)

వేట వర్ణన : 4 ఆశ్వా. (71-98)

కకుత్స్థుని వేట సందర్భంలో వేటకాండ్రు సమకూర్చుకొనే వివిధ సాధన సామగ్రిని, వివిధ రకాల వేటలను, వేటాడే పద్ధతులను మట్ల అనంతరాజు సుమారు 28 పద్యాల్లో సమయోచితంగా వర్ణించినాడు. నాచన సోముడు ఉత్తర హరివంశంలో హంస డిభకుల వేట సందర్భంలోను, పిల్లలమర్రి పినవీరభద్రుడు శృంగార శాకుంతలంలో దుష్యంతుని వేట సందర్భంలోను, శంకరకవి హరిశ్చంద్రోపాఖ్యానంలో హరిశ్చంద్రుని వేట సందర్భంలోను, అల్లసాని పెద్దన మనుచరిత్రలో స్వరోచి వేట సందర్భంలోను, ధూర్జటి కాళహస్తి మాహాత్మ్యంలో తిన్నని వేట సందర్భంలోను వర్ణించిన వర్ణనలలో కొన్ని మట్లఅనంతరాజుకు కకుత్స్థుని వేట వర్ణనలో మార్గదర్శకాలైనవి.

వర్ణనల్లో మట్ల అనంతరాజు చూపిన ప్రతిభ ప్రశంసనీయం. ఇతర ప్రబంధ కవుల్లాగ వర్ణనాంశాలను విశేషంగా పెంచి మట్ల అనంతరాజు కథా వేగాన్ని కుంటుపడనీయలేదు. ఇది అతని ప్రబంధ రచనా పద్ధతిలో మెచ్చుకో దగిన గుణం.

*పాత్ర చిత్రీకరణం :*

కకుత్స్థ విజయం ప్రారంభంలో ఇక్ష్వాకు గుణ గణాలను అతడు రంగ శాయిని ప్రత్యక్షం గావించుకొని ఇలవేల్పుగా ఆరాధించిన తీరును మట్ల అనంత రాజు వర్ణించినాడు[1] భావి కథార్థం ధ్వనితమయ్యేటట్లుగా ఇక్ష్వాకును వర్ణించి

---

1. కకుత్స్థ విజయం (1-145, 146)

ఇక్ష్వాకు పాత్రకు ఎంతో ఉదాత్తతను కల్పించినాడు. భగవద్భాగవతుడైన ఇక్ష్వాకు అనుపమశక్తి కలవాడని నిరూపించినాడు. ఇక్ష్వాకు, సుకుమార, కకుత్స్థులను భోగులుగా కాకుండా దుష్ట శిక్షకులుగా చిత్రించినాడు. ప్రధాన పాత్రల ముఖంగా మల్లు అనంతరాజు వైష్ణవ పారమ్యాన్ని వ్యక్తం చేసినాడు. కథానాయిక కర్పూరతిలక 'అవనిఁబుట్టిన' అప్సరస. నారదుడు, ఇంద్రుడు, ప్రతి నాయకుడైన దీపధ్వజుడు, దేవశిల్పి, కణ్వమహర్షి, బోయరాజు, దీపధ్వజుని అనుచరులు- మొదలైన పాత్రలను మల్లు అనంతరాజు కథాభి ముఖంగా రసానుగుణంగానే పోషించినాడు.

*రసావిష్కరణ :*

కకుత్స్థ విజయంలో అంగిరసం యుద్ధ వీరం. కకుత్స్థునికి దీపధ్వజునికి జరిగిన యుద్ధ వర్ణన సందర్భంలో యుద్ధవీరం ప్రధానంగా పోషింపబడినది. దానికి పరిపోషకంగా కర్పూరతిలకా ఇక్ష్వాకుల పరిణయ ఘట్టంలో శృంగారం పోషితమైంది. ఇక్ష్వాకు తపోవర్ణన సందర్భంలో శాంతం, యుద్ధ ఘట్టాల్లో ఆయా చోట్ల రౌద్ర, బీభత్స, భయానక, అద్భుత రసాలు పోషింప బడినవి. వీర రస ప్రధాన కావ్యం కావడంవల్లనేమో కకుత్స్థ విజయంలో కరుణ హాస్య రసాలకు ప్రవేశం చాలా తక్కువ.

*మల్లు అనంతరాజు రచనా విధానం :*

శైలి కవి రచనావిధానానికి భావ వ్యక్తీకరణకు సంబంధించినది. కకుత్స్థవిజయంలో భాషా రమ్యత, పద గుంఫన ప్రావీణ్యం ప్రకటితములైనాయి. మల్లు అనంతరాజు రచనంలో చక్కని కవితాశిల్పం, శైలీ వైవిధ్యం ఉన్న పద్యా లెన్నో ఉన్నాయి. అతని కవిత్వం ప్రౌఢమై, సలక్షణమై, రసాస్పదమైంది.

ప్రబంధాల్లో నాటకశైలిని అధికంగా ఆదరించిన కవి పింగళి సూరన. అతని మార్గంలోనే నడచి మల్లు అనంతరాజు కకుత్స్థ విజయంలో చాలా చోట్ల నాటకీయ రచన కనువుగ సంభాషణలను కూర్చినాడు. వేటను గురించి ఎఱుకుకు సుకుమారునికి జరిగిన సంభాషణ (4 ఆశ్వా. 50-64) లో నాటకీయత ఉంది.

కుకుత్స్థుని ధాటి కాగలేక తెగిపోయిన సిగలతో త్వరిత పదగతి నరుగు దేరు దైత్యుల నాలోకించి పదరుతూ శిపధ్వజుడు పలికే ఈ పల్కులలోని ప్రాసంగిక శైలిని పరికించండి :

"తల లివి యేమి మీ పరుగుతత్తర మేమి' యనంగ 'నంతకా
దులు వృషభాధిరూఢ నరుతో మన తోఁటకు వచ్చి మమ్మ ని
ట్లలజడిఁ బెట్టి' రన్న నతఁ డవ్వని నేమటి నిద్రవోవఁగా
నెలుకలు గొట్టెనేమొ సిగ తెక్కుడి సుద్దులిసీ చనుండనన్''

—కకుత్స్థ (5-17)

ఇక్ష్వాకు చూచిన బదరికావనాన్ని మట్ల అనంతరాజు సంస్కృత పద బంధాలున్న గద్యశైలిలో ఇట్లా వర్ణించినాడు.

''ముని శ్రావిత లక్షణ ప్రత్యభిజ్ఞ నెఱింగి శతాంగారోహణంబు దొరంగి కురంగీ పురోగమన నిర్దిష్ట మార్గ సులక్ష ప్రవేశంబును బాటల పనస పారిజాత సరళ సహకారాది సాంద్రతా మిహిరకిరణ నిరాశంబును గ్రమ జటా పరన పారాయణ వటు వినిక్షిప్త విస్మృత సరస్తట సమిత్కుశగ్రహణ నియుక్త ప్రక్షాళిత పాణియుగ ప్లవగ పదద్వయానుధావన దర్శనీయపద్యాహద్యసకాశంబును గుహరమరుదుపరి చంక్రమణసముచ్చలిత సురభికుసుమ గర్భీకరణావసర సమున్నమిత శిరశ్శ్రుతి వనితాలంకృత కబరీభరవిశంకిత హోమ ధూమ నిరంతరాకారంబును దదాగమ వితర్కిత నిజతపశ్చరణ నిశ్చయు పరస్పర విజ్ఞాపన పర చతుర శారికా వచన నిర్దేశంబును నభిమత గ్రంథ సముపక్రమ సమర్చన సమయ సమాసీన గురు శిష్యపురః ప్రసవ ఫలవర్షి వనదేవతా కర కమల పూర్వోత్తర దక్షిణ దృశ్యా దృశ్యతా జనితవికచ స్వకీయ వదనవిలోకి శుకనికర ప్రపంచిత కించిన్ముఖరహాస వేశంబును నగ్నిష్టోమాదిహవిర్భాగ భోగాహూత సర్వనిలింప సమాగతి జ్ఞాపకయాగశాలా బహిర్భాగ భాగైరావణ స్వకృత భోజినీ భూత కరశీకర పిప్పల పలాశంబును దపః ప్రారంభపరిణామ ప్రవర్ధన దశాంతర ప్రసన్న పరాదృష్ట హరిహరబ్రహ్మ సందర్శన సంభ్రమోద్ధిత నమోంత నిగమాంతస్తవ పాఠక బ్రహ్మరాజర్షి పరిష్కృత ప్రాగాది దిగవకాశంబును నగు బదరి కాశ్రమ ప్రవేశంబుం గనుగొనుచు.''

—కకుత్స్థ (1-159)

మట్ల అనంతరాజు క్రింది వచనరచనలోని శబ్దశిల్పాన్ని చూడండి:

"అని యమ్మందగమన లందఱు నందంద కందుచుఁ గుందుచు నిందు కందర్ప మందానిలాదుల ననవరత మరంద బిందుకుందేందీవరారవింద చందన సందోహ సంపాద్య పాద్యా ద్యుపచారంబులం బూజించి హెచ్చరించి యచ్చంచరీ కాంచిత కేశపాశ కాశాపూర్తిందత్ప్రసాదాసాదితంబుగా నక్కానం దార్చియుం జెక్కానం దేర్చియుఁ గన్నుల నొత్తియుం జన్నుల మెత్తియు హస్తంబులం దుడిచియు మస్తంబున న్మడిఁచియు నుపచరించు నట్టులై యుండిరి".

—కకుత్స్థ (3-125)

మట్ల అనంతరాజు 34 అప్సరసల పేర్లను ఒక సీస పద్యంలో మాలికగా కూర్చి చమత్కారంగా రచించిన తీరు తిలకించండి:

"ఊర్వశి రంభ తిలోత్తమ శశిరేఖ
హరిణి చంద్రకళ యనంగలతిక
మదనమోహిని వపుష్మతి కాంతిమతి శుభా
నన కళానిధి వరూధిని ఘృతాచి
మేనక పంచాశ్వమేధిని రాజసూ
యార్థిని క్రతుశుల్క తీర్థశుల్క
జలపద కర్పూరతిలక లీలావతి
దారుసంజీవని దానశుల్క
మునిమనోహర ధాన్యమాలిని సమీచి
భుంజికస్థల ప్రమ్లోచ మంజుఘోష
చారునామ చకోరాక్షి సౌరభేయి
హేమ మొదలైన యచ్చరలేమ లధిప"

—కకుత్స్థ (2-74)

చప్పన్నారు దేశాల పేర్లను ఒకే సీస పద్యంలో వ్యర్థ పదాలు లేకుండా కూర్చిన నాచన సోముని చమత్కార రచన (1) ను తలపింప జేసే రచన ఇది.

---

1. ఉత్తరహరి వంశము 5-142.

మట్ల అనంతరాజు కకుత్స్థ విజయంలో చమత్కార రచనతో పాటు గర్భ కవిత్వం కూడా చోటు చేసుకొన్నది. మట్ల అనంతరాజు వ్రాసిన కంద ద్వయగర్భితభాస్కరవిలసిత మిది :

"పంచవదను నలువుల్ దిశ లించెన్ భాస్కర విలసిత మెలమి
రహించెన్

గొంచక విబుధ విభుఁడరుదెంచెన్ గొప్ప సురలు నృపతిలకుల గాంచెన్
మించెఁ బ్రణయ పరిరంభము పెంచెన్ మ్రొక్కులఁ బ్రియములు పిదప
వరించెన్

బొంచిక నిన జయకందములెంచెన్ బోరి తెరఁగులిటు లెలమి వహించెన్"
— కకుత్స్థ (2-153)

కకుత్స్థవిజయం నుండి ఎక్కువగా ఆ కాలం నాటి సంగతులు, సాంఘికాచారాలు తెలియడం లేదు. కాని ఉన్నంతలో ఈ క్రిందివి గమనార్హాలు:

మట్ల అనంతరాజు కర్పూరతిలక ప్రణయ ఘట్టంలో కొరవంజిని ప్రత్యేకించి ఇట్లా పేర్కొన్నాడు:

"కుంచియ దోయి మూఁపులకు గోపుఱకున్నెఱి చూపజోఁటిజో
డంచు లలంకరింపగుఱుతైన కిరీటము వెట్టి జక్కణీ
సంచున కబ్జగంధి జలజాత సుగంధి మణీమయక్రియ
గ్రాంచినఁ బుట్టఁ బుట్టెఁ డెఱుక ల్నెఱపెంగొఱవంజియాటలన్"
—కకుత్ స్థ (3-86)

"చెలువ కొఱవంజి యెఱుకచేఁ జిన్నవోయి" (3-89) నదట.

"మన ప్రబంధాలలో కొరవంజిని పేర్కొనడం ఇది తొలిసారి" [1] అని ఆరుద్రగారు వ్రాసినారు. కాని కకుత్స్థ విజయానికి పూర్వమే రచితమైన అయ్యలరాజు రామభద్రకవి (1550) రామాభ్యుదయ ప్రబంధంలో కొరవంజి పేర్కొనబడినది.

---

1. సమగ్రాంధ్ర సాహిత్యం ix–పుట 150.

"అణునిభమధ్యలా క్రియలు నా పరిభాషలు నొప్పఁ జిందు, జ
క్కిణి, కొరవంజి మేళములఁ గేళిక సల్పిరి......"

(ఋశ్యశృంగుని ఎదుట వేశ్యల నృత్యం—రామాభ్యుదయం (2-131)

కకుత్స్థ విజయంలోని కొరవంజి ప్రశంస విశదంగా ఉంది. దీన్ని బట్టి పదహారో శతాబ్దాంత్యంలో కొరవంజులు తెలుగుదేశంలో విరివిగా ఉండెనని చెప్పవచ్చు.

కర్పూరతిలకా ఇక్ష్వాకుల వివాహ సందర్భంలో మట్ల అనంతరాజు తన కాలం నాటి దేశీయాచారాలను కొన్నిటిని వర్ణించినాడు. కల్యాణాభ్యుదయాన్ని కనుగొనడానికి బంధు మిత్రాదు లరుదెంచినారు. వధూవరు లిరువురి చేతికి 'గుడజీరకంబులు ధరింప' జేయడం, 'తెరమఱుఁగు' తడవడం, పాణిగ్రహణ మాచరించడం, మంగళ సూత్రాన్ని కట్టడం, తలఁబ్రాలు పోసుకోవడం, వేదికారోహణం, ప్రధాన హోమాన్ని నిర్వర్తించడం, నాల్గు దినాలు వివాహాన్ని ఉచిత ప్రకారంబుల నడిపించడం, "చతుర్థాహంబున దేవతాబలి ప్రముఖ నిఖిల కృత్యమ్ములు" నిర్వర్తించడం —ఇత్యాదిగా వివాహాన్ని దేశీయాచారాలతో మట్ల అనంతరాజు విపులంగా వర్ణించినాడు.

*ఛందోలంకార విశేషాలు :*

*ల, ళ—ప్రాసం*

అప్పకవి దీన్ని అభేదప్రాసమన్నాడు. కకుత్స్థవిజయంలో ల, ళ ప్రాసం కొన్ని చోట్ల కనిపిస్తుంది.

"......................................భూ
పాలక ఫాల రక్త రస పాన పలాశన తుష్ట భూత భే
తాళ పరీత భైరవ పతద్రణ మార్గ నటద్భుట వ్రజా"

—కకుత్స్థ (3-166)

"ధూళిని జోళముల్దొలిచి దోరసి ఘోరశిలీముఖానల
జ్వాలల జొంపముల్దలఁచి సన్నము తోరము వాయ సంబును"

—కకుత్స్థ (5—158)

"వ్రేలెఁడు నల్లెఁడు జుత్తెఁడు
నేల లెడగ్గాఁగ నిలిచి నిర్జరమనుజ
వ్యాళవరుల సురపఱచిన
నాలుకలా యేటి నమలెనా మన తనువుల్"

—కకుత్స్థ (5-81)

ఋ ప్రాసం :

"అ ఋషి వచనము లతనికిఁ
బేరయ్యెన్ నాటఁ గోలెఁ బ్రియసుతు నతనిన్
సారథిగాఁ గొని విభుఁడా
తేరెక్కి కదల్పఁ బనిచెఁ దిన్నఁగ మింటన్"

—కకుత్స్థ (2-40)

ర-ఱ ప్రాసమైత్రి :

దీన్ని ప్రాసవైరమని అప్పకవి నిరసించినాడు. కాని భారత కవుల్లో తిక్కన, ఎఱ్ఱన ఈ మైత్రి పాటించినారు. మట్ల అనంతరాజు పాటించిన ర-ఱ ప్రాసమైత్రి :

"మరచితిగా మును వలఁగొన
కెఱగితినని మరల వచ్చి యెలనాగ మునిం
జెఱకు విలుకాడు వాడిన
మెఱుగుం బోఁగనఁగ జుట్టె మెఱుజిగి నిగుడన్"

-కకుత్స్థ (1-178)

"అఱిఁగి పయోరుహాస నుపదాంబురహంబుల వ్రాలి తత్తపో
గరిమను పేరుచెప్పి తన కగ్గిన కైదువు సూపి యద్ధరా"

-కకుత్స్థ (1-211)

"మొఱఁగుల గుంపై యురుములఁ
జెరగొని మేఘునకుఁ బాసి చేరెనిచటికి
త్తఱినన హయ ఘోషలతో"

-కకుత్స్థ (2-27)

థ - ధ ప్రాసం :

అప్పకవి దీన్ని స్వవర్గజప్రాస నన్నాడు.

''రథి సారథి రహితములా
రథముల వరశక్తి శరపరంపర తక్షో
రథికులకుఁ దోడు కుఱియఁగ
ప్రధనము సుకుమారునకును ౘౘమై పెరిగెన్

-కకుత్స్థ (2-141)

ఖండాఖండ ప్రాస :

''చీఁకటి ముద్దలన్......జీవములుంగని నట్టులున్న యా
వేఁకని పందులన్ శబరవీరుఁడు బల్లెము లంది క్రుమ్మి చే
జాకుల గుద్ది...పయిపాటుల నొచ్చియు మెచ్చ రేఁగఁగా
నేకటిదీఱఁ జూచు మనుజేంద్రకుమారునితోడ వేడుకన్''

-కకుత్స్థ (4-83)

''తోఁచె సఖీసకాశరుచిఁ దొయ్యలి యమ్ముని మూదలింపఁగా
మోచె సమీపపుంగదళి మోహన గర్భము మెచ్చ నచ్చరల్''

—కకుత్ స్థ (3-56)

మట్ల అనంతరాజు వ్రాసిన మధురగతిరగడ లోని 7, 8 పాదాల్లో అంత్య ప్రాస ఉంది. కాని ఆదిప్రాస పాటింపబడ లేదు.

''దామోదర నీ తామర పొక్కిలి
యెల్ల నలువలకు నిమ్మది మిక్కిలి''

—కకుత్స్థ (1-223)

అనుప్రాసం :

దండి దీన్ని మాధుర్య లక్షణంగా ప్రతిపాదించినాడు ఛందస్సును శ్రుతి రంజకం చేసే ఈ అనుప్రాసాన్నే ఛందోలంకారంగా భావించినారు. నన్నయ

అక్షరరమ్యత చాలవరకు ఈ అనుప్రాసాన్ని ఆశ్రయించింది మట్ల అనంతరాజు కవితలో అనుప్రాస ఉన్న క్రింది పద్యాల్ని పరికించండి:

''ఈటెలా కోటలా మఱి పని
పాటలా మీ కింత యాట పాటా పోట్లా
యేటలు బాటలు బాటిలు
పాటికి వారెపుడు వచ్చిపడుదురా మీఁదన్''

-కకుత్స్థ (5-7)

ఇందు ప్రాసాక్షరమైన 'ట'కారం పునఃపునరావృత్తమై శీఘ్ర గమనాన్ని భయోత్పాదాన్ని వ్యక్తం చేస్తున్నది.

''పోయి పయోధిశాయి పరిపూర్ణ తరంగ భవానిలాను సం
ధాయి నపూర్వచేష్టితవిధాయి సమస్తతపస్వి మానస
స్థాయి రమానపాయిన కదా కని యక్కడ చెప్పినార మ
మ్మాయి ననుం గకుత్స్థుఁడనుమా మఖవా యనియెన్నృపాలకా''

—కకుత్స్థ (4-148)

పై పద్యంలోని 'యి'కార పునరావృత్తి ప్రాస సౌందర్యాన్ని కూర్చుతూ రమణీయంగా ఉంది.

ద్విప్రాస :

''బొమ్మను మేధావిధిచేఁ
బొమ్మను భోగమున నింద్రుఁ బొమ్మను యశమ
న్బొమ్మను నటింపఁ జేయును
బొమ్మనరోత్తముఁడు బుధులఁ బొమ్మనఁ దెపుడున్''

—కకుత్స్థ (1-35)

''వేలుపు లౌననం బుడమి వేలుపులిచ్చలఁ బిచ్చలింప నే
వేలుపుఁగొల్వనొల్ల కలవేలుపు వేలుపు రంగశాయిన
వ్వేలుపు బంతికి న్మొగము వేలుపుగాయని కోరికొల్చు రా
వేలుపతండు వొల్చుఁదొలువేలుపు గొంగ యనం బ్రసిద్ధుఁడై''

—కకుత్స్థ (1-146)

1, 2, 3 పాదాల్లో ద్విప్రాస :

''ఈశుఁడు సర్వమంగళకు నిందిరకున్మధుసూదనుండు లో
కేశుఁడు వాణికిన్శచికి నింద్రుడు గట్టుగతిన్వసిష్ఠమౌ
నీశుఁడు నయ్యరుంధతియు నెంతయుఁ బ్రేమనొసంగఁగట్టెను
ర్వీశశిఖావతంసమణి యింతికి మంగళసూత్రమయ్యెడన్''

—కకుత్స్థ (3-158)

ఉపజాతులందు కూడ ద్విప్రాసలు గవేషింపదగి ఉన్నవి.

క్రింది సీసపద్య పాదచతుష్టయం ఆరంభములందు 'ఒక ప్రదక్షిణవిధి అను పదం ఆవృత్తమై ద్విప్రాసం సిద్ధించినది.

''ఒక ప్రదక్షిణవిధి నుపచారదీక్షిత
బ్రహ్మసౌధంబులు ప్రస్తుతించి
యొక ప్రదక్షిణవిధి నుజ్ఘితవ్యవధాన
విపణి హర్మ్యావళి వి_స్తరించి
యొక ప్రదక్షిణవిధి నుభయనాట్యంబుల
మేళంబులకుఁ జంద్రశాలలునిచి
యొక ప్రదక్షిణవిధి నుత్స్వాగతలోక
పతులకుఁ బ్రాసాదవితతి నిలిపి''

—కకుత్స్థ (2-12)

''శాత్రవాభ్రవ్రాత ఝంఝూనిలం బెవ్వఁ
డెవ్వాఁడు రిపుతమోహిమకరుండు
కుటిలాసుహృద్వింధ్యకుంభోద్భవుండెవ్వఁ
డెవ్వాఁడు రిపుభూహృదింద్ర హేతి
వైరిభోగివ్రాతవైనతేయుండెవ్వఁ
డెవ్వాఁడు రిపుసింధురేభవైరి
దర్పితారాతిద్రుదావపావకుఁడెవ్వఁ
డెవ్వాఁడు రిపుహిమాహిమకరుండు''

—కకుత్స్థ (1-29).

పై సీసపద్యపాదచతుష్టయంలోని 'ఎవ్వఁడెవ్వాఁడు' అనే పదం ఆవృత్తమై సిద్ధించిన ద్విప్రాసం పద్యంలో వర్ణించిన వైభవమంతా ఒక మహా పురుషునికి చెందినదనే అర్థానికి ఉద్దీప్తి కలిగిస్తున్నది.

**అంత్యప్రాస :**

క్రింది సీసపద్యంలోని అక్షరరమ్యతను తిలకించండి.

''గిరిసమాజము తారగిరి సమాజంబయ్యె
నబ్ధులెల్లను గలశాబ్ధులయ్యె
భూరుహతతి కల్పభూరుహతతి యయ్యెఁ
గాంతులెల్లను జంద్రకాంతులయ్యె
మణికదంబము హీరమణికదంబంబయ్యె
హయములెల్లను దివ్యహయములయ్యె
ధేనుబృందము కామధేనుబృందంబయ్యెఁ
దమ్మిలెల్లను దెల్లదమ్ములయ్యెఁ''

—కకుత్స్థ (1-19)

ఏదైనా ఒక మాట ఎలా వాడితే అట్లాంటిదే దాని పక్కన వాడి మనస్సుకు ఉల్లాసాన్ని కల్గించే శబ్దశిల్పం పై పద్యంలో చూడవచ్చు. ఇందు అంత్యప్రాస కూడ పాటించి ఉండడం మరొక విశేషం.

అంత్యప్రాస ఉన్న మరో పద్యమిది :

"వితరణసురభూజా వీరవిద్యాబిడౌజా
ధృతిగతినగరాజా దిగ్గటవ్యాప్తితేజా
మతిమహిమసమాజా మానినీహృన్మనోజా
జితవినుతసమాజా చిన్నమాంబాతనూజా"

—కకుత్స్థ (4-184)

*ఛందోభేదాలు :*

కకుత్స్థ విజయంలో మట్ల అనంతరాజు వాడిన వివిధ చ్ఛందో భేదాలు క్రింది విధంగా ఉన్నాయి.

*సామాన్యవృత్తాలు :*

| | 1 ఆశ్వా | 2 ఆశ్వా | 3 ఆశ్వా | 4 ఆశ్వా | 5 ఆశ్వా. | మొత్తం. |
|---|---|---|---|---|---|---|
| శార్దూలం : | 5 | + 4 | + 2 | + 5 | + 6 | = 22 |
| మత్తేభం : | 8 | + 5 | + 8 | + 7 | + 7 | = 35 |
| ఉత్పలమాల: | 26 | + 18 | + 17 | + 35 | + 18 | = 114 |
| చంపకమాల: | 16 | + 15 | + 16 | + 10 | + 33 | = 90 |

*విశేషవృత్తాలు :*

| | | |
|---|---|---|
| స్రగ్ధర : | 2-15; 5-70. | = 2 |
| మహాస్రగ్ధర : | 4-133. | = 1 |
| లయగ్రాహి : | 3-105; 4-162. | = 2 |
| లయవిభాతి : | 2-132. | = 1 |

| | | | |
|---|---|---|---|
| మాలిని : | 1-175; 3-130, 4-184. | = | 3 |
| మానిని : | 3-137; 5-13. | = | 2 |
| కవిరాజవిరాజితం : | 2-68; 3-54. | = | 2 |
| తరళ : | 2-35; 3-57; 4-138; 5-22 | = | 4 |
| మత్తకోకిల : | 1-113; 2-24, 80; 4-59. | = | 4 |
| పంచచామరం : | 1-198; 2-127; 4-107. | = | 3 |
| దోధకం : | 1-203. | = | 1 |
| వనమయూరం : | 1-218. | = | 1 |
| స్రగ్విణి : | 1-229. | = | 1 |
| భుజంగప్రయాతం : | 2-120. | = | 1 |
| భాస్కరవిలసితం : | 2-153 | = | 1 |
| రథోద్ధతం : | 2-159; 5-147. | = | 2 |
| పద్మనాభవృత్తం : | 3-31. | = | 1 |
| సుగంధి : | 3-168; 4-178. | = | 2 |
| త్వరితపదగతి : | 5-15. | = | 1 |
| బంధురవృత్తం : | 5-25. | = | 1 |
| ప్రహరణకలిక : | 5-104. | = | 1 |
| పణవ : | 5-146 | = | 1 |

**జాతులు :**

| | 1 ఆశ్వా | | 2 ఆశ్వా | | 3 ఆశ్వా | | 4 ఆశ్వా | | 5 ఆశ్వా. | | మొత్తం |
|---|---|---|---|---|---|---|---|---|---|---|---|
| కందము : | 63 | + | 47 | + | 46 | + | 58 | + | 61 | = | 275 |
| ఉత్సాహ : | — | + | 2 (2-72, 110) | + | — | + | — | + | 2 (5-79, 197) | = | 4 |
| మధురగతిరగడ | 1 (1-223) | + | — | + | — | + | — | + | — | = | 1 |

*ఉపజాతులు :*

| | | | | | | | | | | | |
|---|---|---|---|---|---|---|---|---|---|---|---|
| సీసం : | 45 | + | 17 | + | 18 | + | 16 | + | 10 | = | 106 |
| తేటగీతి : | 11 | + | 8 | + | 10 | + | 12 | + | 6 | = | 47 |
| ఆటవెలది : | 9 | + | 9 | + | 10 | + | 15 | + | 13 | = | 56 |
| వచనం : | 37 | + | 23 | + | 33 | + | 19 | + | 33 | = | 155 |
| | | | | | | | | | | | 933 |

మట్ల అనంతరాజు వ్రాసిన మొత్తం గద్య పద్యాలు 933. వృత్తాలు: 299. జాత్యుపజాతులు : 489. జాతులలో కంద పద్యాలు · 275. ఉపజాతులలో సీసపద్యాలు : 106. వాటిలో ఒకటి వడి సీసం (5-42) మరొకటి అక్కలి వడి సీసం (5-95). తేటగీతులు : 47. ఇవికాక సీసపద్యాల్లోని ఎత్తు గీతులు : 64. మట్ల అనంతరాజు ప్రత్యేకంగా వ్రాసిన ఆటవెలదులు 56. సీసపద్యాల్లోని ఆట వెలదులు 22 ఉన్నాయి. పద్యాల్లో సగానికి పైగా జాత్యుపజాతులే ఉన్నాయి. దీన్ని బట్టి ఛందోవిషయంలో మట్ల అనంతరాజు కవిత దేశీయతా ముద్రితమైందని చెప్పవచ్చు. సంస్కృత వృత్తాల్లో అనంతరాజు విశేషంగా ఆదరించిన సామాన్యవృత్తం ఉత్పలమాల.

కకుత్స్థవిజయంలో క్రింది వృత్తాన్ని చూడండి :

''ఔరా యక్కటినాదులంగలయ రావై తేనియుం దానవ　　అ ప్ర రా
స్థలి రావేడుక రేచితీవిటులు పెల్చన్వచ్చి యిక్కోలకుం
జవిరానీవిఁకఁజెట్టగాక దివిషజ్జాలంబుతోఁ బోరుకం
జీవురా నీదగు జాతికం చౌకట నేసె న్వాని మూర్ఛంబడన్''

—కకుత్స్థ (5-55)

పై పద్యంలో మొదటిపాదం శార్దూలం. మిగతా మూడూ మత్తేభ పద్యపాదాలు. భిన్నఛందస్సుల్లో పుట్టిన వృత్తాలను కలిపి వ్రాసే సంప్రదాయం

అంగీకార్యమే. కాని నాల్గు పాదాల్లోను ఒకే ప్రాసనియమం లేకపోవడం గమనింపదగిన విశేషం.

కకుత్స్థ విజయంలో స్రగ్ధరాది విశేషవృత్తాలు 38 ఉన్నాయి. ఆశ్వాసాంతములందు ఛందోభేదాన్ని ప్రదర్శించడానికి మాత్రమే కాకుండా గ్రంథ మధ్య భాగంలో అక్కడక్కడ బంధుర. భాస్కరవిలసిత, దోధకం, సుగంధి-మొదలైన విశేష వృత్తాలను ప్రయోగించినాడు. బంధుర వృత్తానికి 25 అక్షరాలు. నన నన స భ భ భ గ - గణాలు. 15 అక్షరాలమీద యతి. ఇది మణిగణనికర దోధకవృత్తాల సంధానరూపం భాస్కర విలసిత వృత్త పాదానికి 25 అక్షరాలు. భన జయ భ నన సగ - గణాలు. 12 అక్షరాలమీద యతి. ఇది రెండు లఘు వృత్తాల సంధానంవల్ల ఏర్పడినట్లు తోస్తుంది. సంస్కృతాంధ్ర లాక్షణికులెవ్వరు దీన్ని చెప్పకపోవడం వింతగా ఉందని డాక్టర్ పాటిబండ మాధవశర్మగారు వ్రాసినారు.[1]

*ముద్రాలంకారం :*

మట్ల అనంతరాజు అపురూపమైన వృత్తాలను ముద్రాలంకారాలతో వాడినాడు. వృత్తాల పేరు కథామధ్యంలో ఆయా వృత్తాల్లో ఇముడ్చు సంప్రదాయాన్నే జయదేవాది నవీనాలంకారికులు ఒక అలంకారంగా పరిగణించి ఉన్నారు. సంస్కృతంలో ఇది ప్రాచీన కాలంనుంచీ వ్యాప్తిలో ఉంది. ఈ సంప్రదాయాన్ని తెలుగులో తొలుత సందర్భోచితంగా నెలకొల్పినవాడు నన్నెచోడుడు. అతని తరువాతి తెలుగు కవులు కేవలం అలంకారం కోసమే దీన్ని ఉపయోగించినారు.

కకుత్స్థ విజయంలోని ముద్రాలంకారాల వివరాలు:

వనమయూరం :

" ... ... ... నచ్చరలతోడన్, బొత్తు గలపెన్ నృపతపోవనమయూరల్" (1-218)

---

1. ఛంద : శిల్పము (1966), పుట 317.

మధురగతి రగడ :

"...దూఱిరి మధురగతుల జడదాల్పులు..." (1-223)

పద్మనాభ :

"...పద్మనాభావతారాశ్రయంబై ..." (3-31)

భాస్కర విలసితం :

"పంచవదను నలువుల్ దశలించెన్ భాస్కర విలసిత నెలమి రహించెన్" (2-153)

కవిరాజ విరాజితం :

"...కవిరాజ విరాజిత భూరి వియత్కమలాకర..." (3-54)

తరళ :

"...తరళము త్తమ ప్రాణము..." (3-57)

"తరళాభిదానకు (..." (4-138)

మాలిని :

"...తను భయ మాలిన్యా శయం..." (3-130)

మానిని :

"కోపము కాదు గదా...యిఁక మానిని కిం..." (3-137)

"...సునా సీరుఁడు మానిని జేటుఁగ..." (5-13)

సుగంధి :

"...సుగంధి కేలికా..." (4-178)

త్వరిత పదగతి :

"...త్వరితపదగతి నరుగుదేఱన్" (5-15)

బంధుర :

"...బంధురదుందుభినాదములున్" (5-25)

ప్రహరణ కలిక :

"......భయద ప్రహరణకలికా" (5-104)

పణవ వృత్తం :

"......పణవక్ష్వేడా....." (5-146),

రథోద్ధత వృత్తం :

"......నుత్తాల తాలసితా (రథోద్ధతా......" (5-147)

పైన పేర్కొన్న వృత్తాలన్నీ అప్పకవీయంలో కనపడతాయి. అయితే కొన్నిటికి వేరే పేర్లు కూడా ఉన్నాయి. మట్ల అనంతరాజు ముద్రాలంకారాలను వాడడం వల్ల పదహారో శతాబ్దపు చివరి రోజుల్లో ఏయే పేర్లు ఆ వృత్తాలకు ఎక్కువ ప్రచారంలో ఉండేవో తెలుస్తుంది. పై విశేష వృత్తాల్లో నామాంతరాలున్న వృత్తాల వివరాలు చూడండి :

రథోద్ధతం :

ఇది త్రిష్టుప్ ఛందంలో పుట్టినది. పాదానికి 11 అక్షరాలు. .రనర లగ-గణాలు ఏడవ అక్షరం యతి అప్పకవి దీన్ని పదాంతికం అన్నాడు. ఇది తాళలయాన్వితమైన గేయం. మట్ల అనంతరాజు లఘులకార వృత్తిచే రథోద్ధతను శ్రవ్యతరం కావించిన విధానాన్ని చూడండి :

"కీల కీల ఘన కేతనంబున
న్మ్రాలపాల శిఖ సొంపు పెంపను
త్తాలతాలసిత తద్రథోద్ధతా
ఖీల ఖీల నెఱపెన్ హయక్రియత్"

— కకుత్స్థ. 5-147.

సుగంధి :

శాలిని, చామర, ప్రశాంతి అని దీనికి నామాంతరాలు. ఇది 15 వ ఛందంలో 10923 వ వృత్తం.

త్వరిత పదగతి :

పాలాశదలం అని దీనికి నామాంతరం. ఇధి 17 వ ఛందంలో 22768వ వృత్తం.

## భాషావిశేషాలు

"సంధులందుఁ గూర్పక రసములు చిందుఁబోసికొనెడు గ్రాసార్థి కవులు నిక్కువపుఁ గవులె" అని మట్ల అనంతరాజు కకుత్స్థ విజయ కృత్యాదిలో చేసిన కుకవి తిరస్కృతిని బట్టి, అతడు ప్రాచీనాంధ్ర భాషా సంప్రదాయాల ననుసరించి సలక్షణంగా రచించినట్లు భావింపవచ్చు. కకుత్స్థ విజయంలో కొన్ని చోట్ల వ్యాకరణ విరుద్ధములైన ప్రయోగాలు క్వాచిత్కంగా కనిపించినా "నిరంకుశాః కవయః" అనే సూక్తికి ఉదాహరణంగా వాటిని పేర్కొనవచ్చు.

దీర్ఘం రాకుండా లోపం మాత్రమే వచ్చిన 'చుట్టలు' (2-20), 'మీసలు' (4-24) అనే రూపాలు మట్ల అనంతరాజు రచనలో కనిపిస్తాయి.

'ళ' బదులు 'డ' :

'చోళవంశ' అను పదం 'చోడవంశ' అను డకారయుక్త రూపంగా ప్రయుక్తమైంది.

"శ్రీ చోడ వంశభవ......" (3-1)

"చోడవంశ నృపాలా" (5-196).

"ఇది శ్రీమత్తిరుమల తొడప్పాచార్య......" (3-169)

'గ' బదులు 'వ' ప్రాసస్థానంలో ప్రయుక్తమైంది.

'పదునాలువు లక్షల' (3-5)

మట్ల అనంతరాజు కకుత్స్థ విజయంలో కొన్ని విశేష ప్రయోగాలు చేసినాడు. "ముప్పయిమంది" అని చెప్పడానికి బదులు "ముప్పంద్రు" అనే మాటను ప్రయోగించినాడు.

"దీపధ్వజు నెచ్చెలులు్మప్పంద్రతోపల (4-130)

"యవ్వని దీపధ్వజుఁడెవ్వఁ డా ప్తులగ ముప్పంద్రెవ్వ రెచ్చోఁగనుం గానఁ గల్గెన్" (4-137).

ఇచట 'ముప్పంౘ్రడు' అనేమాట యతిస్థానంలో ప్రయోగింపబడినది.

మట్ల అనంతరాజు కకుత్స్థవిజయంలోని ప్రయోగాలను శ్రీ నిడుదవోలు వేంకటరావుగారు శబ్దరత్నాకరం 'సవరణలు-వివరణలు'తో ప్రచురించిన అనుబంధంలో స్వీకరించినారు. ''ఈ కవికి సంస్కృత భాషయందలి పాండిత్యము మిక్కుటమైనదని కొన్ని ప్రయోగముల వలన తెలియవచ్చుచున్నది. మాటలు కూర్చుటలో గూడ నీతడు మిక్కిలి తెలివి గలవాడు'' [1] అని మట్ల అనంతరాజ కకుత్స్థవిజయాన్ని ప్రకటించిన సరస్వతీ పత్రికాధిపతులు చెప్పిన మాటల్లో సత్యం లేకపోలేదు. మట్ల అనంతరాజు సంస్కృత పదాల కూర్పున కుదాహరణం :

''దుర్విషహాపూర్వ గీర్వాణాఖర్వ గర్వ నిర్వాపణ దుర్వార దోర్వీర్యోర్వీ ధూర్వహుండగు మనుతనయుండు'' (4-4)

మట్ల అనంతరాజు కవితలో సంస్కృత పద బాహుళ్య రచన కొన్ని చోట్ల, సమ సంస్కృతాంధ్ర పదాలతో కూడిన రచన మరికొన్ని తావుల కనిపించును.

కకుత్స్థ విజయం మొదటిసారి 1904 లో సరస్వత్యనుబంధం 36 వ గ్రంథంగా సరస్వతీ పత్రికాధిపతి శ్రీ కొ. రా. వేం. కృష్ణారావు సంపాదకత్వాన కాకినాడ శ్రీ బాలసరస్వతీ ముద్రాక్షరశాలలో అచ్చైనది. ఇది సరస్వతీ పత్రికనుండి పునర్ముద్రితమైంది. నాటినుండి నేటిదాక మరల కకుత్స్థవిజయం అచ్చు కాలేదు. పూర్వముద్రణ ప్రతులు ఈనాడు ఎంతో గాలిస్తేకాని దొరకవు. దొరికినా ఆ గుజలీ ప్రతి చదవడానికి యోగ్యంగా లేదు.

---

1. కకుత్స్థవిజయం - మొదటి కూర్పు (1904). పీఠిక. కొ:రా. వేం. కృష్ణారావుగారు,

దీనికి మద్రాసు, తిరుపతులందలి ప్రాచ్య లిఖిత పుస్తక భాండాగారాల్లో ప్రత్యంతరములైన లిఖిత ప్రతులు కాని, తాళపత్రప్రతులు కాని కానరావు. పూర్వ ముద్రణలో అచ్చుతప్పులే కాకుండా చాలాచోట్ల లుప్త భాగాలు కూడ ఉన్నాయి. లుప్త భాగాలున్నా కథా భాగం మాత్రం చెడలేదు. పూర్వ ముద్రణలోని అచ్చు తప్పులను సవరించి దీన్ని సిద్ధం చేసినాను.

1. 'ఆటవెలది' అనడానికి బదులుగా 'గీతి' అని పూర్వ ముద్రణలో కనిపిస్తుంది.

కకుత్స్థ 1 ఆశ్వా-114, 134; 2 ఆశ్వా. 28, 46; 3 ఆశ్వా. 46, 72; 4 ఆశ్వా. 29, 63; 5 ఆశ్వా. 170, 175.

2. 'మానిని' అనడానికి మారుగా 'మాలిని' ప్రయుక్తమైంది. (5-13).

3. 'పోతభూవరుఁడు' అనడానికి బదులుగా 'బొమ్మభూవరుఁడు' అని తప్పుగా ముద్రితమైంది.

4. ప్రాచీన లేఖన సంప్రదాయం ప్రకారం ముద్రితమైనదాన్ని ఈ నాటి సంప్రదాయానుగుణంగా మార్చడమైంది.

'కీర్తి'కి బదులు 'కీర్తి'

'ఊర్ధ్వ' కు మారుగా 'ఊర్ధ్వ.'

5. ప్రాచీన పద్ధతిలో రెండు పాదాల్లో ముద్రితమైన కంద, తేటగీతి, ఆటవెలదులను నాల్గు పాదాలుగాను, ఆరు పాదాల్లో ఉన్న సీస పద్యాన్ని 12 పాదాలుగాను విభజించడం.

6. పూర్వముద్రణంలోని శబ్ద దోషాలు, వర్ణ వ్యత్యయాలు, గణ భంగ దోషాలు మొదలైనవాటిని సమయోచితంగా ఈ ముద్రణలో సవరించడం జరిగింది.

అర్ధ శతాబ్దంనుంచీ ఎవ్వరికి అందుబాటులో లేని కకుత్స్థ విజయాన్ని ముద్రించాలని తలపెట్టినందుకు ఆంధ్ర ప్రదేశ్ సాహిత్య అకాడెమీని అభినందించవలసి వుంది.

కకుత్స్థ విజయ గ్రంథ పరిష్కరణకు, విపులమైన పీఠికను వ్రాయడానికి అవకాశాన్ని కల్పించిన అకాడెమీ కార్యవర్గానికి నా కృతజ్ఞతాభివందనములు.

ఈ విపులమైన పీఠిక వ్రాయడంలో నా కనేక గ్రంథాలు తోడ్పడినాయి. అధోజ్ఞాపికలందు పేర్కొనబడిన గ్రంథకర్తలందరకు నా కృతజ్ఞతలు.

తిరుపతి
1-9-1980

జి. నాగయ్య

o:——:o

శ్రీరస్తు

# కకుత్స్థవిజయము

## ప్రథమాశ్వాసము

శా. శ్రీపాదాంబురుహద్వయం బిది మది న్సేవించువాఁ డెవ్వఁడో
యాపుణ్యుం డఱచేతిరత్న మగుమా కన్నట్లుగాఁ దాదృశ
వ్యాపారోన్ముఖరత్నహస్త మగు తత్త్వంబాయురారోగ్యలీ
లాపూర్త్యర్థముఁ గావ్యకర్త కలమే ల్మంగావరుం డీవుతన్. 1

సీ. శ్రీవత్సమునకు నెచ్చెలిఁ జేయు నేచెల్వ
కుచకురంగమదంబు కుదురుకొలిపి
కాపుంచుఁ జైతన్యకలఁ గౌస్తుభంబున
నేయంబప్రతిబింబ మేఱుపఱచి
వైజయంతికి నొకవరుస మొల్లలుగ్రుచ్చుఁ
జిఱునవ్వుఁ గులికి యేచిగురుబోఁడి
యొఱపుఁ జూపులఁ గాంచనోత్తరీయములకు
మీనంచువ్రాయు నేమెచ్చులాఁడి
గీ. మగనిఱొమ్మెక్కె నేకొమ్మ మనుచు వేడ్క
నమ్మహాదేవి వాగ్దేవి యత్తగారు
మధురశీతలసురభివాఙ్మయతరంగ
తతుల మజ్జిహ్వఁ బ్రవహింపఁ దలఁచుఁ గాత. 2

మ. సకలోచ్చక్రమచక్రము న్విజితరక్షశ్శంఖము న్శంఖముం
జకితానందకనందకంబు నకృతస్వారాజముఖ్యామర
ప్రకరస్వాంతగదన్గదజ్జగదగారక్రీడదుత్ఫుల్లవై
రికలాకోకకుచాపచాపమును బ్రార్థింతు న్వచశ్శుద్ధికిన్. 3

శా. విష్వగ్వ్యాప్తదరస్మితోష్ఠతట దేవీసూత్రవత్యుక్తి శు
శ్రూషాప్తాత్మశ్రవణుండు జన్యజనితశ్రూచాలనోద్ధూతదై
త్యేష్వాసుండు నమత్తురంగముఖ విఘ్నేంద్రాత్మభూస్థాణుఁడీ
విష్వక్సేనుఁడు మత్ప్రణీతము జగద్విఖ్యాతముం జేయుతన్. 4

క. సారెకు మ్రొక్కెద మేధా
వారిజగర్భులకు వ్యాసవాల్మీకులకున్
భారతరామాయణకవి
తారసమాధుర్యధుర్యతాత్పర్యులకున్ 5

గీ. డాఁగురించుచు నీనెలబాగొనర్తు
మనుచునాకులరచనల నలసి సంధు
లందుఁగూర్పక రసములు చిందుఁబోసి
కొనెడు గ్రాసార్థికవులు నికృష్టపుఁగవులె. 6

వ. అని యిష్టదేవతానమస్కృతియు సుకవిపురస్కృతియుఁ గుకవితిరస్కృతియుఁ గావించి మేధావైశద్యనిరీక్షాపేక్షం గకుత్స్థ విజయప్రబంధ నిబంధనకుతూహలాయత్తచిత్తుండనై యుండ నొక్కనాఁడు పూర్వదిశచందంబున శతమఖకలితంబును నాగ్నేయంబు పగిది రోచిష్మదాకీర్ణంబును దక్షిణంబుచాడ్పున ధర్మాధ్యక్షంబును నైరృతంబువిధంబునఁ బుణ్యజనాధిష్ఠితంబును బ్రతీచిరీతిఁబ్రచేతోవాసంబును వాయవ్యంబుగతి జగత్ప్రాణతోషకంబును నుదీచిభాతి రాజరాజమహితంబును నీశాన్యంబుకైవడిఁ బ్రద్యుమ్న హారిభాసురంబును గవేరజామధ్యంబునుం బోలె శ్రీరంగాభిరామంబును క్షీరసాగరంబునుం బలెఁ బరమపురుషదీప్యమానంబు నగు పేరోలగంబున బిరుదగజసింహుండగు నస్మజ్జనకుం డెల్లధరాఖండలుం డంధ్రకవితా పితామహుండును నుభయచ్ఛత్రచామర శంఖసంఘాతాంకుండు నగు నుప్పుఁగొండురిపురి వేంకటకవిం జూచి శాశ్వతం బగు ధర్మం బేదియని యడిగిన నక్కవికంఠీరవం బిట్లనియె. 7

ఉ. కోనయయెల్ల వైరినృపకుంజరభంజన కంజనాభసే
వానిరవద్య యాద్య జనవర్ణితదుర్లభనీతిసార యా
రానవఖండరాజరసనాంచలరంగముల న్నటింపఁ ద
న్మానసగర్వపుం దెర దెమల్చి యమర్చితి కీర్తినర్తకిన్. 8

శా. ధారాపాతము వాసినప్పుడ ఘనత్వం బేర్పడుం జంద్రహా
సారూఢి న్విలసిల్లుచున్నపుడు శైత్యం బెల్లఁ గాన్పించురా
నీరాజద్భుజఖడ్గరాజమభివర్ణింపన్వశంబే యుద
గ్రారిధ్వంసక మల్లికోనవిభు నెల్లా రాజకంఠీరవా. 9

గీ. అమితచారిత్ర పుణ్యమార్గములు గలవు
పెక్కులైనను సత్కీర్తికెక్కు నిజము
సప్తసంతానముల నందు శాశ్వతంబు
కావ్యమందుము సత్కవి కలిగె నీకు. 10

క. మహినీపుత్రుఁ డనంతుఁడు,
బహుమహిమలఁ జెప్పనేర్చు భవమౌళిధునీ
లహరీఘుమఘుమితవచో
మహితంబులు కృతులు స్వరసమాధురినవురా ! 11

సీ. పంకజాతానన ప్రతిపత్తిఁ గడనుంచి
మృగరాజపీఠిపై మేల్పటించి
శుకమౌనవహన బాధక వాక్యములు కుంచి
ప్రతిజనార్చాపేక్షమతిఁ దలంచి
పాండురుగాకృతి ప్రకటిమఁ బ్రహసించి
మెఱుఁగుఁజామనచాయ మెలగఁదలఁచి
భావాధికాచారభారము నిరసించి
శౌర్యవిద్యాసమాచరణ మెంచి

గీ. రాజవేషంబుఁ గాంచు భారతి యటంచుఁ.
క్రోడభూధరమణికూర్మకుంభిజ్ఞంభి

కుంభినీభారధూర్వహోరంభభుజుని
మట్లనంతమహీనాథు మతిసనాథు. 12

వ. మఱియు నమ్మహీజాని వైభవంబు లాకర్ణింపుము. 13

సీ. జడరాశిఁ జొరఁబాఱె బడబానలజ్వాల
చిద్రూపుహరుఁ జేరె శీతరోచి
యొకమూలఁబడియుండె నొదిగి కృశానుండు
హాలాహలము మ్రింగె శూలపాణి
యాకసం బెగఁ బ్రాఁకె నబ్జాతహితకారి
పాతాళమునకేగెఁ బాపఱేఁడు
కదలగా వెఱచె నక్కనకాచలేంద్రంబు
పారికాంక్షితఁగాంచె నారదుండు

గీ. నెవని విక్రాంతి కీర్తియు నేఁచితఱుమ,
వాని నుతియింప వశమె శేషాహికైన
నిఖిలరాజన్యకోటీర నిహితచరణు
మట్లనంత మహీనాథు మతిసనాథు. 14

క. వనధి యనంతుని ... ...
... ... ... ...
మ్మున నగు పరిపంథింగని
యనురాగముఁ బొందెనంచు నలరెంబ్రేమన్. 15

ఉ. దిక్కుల మట్లనంతనరదేవు యశంబు నరాతిదుర్యశం
... ... ... ర
బొక్కటఁ గూడనాడఁ దమరోడిన ... ...
... ... ... ... ...
... ... ... డొదలఁ దాలిచె వాగ్వధూటియున్. I6

---

... యీ భాగములు మూలప్రతిలో లేవు. ప్రత్యంతరము లేదు.

సీ. గతశనైశ్చరితాత్మగాంభీర్యులైనను
మందసముద్రాఖ్య మొందఁ గనిరి
ఐశ్వర్యబలరాములై మనకున్నను
బళుగణాధిపసీరపాణులైరి
దేవకుముదబంధుభావము ల్గనుచున్న
సత్రభుక్క్రమలారి చర్యులైరి
భోగవిస్తృతిశిఖాభోగము ల్లేకున్న
వాయుభోజనకృష్ణవర్త్మలైరి
గీ. అఘవిధాజాగ్రదురుతరరయవనజవన
వాహినీనాయకద్రోహదోహలాత్మ
బాహుశాఖాసుమాయిత భవ్యభూమి,
మల్లనంతధరానాథమాన్యరిపులు. 17

క పులుమేయఁ గాననాంతర,
ములు డాయ నిజశిశుమోహమునఁ జనఁబాల్గా
ల్గలొసఁగఁగ నసిధేనువు విమ
తులతలలఁ దొలుచుననంతదోస్తంభమునన్. 18

సీ గిరిసమాజము తారగిరిసమాజంబయ్యె
నబ్ధులెల్లను గలశాబ్ధులయ్యెఁ
భూరుహతతి కల్పభూరుహతతి యయ్యెఁ
గాంతులెల్లను జంద్రకాంతులయ్యె
మణికదంబము హీరమణికదంబంబయ్యె
హయములెల్లను దివ్యహయములయ్యె
ధేనుబృందము కామధేనుబృందంబయ్యెఁ
దమ్మిలెల్లను వెల్లదమ్ములయ్యెఁ
గీ. బరుసమంటిన యినుమును బైఁడియగుటఁ
దెల్లముగఁ జేసెఁ దద్యశం బెల్లదిశల
వాని నుతియింప శేషాహికైన పశమె
మల్లనంతమహీనాథు మతిసనాథు. 19

ఉ. గందరబాలుఁ డెల్లమహికాంతుననంతుఁ డనంతకల్పుఁడు
ద్దండభుజాబలుండు భువిఁదాల్పగ వాని యరాతికోటికిన్
గొండలుగాఁగ మున్నుసరికొండల దండలుచేసి యుంటకున్
గొండలదండ లయ్యెఁ జనుకొండలదండలకన్న సౌఖ్యముల్. 20

మ. అమితప్రాభవ ... ... లక్ష్మసతిన్
విమలాబ్జేక్షణరంగయన్నమణి గోవిందాఖ్య నోబాజిమాం
బ మరాళాంచితయాన ... ...
... ప మృగీలోచన లచ్చయ సిరివరోన న్మట్లకాతోదరిన్. 21

క. తరుణీమణి లక్ష్మసతి
తిరువేంగళనాథునుతవితీర్ణిసనాథుఁ
గరుణాపాథోరాశిం
దరుణారుణవిస్ఫురత్ప్రతాపుం గాంచెన్. 22

చ. అతనిప్రతాపభానుఁ డుదయంబుఁ గనంగఁ దదన్యరాజదీ
ధితి పరతారకానికరదీప్తియుఁ గిద్వడె జారచోరసం
తతులగతిం దమోవికృతి దారెడు భూజనరాజితాంగనా
తతగతిమించఁ గాంచె వసుధం దిరువెంగళనాథుఁ డల్పుఁడే. 23

సీ. ఫాలలోచనుమ్రోల హాలాహలము మెచ్చు
శశిమ్రోల రాహువు సన్నుతించు
శరదంబుదము చెంత ఝంఝూనిలము నెంచుఁ
దుహినసంతతిచెంత మిహిరుఁదలచు
నలినసంతతిచెంత నాగంబు స్తుతిసేయు
నురగవల్లభుపొంత గరుడు నొడువు
హరిదంతికడఁ గాళికాశ్వముఁ గొనియాడు
భారతికడ ఫీరభామఁ బొగడు

గీ. మట్ల తిరువేంగళనృపాలు మహితకీర్తి,
యెంతగయ్యాళి రచ్చలకెల్లనెక్కి-
తత్తమచితస్థలంబులఁ దవిలితవిలి,
... ... ... 24

ఉ. వీరగుణాధినాథుఁ దిరువేంగళనాథు దయాసనాథు నం
భోరుహలోచనామదనమోహనవిగ్రహు దండితారిరా
డ్వీరు లసద్యశోజిత పటీర హిమాచలు నెన్నవచ్చు గం
భీరభుజాసిఁ జేసె గృహమేధులఁగా నలకూబరాదులన్. 25

ఉ. కాచినమీఁదఁగాని మఱికల్పకశాఖి ఫలింపదెన్నఁడుం
గాచినఁ గాయకున్నఁ గలకాలము మాకు ఫలించునంచు నీ
భూచరఖేచరు ల్నిరతము న్వినుతింతురు విస్ఫురద్వచో
వీచులఁబొంగి మట్లి తిరువేంగళనాథుని ధీసనాథునిన్. 26

ఉ. వీరవరుండు మట్ల తిరువేంగళనాథుఁడు గాంచెఁ జెన్నమాం
భోరుహనేత్రయందు బుధపూజ్యుఁ గుమారుననంత సర్వధా
త్రీరమణాగ్రగణ్యు నురరీకృతధైర్యుని నెల్లభూసునా
సీరు నరాతిలోకపరిసేవ్యపదాబ్జు ననంతభూభుజున్. 27

సీ. కరుణాగరిష్ఠులు కమలాక్షుఁ డనియును
వీరాగ్రగణ్యులు విజయుఁడనియు
దాతలందఱుఁ గల్పధరణీజమనియును
సత్యశీలురు హరిశ్చంద్రుఁ డనియు
భోగసంపన్నులు పురుహూతుఁ డనియును
వైణికాగ్రేసరు ల్వాణియనియు
బుధులెల్లరును శేషభోగీంద్రుఁ డనియును
హరిభక్తులెల్లఁ బ్రహ్లాదుఁ డనియు

గీ. నొనరఁ గొనియాడఁ గాఁపురంబుండునేమొ
దయయు శౌర్యంబు నీగి సత్యవ్రతంబు
విభవసంగీతపాండిత్య విష్ణుభక్తు
లనఁగఁ దనరుఁ గుమారుఁ డనంతవిభుఁడు. 28

సీ. శాత్రవాభ్రవ్రాతజంఝూనిలంబెవ్వ
డెవ్వాఁడు రిపుతమోహిమకరుండు
కుటిలాసుహృద్వింధ్యకుంభోద్భవుండెవ్వఁ
డెవ్వాఁడు రిపుభూభృదింద్రహేతి
వైరిభోగివ్రాత వైనతేయుం డెవ్వఁ
డెవ్వాఁడు రిపుసింధురేభవైరి
దర్పితారాతిద్రుదావపావకుఁ
డెవ్వాఁడు రిపుహిమాహిమకరుండు

గీ. వాఁడు విలసిల్లు దశదిశాపలభి సులభ
ఢౌకమానానకాసదృగ్ధాన్ని నాద
బధిరపరిపంధి సైంధవ ప్రబలమాద్య
దిభుఁడు తిరువేంగళనృపాలు నెల్లవిభుఁడు. 29

సీ. వేయుమొగంబుల విభజనం బెదలించి
యాననం బొకఁడౌ ననంతుఁ డనఁగ
నెదమోచికొనియున్న యిందిర నేత్రాంబు
జాసక్తఁ జేయు ననంతుఁడనఁగ
సర్వరాజతమాని జనపతిత్వముఁ బూని
యఖిలోర్విఁదాల్చు ననంతుఁడనఁగ
నలుగేలు నిరుగేలు నలువునఁగొనకొని
యనుకంపఁదాల్చు ననంతుఁడనఁగ

గీ. దినదినంబును జాల వర్ధిష్ణుఁడయ్యె
మట్లనంతునిగారాబు మనుమఁ డా ప
పద్మహేళి యనంతనృపాలమౌళి
పుణ్యగుణభాసమానుఁడగణ్యయశుఁడు. 30

వ. అని యక్కవిపుంగవుండు విన్నవింప సంతోషతరంగితాంతరంగుం డగు మజ్జనకు నభిప్రాయం బెఱింగి మున్న నే రచియింపఁ బూనిన కాకుత్స్థ విజయం బను ప్రబంధంబుఁ దదంకితంబుఁ జేయం బూని యీ ప్రబంధంబున కలంకారం బగు నాయెల్ల భూవల్లభువంశావతారం బభివర్ణించెద. 31

సీ. భరితచక్రద్వంద్వకరశాలిగాఁ జేసె
నేకచక్రధురీణు డీతఁ డయ్యు
నచలశార్ఙ్గౌఘసమాసక్తుగాఁ జేసె
నేకశార్ఙ్గవిభాసి యీతఁ డయ్యుఁ
బద్మాళివికసనప్రతిపాదిగాఁ జేసె
నేకపద్మాసనుఁ డీతఁడయ్యు
సప్తతార్క్ష్యభ్రాజిసంచారుఁగాఁ జేసె
నేకతార్క్ష్యధ్వజుఁ డీతఁ డయ్యు

ఆ. నలిననాభుఁ డితఁడు నావానివలకన్న
వానిఁ బెంకి యగుటవలన మించి
లోకమునఁ జరించు లోకసమాలోక
బాంధవుండు లోకబాంధవుండు. 32

క. మనువుఁ గనె నాతఁడతఁడా
తనికిక్ష్వాకుఁడు జనించెఁ దద్వంశమున
న్వనజదళాక్షుఁడు దశరథ
జనపతికుదయించె రామచంద్రుం డనఁగన్. 33

క. ఆలోకబంధుకులమున
నాలోకాలోక వేష్టితావని యెల్లన్
బాలించె బొమ్మధరణీ
పాలుఁడు జన్మించి భూమిపాలురు గొల్వన్. 34

క. బొమ్మను మేధావిధిచేఁ
బొమ్మను భోగమున నింద్రుఁ బొమ్మను యశమ
న్బొమ్మను నటింపఁ జేయును,
బొమ్మనరోత్తముఁడు బుధులఁ బొమ్మనఁ డెపుడున్. 35

క. తామరసబాంధవాన్వయ
భూమీశ్వరమౌళి బొమ్మభూవిభుఁ డతఁడా
సోమధరావరు తిమ్మ
క్ష్మామహిళాభర్త తిప్పజనపతిఁ గాంచెన్. 36

వ. అందు. 37

సీ. సోమభూజానికి సుతులు జన్మించిరి
పోతరాజును జిన్న భూవిభుండు
బొమ్మరాజు నరసభూజాని కొండ్రాజు
వారిలో పోతభూవరుఁడు గాంచె
వరద వైయారి భూవరులఁ జిన్నమయందుఁ
బైఁడిరాజును రామపార్థివేంద్రు
జిట్టిభూపాలుని జినయెల్లధాత్రీశు
రామమాంబాకుందరదనయందు
గీ. నందువరదాధిపుఁడు కృష్ణమాంబుజాక్షి
వలన వైయారి మేదినీవరునిఁ గాంచి
జారచోరాదిభయములు సడలఁ జేసి.
ధాత్రి పాలించె భుజబలోద్దండుఁ డగుచు. 38

చ. వనజదళాక్ష శంకరులు వార్ధికి నద్రికిఁ బోలెఁ గృష్ణరా
యనికి ననుంగు టల్లుఁ డటులై తనరు న్వరదక్షమాధవుం
డనిమిషవాహినీ మునిగజాశ్వమహీరుహధేనుభీమవా
ఘన ఘఘటావతంస కుధరాభరణాదిక హేతుకీర్తియై. 39

చ. వరదుఁ డతండు గాంచిన యవారితకీర్తి వయారిరాజభూ
హరిహయుఁ దౌనతండు వరదాఖ్యుల ముప్పుర వేంకటాద్రి భూ
వరవరుఁ జెన్నమాంబ యను వారిజలోచనయందుఁదిమ్మమా
సరసిరుహాక్షియందు నరసప్రభుఁగాంచె నృపాగ్రగణ్యులన్. 40

వ. పోతరాజు రెండవదేవియగు రామమాంబకుం బ్రథమపుత్రుండైన
పైఁడిరాజునన్వయం బెట్టిదనిన 41

ఆ. పోతవిభుని పైఁడిభూపాలకుఁడు వసం
తాంబయను సరోరుహాక్షివలన
వరదరాజుఁ బోతధరణీశు రామప్ప
రామచంద్రు నాదిరాజుఁ గాంచె. 42

క. ఆదినృపాలకనిభుఁడగు,
నాదినృపాలకుఁడు వేంకటాద్రీశ్వరు న
య్యాదిమసాధ్వీతతినిహి
తాదరగోవిందమాంబ యందుం గాంచెన్ 43

వ. ఆపైఁడిరాజు రెండవతమ్ముం డగు చిట్టిరాజు నన్వయం బెట్టిదనిన. 44

క. నతధరణీశుఁడు చిట్టి
క్షితిపతి బొమ్మాంబవలన శ్రీరంగమహీ
పతిఁ గృష్ణధరాజంభా
హితుఁగోనమయందు వాసరీంద్రుంగాంచెన్. 45

వ. అందు. 46

మ. తనధీరత్వము హేమభూమిధరగంధధ్వంస దంభోళిగాఁ
దనగాంభీర్యము సింధునిర్మథనమంథానాగరాజంబుఁగాఁ
దనదాతృత్వము భూరివారిసముద్యద్గంధవాహంబుఁగా
మనెఁజిట్టాజు సిరంగభూవిభుఁడు సామ్రాజ్యప్రథాశాలియై. 47

వ. ఆ చిట్టి భూజానితమ్ముం డగు చిన్న యెల్లమరాజువంశం బెట్టిదనిన. 48

క. అతఁడు చినయెల్లభూపతి
యతిలోకయశుండు నరసమాంబికయను నా
సతివలనఁ గాంచె మేధా
చతురానను జిన్ననంత జగతీనాథున్. 49

వ. సోమభూజాని రెండవసుతుండగు చిన్నభూపాలు నన్వయం బెట్టి
దనిన. 50

సీ. చిన్నభూపాలుండు చెన్నమాంగనయందు
గోవిందధరణీశ కుంజరమును
దిప్పమాంగన యను దేవేరివలనను
బోతరాజును సోమభూతలేశుఁ
దిరుమలాంబాతలోదరియందుఁ గృష్ణభూ
రమణుని గోనేటి రాజు నోబ
ధారుణీశ్వరుఁ జిన్న ధరణీతలేశ్వరు
శ్రుతిమార్గహితులగు సుతులఁగాంచె
గీ. నతని తమ్ముఁడు నరసగోత్రాధివరుఁడు
తిరుమలాధీశు నారపధరణినాథు
నరసమాంగనయందును నరసరాజ
వరుని జెన్న మాంభోజాక్షి వలనఁ గాంచె. 51

సీ. వారిలోఁ దిరుమల భూరమణుఁడు గాంచె
రంగమాంబయను లతాంగివలన
నారాయణుని రామనరవరాగ్రేసగు
నందు నారాయణుఁడనిన విభుఁడు
లక్ష్మాంబయందుఁ దిమ్మక్ష్మాతలాధీశు
రంగభూవరుఁ జిన్న రామచంద్రు

కామరాజును నల్వురను గాంచెఁ బుత్రుల
నతనితమ్ముఁడు నారపాహ్వయుండు

గీ. నరసమాంగనయందుఁ జెన్నక్షమాత
లేకునోబభూవిభుఁ గోనమాశశిముఖి
యందుఁ గృష్ణమహీశు రాజమ్మ దిమ్మ
రాజమణిఁ గాంచె భోజాధిరాజనిభుల. 52

సీ. వారిలోఁ గృష్ణమహీరమణుఁడు నర
సింగాంబ యనుకోమలాంగి వలనఁ
బెదచెన్న కేశవ పృథివీశులను గోన
మహీనాథుఁగాంచెఁదిమ్మ ప్రభుండు
లక్ష్మమ్మయనిన వల్లభయందుఁ జినచెన్న
రాజును రాజమరాజుఁగాంచెఁ
జినచెన్నఁడందులోఁ జెన్నకృష్ణమహీశుఁ
గాంచె మంగమయను కాంతవలన

గీ. సోమభూజాని యేనవసుతుఁడు కొండ
రాజమణిఁ గాంచె రామమారవజివలనఁ
గోనభూవరుఁ బెదలింగమానవేంద్రుఁ
జిన్నలింగాఖ్యుఁ దిమ్మయక్షితి )డౌజు. 53

సీ. వారిలోపలఁ గోనవసుమతీనాథుండు
తిమ్మమాలక్ష్మమాదేవులందు
రఘుపతిభూనాథు రంగనాథనరేంద్రు
రాజమప్రభునిఁగొండ్రాజ నరుని
లక్ష్మీపతికుమారపక్ష్మాతలాధీశు
వరుసఁ బుత్రుల నాలుగురను గాంచెఁ
బెదలింగభూజంభభేది కోనమ యందు
రామప్పఁ దమ్మభూరమణవర్యు

గీ. రాజమహీనాథుఁగృష్ణధరాతలేంద్రుఁ
గాంచెఁ బినలింగభూజాని గనియెఁబ్రేమఁ
దనయవర్యులఁ గొండమాతరుణివలన
నెల్లధాత్రీశపైఁడిభూవల్లభులను. 54

వ. సోమరాజుపినతమ్ముం డగు తిప్పరాజు వంశంబెట్టిదనిన. 55

సీ. తిప్పభూపాలుఁడాదిన్నృపాలు గుంద్రాజుఁ
గోనప్పఁ దిమ్మభూజానిఁ బెద్ద
సోమరాజును జిన్నసోమరాజును గాంచె
వారిలో నాది భూవరుఁడుగాంచెఁ
గొండప్ప నాతఁడు గోవిందరాజును
గోనేటిగాంచె నాగుండరాజు
గోవిందభూపతి కొండప్పఁ దిరుమల
రాజునుగాంచె గుంద్రాజునకును

ఆ. దమ్ముఁడయినకోన ధరణీధవుఁడుగాంచె
నరసరాజుఁబోతధరణినాథు
సోమరాజు చిన్న భూమీధవునిగాంచె
బాలరాజునతివిశాలయశుల. 56

గీ. తిప్పభూవరు సుతులలోఁ దిమ్మరాజు
కనియె వేంకటరాజుఁదదనుజుఁడైన
పిన్నసోమధరావరుఁ డన్నరాజుఁ
గోనవిభువెంగలక్ష్మాజానిఁగాంచె. 57

వ. సోమరాజు ననుజన్మండును దిప్పరాజున క|గజుండు నగు తిమ్మరాజు
గుణంబు లెట్టివనిన. 58

సీ. నిత్యప్రవర్తిత నిర్మలాచారంబు
లశ్రాంతహితదేవ తార్చనములు

నిరతధర్మవిచారనిష్ఠావిశేషంబు
　　　లనవరతార్యసేవాదరములు
సంతతాతిథి సంఘసంభావనంబులు
　　　ననిశవిద్యావిలాసాగమములు
ప్రతిదినకల్యాణబంధురోద్యోగము
　　　ల్సతతాధ్వరోత్సవ సంభ్రమములు

గీ. నంతకంతకు నానాఁట నతిశయిల్లఁ
గుంటికాలొందు ధర్మవుకుంటుమాన్ప
నాదిభూనాథుఁ దలపించె ననఁగమించె
బొమ్మనరనాయకుని తిమ్మభూభుజుండు. 59

ఆ. బొమ్మవిభునితిమ్మభూపాలకుఁడతండు
నాగమాంబయనెడు నాతివలన
సుతుల వతులశితయశోధనులనుగాంచెఁ
గోనవిభుననంతమానవేంద్రు. 60

సీ. వారిలోఁ గోనభూవరునిదమ్ముఁ డనంతుఁ
　　　డెఱ్ఱమాంగనయను నిఁతివలనఁ
బాపరాజును భీమభూపాలుఁ డురుమల
　　　రాజును వేంకటరాజుఁ గాంచె
నందుఁ బాపమహీశుఁ డాత్మజన్ములఁ గాంచెఁ
　　　గొండమాంగనయందుఁ గోనరాజు
నెల్లవిభుననంతు నిందుఁగోనవిభుండు
　　　రఘునాథుఁగొండమారమణివలన

గీ. వేంకటాంబయందుననంత విభుని గాంచె
నతఁడనంతభూజాని కీర్త్యంబనలనఁ
గనియెఁగావేరిరంగనాధుని దనూజుఁ
దత్కులం బిట్టు తామరతంపరయ్యెఁ. 61

వ. పాపరాజుననుజన్ముండగు నాగరాజునన్వయంబెట్టిదనిన. 62

క. ఆనాగధరిత్రీకాం
తానాథుఁ గాంచె రామనరవరు సిద్ధాం
బానలినేక్షణవలన
న్మీనపతాకుని బయోజనేత్రుఁడు వోలెన్. 63

క. ఏపునఁ జరియించెంబృ
థ్వీపాలనచణుఁడు రామవిభుఁడహితనృప
వ్యాపారాపారమహా
కూపారాగస్త్య సదృశగురుతరమతియై. 64

క. క్షితిముఖలోకాంతరసం
వితతయశుఁ డనంతరాజు వేంకట ధాత్రీ
పతివేంకటాంబవలన
న్సుతుఁగాంచెం గృష్ణుబలనిషూదనభాసున్. 65

క. ధారాదత్తంబీవసు
ధారాజ్యము చేసెఁ గృష్ణధాత్రీపతి మే
ధారాశి బుధుల కరికసి
ధారాదత్తంబు స్వర్గతలముంజేసెన్. 66

వ. తిమ్మరాజు తనూభవుండును ననంతరాజు నగ్రజుండునగు కోనరాజు గుణంబు లెట్టి వనిన. 67

సీ. దాతృత్వతరతమత్వము చూచుటకుఁబలెఁ
గల్పకద్రుమసీమఁ గ్రాలువారు
రమణీయతేజఃపరామర్శకును బలెఁ
బంకజాప్తునిదూఱఁబాఱువారు
ధైర్యప్రమాణంబుఁ దలపోయుటకుఁ బలెఁ
గిరిగుహాగేహాళిఁ గెరలువారు

గాంభీర్యపరిమాణకథ చర్చకునుబలె
జడరాశిలోఁబడనడుచువారు
గీ. నై చరింతురు నిఖిల దిశాంతరముల
హేతిహత భీతపరిపంథిభూతలేశు
లద్భుతంబందు టరుదె కోనావనీశు
దానతేజోగభీరతాధైర్యములకు. 68

ఉ. స్థిరజయుఁ డైనకోననరదేవు యశోవనరాశి యాసుధా
కరునకు జొంమ్మబంటి కలకంఠుని కుత్తుకబంటి నాకరా
డ్ద్విరదము చెక్కుబంటి ఫణిదేవుని కన్నులబంటి శారదాం
బురుహవిశాలనేత్ర తలమున్కలునై విహరించు మించుగన్. 69

క. ఆ కోనక్ష్మాతలపతి
శ్రీకాంతుఁడు లక్ష్మిఁబోలెఁ జిన్నమదేవిన్
రాకాకోకాహితముఖి
నాకర్ణేక్షణ వివాహమయ్యెం బ్రీతిన్. 70

సీ. వల్లభు నెదఁగోరి యెల్లప్పుడును నుండు
నిందిరాదేవికి నీడనంగ
మగనిదేహములోన సగమై ప్రవర్తించు
హిమశైలకన్యక కెన యనంగఁ
బతిసమ్ముఖంబునం బాయక వర్తించు
శారదాదేవికి సాటి యనఁగ
వరు సహస్రేక్షణాదరణమునుంగాంచు
పౌలోమితోఁ బోల్పఁబోలు ననఁగ
గీ. సకలసాధ్వీజనంబులు సన్నుతింపఁ
బతియ దైవంబకా కోరి పరిఢవిల్లు
విష్ణుచరణాబ్జవిస్రంభ విగతదంభ
చికురజితనీలరోలంబ చిన్నమాంబ. 71

క. ఆ నలినేక్షణవలనం
గోనధరావరుఁడు కనియెఁ గొడుకుల నెల్ల
క్ష్మానాథునిఁ దిమ్మమహీ
జానిన్ రవివిభులఁ బ్రసవయకనిభులన్. 72

వ. అందుఁ దిమ్మరాజునన్వయం బెట్టిదనిన. 73

ఉ. ధీవినుతాఖ్యుఁ డౌనతఁడు తిమ్మనృపాలకమౌళి దాదెమా
దేవులయందుఁ బైడినరదేవనరుం బినకోనరాజు రం
గావనిపు న్మరంగవసుధాధిపునిం గనియెం దనూజులన్
ధావితవైరివీరుల సుధాకరనిర్మలకీర్తి హారులన్. 74

ఉ. పైఁడినృపాలకుం దనిన బంగరుపేరది నిక్కమౌటకుం
బైఁడివసుం ధరావరుఁ డపారకృపావనరాశి నిచ్చలుం
బైఁడివసంతమాడు ధరపైఁ గనకాంచమనం జనుం జుమీ
పైఁడిగఁ జేయు నయ్యవనిపాలుని తేజము దానజాండమున్. 75

సీ. పరభూమిభృత్పక్షపాటవాంతకరుండు
ఘనవారణారోహకరణదక్షుఁ
డరిబలమదభేదనాపాదిభుజశాలి
హితసహస్రేక్షణాన్వితగాత్రుఁ
డహితపాకాచారహారి విక్రమశాలి
సంతానకల్పితోత్సవభరుండు
శత్రువారవిదారి శతకోటి తరవారి
కృతసుధాహారసత్కీర్తియుక్తుఁ

గీ. డింద్రుఁడాకోనభూపాలు నేలదొరయఁ
దేల మనుఁడయ్యెఁగోనభూపాలుఁడనినఁ
గోనభూజానిసత్రతపితాన మొసఁగు
సుతపంబ వెంటఁ దిరుగు నాజంభభేది. 76

ఉ. బల్లిమఁ డైన కోనవరపాలకుఁ డాతఁడు గాంచె నోబమా
హల్లకగంధియందు సమిదగ్రరిపుగ్రహణోగ్రశాంబరీ
భిల్లుని నెల్లభూభుజుని భీకరతాకరవిద్విషద్విటీ
పల్లవుఁ దిమ్మరాజు రణపార్థునిఁ గస్తురిరంగనాథునిన్. 77

వ. ఆ కోనరాజు సహజన్ముల గుణంబు లెట్టివనిన. 78

చ. వనజభవాండ భూభువనపల్లభు లెల్లరు నెత్తిరా నతం
డనిమొన షణ్ముఖస్థితి మహామహుఁ డౌనని సన్నుతింపఁగా
దనఁజనుఁజూ వసుంధర సహస్రముఖస్థితి సగంరాంగణం
బునజఁనబూను రంగనరపుంగవు భృంగకచామనోభవున్, 79

సీ. శరభాతిదారుణసత్వసంఘాతవి
భాసురారణ్యంబు పట్టనంబు
కమలబాంధవతురంగమవిశ్రమాస్పద
శైలశృంగాగ్రంబు సౌధతలంబు
భయదమహాధ్వాంతపటలసాంద్రీకృత
గహ్వరరాజంబు కనకగృహము
ఝంఝానిలావేశసంజాతకర్కశ
కీచకధ్వానంబు గీతరవము

గీ. శూరసందోహనిత్యసంస్తూయమాన
విక్రమాక్రాంతధారుణీచక్రభరణ
భాసినిజభుజశ్రీరంగపార్థివేంద్ర
రణపరాఙ్ముఖపరిపంథిరాజతతికి. 80

క. శ్రీరంగప్రభుఁడాశిఁ డు
దారగుణాఢ్యుండు కేళవాంగనవలనన్
వీరాగ్రగణ్యుఁ వార్ధిగ
భీరు సఘునాథు నహితభేదిం గాంచెన్ 81

వ. తిమ్మరాజుతనూభవుండగు కోనరాజునకుఁ బ్రథమపుత్రుం డగు
నెల్లమరాజు నన్వయం బెట్టిదనిన. 82

క. క్రమమున నాయెల్లధరా
రమణుఁడు కల్యాణమయ్యె రమణీయల దా
దెమ తిమ్మమ యెల్లమ రం
గమ లను నల్వురఁ బయోధికన్యానిభలన్. 83

సీ. అందు దాదెమయందు నఖిలావనీనాథ
పూజనీయుఁడు కోనభూభుజుండుఁ
దిరుమలాంగనయందుఁ దిరుమలభూపాల
వరదవసుంధరావరయుగంబు
నెల్లమాంగనయందు నిందిందిరాలకా
సుమచాపుఁడు చినతిరుమలవిభుఁడు
రంగమాంగనయందు సంగరాంగజవైరి
మట్ల్యనంతనృపాలమౌళి నేను

గీ. సుతుల ముదయించితిమి జనస్తుతనిరూఢిఁ
బ్రథితయశుఁ డైన యెల్లమరాజమణికిఁ
బ్రకటవాచావిశేషపురాణఫణికిఁ
సమదపరిపంథిసింధురశాతసృణికి. 84

క. కదనమునఁ గోనభూధవు
ప్రదరంబులఁ బగిలి పాఱు పరిపంథినృపు
ల్వెదురుఁబొద లీచెగము లని
మదకరు లన గిరులనంద్రుఁడు మదిఁ గొనుభీతిన్ 85

క. తిరుమలనరవరు యశము
ద్ధురముగఁ దఱుమంగ నరాతిదుర్యశము వెసం
బురహరుకఁ తాశ్లేషము
కరమరుదుగఁ జేయు నీలకంఠుం డయ్యెన్ 86

మ. వరదాంతాగ్రణియై సమస్త వసుధావాల్లభ్యవిభ్రాజియై
వరదాధీశుఁడు మల్లివంశమణి నెవ్వంబాచుఁ బ్రత్యర్థిన
వ్వరదానంబునఁ దద్విపవ్రజ మఖర్వస్ఫూర్తిఁ బ్రత్యర్థిన
వ్వరదానంబునఁ జేసి మన్నిగొను లేవా యెట్టి చోద్యంబులున్. 87

చ. అనలుని నాశ్రయాశుఁ డను నంబుజబాంధవు నాహవావనిం
దనపతిచేతఁగూలు విమతప్రకరంబులు దూఱఁబాఱనొ
క్కనినయినం దహించు వగ గానఁడు దానను నెంచశక్యమే
ధనధనదాభు చిన్నవరదప్రభుతేజము పేర్మి యేరికిన్. 88

సీ. నిమిషార్ధవిచ్ఛిన్న సీరంధ్రవిద్విష
ద్గురుశిరస్త్రాణము లొక్కడిగ్రుడ్డు
లభియాతి తనుధావదసృగాపగాకోటి
యహరహంబును ద్రావు నావుపాలు
కదనాహితామితగంధ దంతావళ
గాత్రకాండంబులు కప్పుగములు
పరిపంథి భూధవప్రాణసందోహంబు
లనిశంబు భుజయించు ననిలసమితి
గీ. గాఁగ నిరతంబుఁ బోషించుఁ గయ్యములను
జిన్న తిమ్మనరేంద్రుఁడు చిరయశుండు
దాయపైఁ బడి నాలుక గ్రోయుచట్టి,
జిష్ణుబాహార్గళకృపాణ కృష్ణ ఫణిని. 89

వ. ఏతద్వంశసింధుసుధాధాముండును దిమ్మరాజునకు నగ్రజుండును
మదీయజనకుండును గోనరాజతనూభవుండుఁ జిప్పమాంబాగర్భశుక్తి
ముక్తాఫలంబు నగు నెల్లధరాఖండలు నఖండితగుణంబు లెట్టివనిన 90

సీ. హరిపదాచలమహాధ్యాసులు గాకున్న
హరిపదాచలమహాధ్యాసులైరి
భృతమహావనమార్గరీతులు గాకున్న
భృతమహాపనమార్గ రీతులైరి

బహులాభరణభీరుసహితులు గాకున్న
బహులాభరణభీరుసహితులైరి
ధర్మసంధాధీనకర్ములు గాకున్న
ధర్మసంధాధీనకర్ములైరి

గీ. వాసవాశాదికాశాచమూసమూహ
తాడితోర్వీచలద్రజస్థగితతపన
మట్లియెల్లధరానాథమహితశాత
హేతిహతభీతమదవదరాతినృపులు. 91

ఉ. ఎక్కడఁ గాన మెల్లధరణీశ్వరు హేతికరాతిభీతిమై
నెక్కనిధారుణీధరము నేగని దుర్గదిగంతరాళముం
ద్రొక్కని కాననాంతరముఁ దోఁగని దివ్యనదీనదంబులు
న్మ్రొక్కని రాలునుం దినని మూలపలాశపలాశజాలమున్. 92

సీ. గాంభీర్యభవకీర్తి కలశపాథోరాశి
వాచాలతాకీర్తి వాగ్వధూటి
భూమీభరణకీర్తి భోగిలోకస్వామి
సాహసార్జితకీర్తి శంకరుండు
సంగీతజనికీర్తి జలజాతభవసూతి
దాతృత్వకీర్తి సంతానశాఖి
ధైర్యధారాకీర్తి తారాచలేంద్రంబు
వదనప్రభాకీర్తి వనజవైరి

గీ. గాఁగ విహరించు నిఖిలభూకాంతమౌళి
పటహభాంకారకారణప్రళయకాల
భైరవారావశంకానిబద్ధబుద్ధి
విద్విషద్వీరుఁ డెల్లపృథ్వీప్రభుండు. 93

సీ. ఝిల్లికాఝుంకారవేల్లల్లతాన్ద్రి
తాహవేష్టిత కంఠబాహులగుచు
దావపావకదగ్ధ ధరణీరుహశ్వేత
భసితపాండురదేహపాళులగుచు

సభ్యంగదూరమహీజటీకృతకేశ
పాశభారశిరోవిభాగు లగుచు
గహనధావననిదాఘస్రవజ్జలధునీ
సంగతిలసదుత్తమాంగు లగుచుఁ

గీ. ప్రియసతీవామపార్శ్వులై పెరయకున్న
నీశ్వరత్వంబు భజియింతురే యటంచు
సహితకాంతలఁ గాంతుల నడలఁజేయు
భూమిభరదానిభుజుఁ డెల్లభూభుజుండు 94

షష్ఠ్యంతములు

క. ఏతాదృగ్గుణమణిగణ
జాతాతతకీర్తిభోగ్యశసఘనమనుసం
ఘాతాని ... ...
... ... ... 95

క. ... ... ...
... ... రాహుగ్రహణా
తురతర పరిపంధిముఖాం
బురుహారికి యజనపుషితపురుహూతునకున్ 96

క. అభ్రము వల్లభ... ...
... ... ...
... ... ...
... ... భూభృత్తరికిన్. 97

గ. పటహీభూతక్ష్వేడా
భటజాతీభూతబాహు ఫలితకరోరో
స్ఫుటమటిత సిద్ధవట పటు
పుటభేదన ... ... 98

వ. ... ... నా సమర్పింపంబూనిన కకుత్స్థవిజయం బను
మహాప్రబంధంబునకుం గథాక్రమం బెట్టి దనిన. 99

క. శ్రీనిత్య వైభవాస్పద ...
... ... ...
... ... ...
... ... జగములు వొగడన్. 100

ఆ శీతాంశుకులావతంస మనురూపాస్థానధన్యాసనుఁ
వైశంపాయను జూచి యిట్లనియె ... ...
... ... ... ... గొన్నెనా
కాళాస్యంబు పునః పునః శ్రవణ మయ్యా మీరు వాక్రువ్వఁగన్. 101

వ. అని మఱియు సభాసదుల కానందంబుగా నభ్యర్చించి ప్రా ... 102

క. ... ... ...
... ప్పదనాభిరాజ్యవనితాజనతా
రతిరాజభోగసంపద
నతిలోకుం డెవ్వఁ డయ్య యాద్యులలోనన్. 103

క. ఈదేశవిశేషంబున నీ ...
... ... ...
... ... ...
... ... ... 104

క. అన విని కృష్ణద్వైపా
యనముని శిష్యుండు దలఁచి యంతటిరాజో
త్తమ మేజయభూవరయా
మనునం ... ... 105

గీ. అందికొన్నాఁడు మన్నాఁడు కందులేని
యెల్లసిరులకు నెల్లయై యెవ్వఁడర్జుఁ
దర్జునాన్వయమణి కాక యత...
... ... ... 106

క. ... ... ...
... ... నరులెనయే
... ... ...
కానరు నకులాగ్రజు ప్రకారం బితరుల్ 107

క. నరునకు నభిమన్యుండుం
బరీక్షితుఁ ... ...
... ... ...
... ... వినుమని పలికెన్. 108

సీ. కిటిదంష్ట్రిపై నొత్తిగిలి పండుకొనియుండు
భూసతీమణికర్ణభూష యనఁగ
నమరేంద్రుఁడవనిలోకమున కిల్లెడయిద్ద
దేవలోకము భాగధేయ మనఁగ
బరిఘూర్ణిచేలంబు పఱచిపెట్టిన రత్న
గర్భ నోమునఁ గన్న కానుపనఁగ
సకలసంపత్కలాజనక మహీరాజ్య
లక్ష్మికటాక్షాంచలం బనంగఁ

గీ. దేశమునఁ బొల్చు సాకేతరాజధాని
భానువంశంబు పాళెంపుఁ బట్టు దానిఁ
బొగడఁదగ దెట్లు రఘురామపుణ్యచరిత
కథక వాగ్వ్యక్త సౌభాగ్యగౌరవంబు. 109

వ. విశ్వకర్మనిర్మితంబై యమరావతీసమ్మితం బనుట కియ్యకొనక యనేక
మహిమాకరంబగు నప్పురంబు సౌభాగ్యంబు లాకర్ణింపుము. 110

మ. బలిఁ బాతాళముఁ దూఱఁ ద్రొక్కుహరికిం బాదాగ్రమంజీర మం
చుల బల్మిం బయికెక్కఁగాఁ దిగిచి యచ్చో నిల్పి చెంగల్వమొ
గ్గలఁ బూజించిరొకో సుపర్వులనఁగాఁ గాకుత్స్థసంపల్లతా
ఫలితద్వారసువర్ణ సౌధమణివప్రం బొప్పు నవ్వీటికిన్. 111

గీ. నీలమణిసౌధరుచి పేరి నిండుఁగొప్పు
సురధునీమల్లికాదామ పరిచితంబుఁ
దనరఁదలయెత్తుపురలక్ష్మి కొనరె మణుల
మొగపుఁదీఁగెయుఁబోలె నన్నగరికోట. 112

మత్తకోకిల. మేరువాయసమానసోత్తర మే వెలుంగుల జేనికిం
దేరుగానుగుటాటలాడఁగ దిద్దెఁ బెద్దతనానకుం
బేరుగానని చూచి లేచిచఁ బిక్కుదాఁకవె చుక్కల
య్యారె మీరెఁద్రియామల న్మలయాద్రినాదగు కోటకున్ 113

ఆ. పరిధిరూపమైన పరిఘాపయోధి యి
క్కోట కోటువడిన కొండవోలు
నడుమఁ జిక్కె నదియు నవ్వొ లోకాలోక
మానసోత్తరముల మధ్య జలధి. 114

గీ. కపటకమఠకిటిగ్రావగంధకరుల
ప్రాపు ప్రాపింపనునికి నేపాటు పడునొ
ధరఁ బరిఖఁదేలు కరు లహీశ్వరునిఁ బెద్ద
తమ్మితూఁ డని పెకలించి చిమ్మెఁ గేని. 115

క. అటు దగుకోట నయోధ్యా
పుటభేదనమణి కుమార భూలోకపునం
బటువై బెడఁగై హిమజల
తటినీమణి ఘమునగాదిధన్యతఁ బొలుచున్. 116

క. పెదనగరిపాటి కోటలు
పదిగలవవి వజ్రమణుల పనులవి యెల్లన్
మొదలితెగ మూఁటఁ దేరులు
మదకరులును హరులు రాజ్యమాన్యము లుండున్. 117

ఉ. అన్నిటి కన్నిశాలలు తదంగవిలక్షణవర్ణరత్నసం
పన్నత భాసిలు న్వరణపంచకవీధులు వస్తుశాలలుం
గన్నవిరెంట జేనికి నగళ్ళు విరాజిలుఁ దక్కు నిళ్ళకుం
బిన్నవె బంధుఁ గేహముల పెంపిఁక నెంతయొ వీటికోటకున్. 118

సీ. శాలిపాలకబాలికాలోకనములు చే
సఱచిపాఱఁగ వెంటఁ బఱచి పఱచి
యగడితకదలి నౌరగచలత్కన్యల
మీఁదఁ బారలు సాచి యీఁది యీఁది
తటముహుర్ముహురుత్పతద్వాజిరాజితో
గగనవీథికిఁ బుటం బెగసి యెగసి
చిఱుతనూఁకుల నింగి జీర్వారు గేహవ
ప్రముల నిచ్చెన లేక ప్రాఁకి ప్రాఁకి
గీ. బడలి పథికావలోకము ల్పప్పళింపఁ,
జేరుఁబో వారగణికాకటీరతటుల
విల్లజడనల్లచిలువలుత్ఫుల్లకుసుమ
రసవిషము గ్రక్క నిలుపోపరాదుగాని. 119

చ. లలితములైన యాపరిఘలంచగు మేడల వారభామిను
ల్నెలపొడుపు ల్గనుంగొనుచు నిట్టునా యూకము చూచి ఖేచరు
త్తులఁపులఁ దమ్ముఁ గోల్పడిరిఁ దన్పొటవీక్షటప్రభావము
ల్దెలిపి పురల్తు రొయ్యన నతిప్రియభాషలఁ దత్తలోదరుల్. 120

ఉ. వాడెడు మోముఁదామరల వాసనఁ గట్టుచు దివ్యదంపతు
ల్వాడెడు నేలనాఁడు నపలాగమి యుప్పరమేడలెక్కి జ

వ్వాడెడు కౌనుదీవలొలయంగఁ బురందరుమీఁదిగీతము
లాడెడు కిన్నరప్రమదల న్వినుచున్సురతాంతవేళలన్. 121

సీ. ఆతరు లమరలోకాలోకమునకెక్క
జగతికాఁగలదేమొ గగనభాగ
మాదంతులు కులాచలాలానముంగొన్నఁ
గుమ్మించునేమొ దిక్కుంజరమ్ము
లామావులాత్రోవ కలఁతిదాఁటులు దాఁట
సరివీధి గనునేమొ తరణిహయము
లావీరభటులు సాహసపు సాములఁబూయఁ
బై పూఁత యగునేమొ బలపరాగ

గీ. మాచకోరాక్షుల కటాక్షమందునేమొ
సాంగముగఁ జూడ సామ్రాజ్య మంగభవున
కాపురమ కాణయాచియై యమరునేమొ
కాఁపురము సేయ వీరశృంగారములకు. 122

మ. పరిఘావారిధి వజ్రవప్రఫణిరాట్ప్రాకంబు ప్రాసాదమం
దరసాహస్రముఁజుట్టి త్రచ్చుటలనో నాసైంధవోచ్చైఃశ్రవో
ద్వీరదై రావణకోటి ముఖ్యవిపరీతీభూతతత్సంపదు
త్కరలబ్ధిం దగి రాజధాని జితనాకస్ఫూర్తి మించు న్మహిన్. 123

సీ. సతతశ్రుతిస్మృతిశిక్షణయోగ్యతకుఁ దాన
నెలవై సదాచార కలిత మగుచు
సత్రాసకృద్రసస్యందనవ్యాపార
ముల తెఱగంటి విందులు నడుపుచు
హంసరథాంగబలాభిరామసరోచి
రామోదభరితమై యంద మొంది
ప్రౌఢభుజంగవాక్ప్రాబల్యముఖరమై
కమ్రనీయవనమాలికలఁ దనర్చి

ఆ. వింటికంటె నేమి వెలితి నానచ్చోట
జంపుగను నిలానిలింపగణము
చూడమే జపాప్రసూనసన్నిధినున్న
స్ఫటిక మెట్టులుఁన్నొ ప్రాప్తదీప్తి. 124

క. కుధరశరాసను శౌర్యము
మధురశరాసనుని సౌకుమార్యము గలవా
రధికరథికు లధిగతనిర
వధికయశు ల్సూర్యసోమవంశజు లందున్. 125

క. పెదనగరిగరిడికందుఁ
బదింట నైదింట వచ్చి పనివిను వేళన్
బొదువఁబడిచూతురెల్లరుఁ
గొదమపులులవంటిరాచకొడుకుల వీటన్ 126

క. ఏలాసృష్టికిఁబ్రతియనఁ
గాఁ లోఁగిరి గాక రజతకాంచనమణులం
గైలాసమేరురోహణ
శైలములకు మాఱు సేయఁ జాలరె వైశ్యుల్. 127

సీ. ఓర్చునాగలిఁగూర్చి యొకకొంగ్ర యెత్తిన
ఫణిరాజు తలగుట్టు బయలుపడదె
మొనయించి కుఱుగాడెములలోన వేసిన
జమునిదుంతకు వెన్ను సందువడదె
అద్దెసేఁతకు జొచ్చినపు డున్న దీవితోఁ
బైయాఱుదీవులు పైరు గావె
యీఁగిఁచేయాఁగినఁబ్రోగైసపంటకు
జగము లన్నియు గడఁజాలుఁగావె

ఆ. యొరులనొడలు నలయఁజొరదు గాకటు సేయ
నేల యనుచుఁ దగిన నేలవలన

నన్నివస్తులు నెంగనిపింపఁ దైవ్రి లోకైక
భద్రకరులు వీటిశూద్రపరులు. 128

చ. చిలుకకు మావికిం బగలు సేయుచునున్నరే లతకూనలార వే
వళుకులు వచ్చుమీఁద బలవంతుఁడు కంతుఁడు రేపు గుబ్బలై
కులుకకపోవు నేడలము కొన్నసునుంజనుఁబూప లంద్రు ప్రే
మలముడికాండ్రు పండిపడు మావిడితోఁపులఁ గాపుఁగూఁతులన్. 129

గీ. పూవు లంగళ్ళలోఁ జల్లపూటపీటఁ
జేడియలతోడ బేరంబు లాడునపుడు
తగులు విరిమాట తరితీపు ముగియనీదు
జట్టి యొకమాలికకు నైన జాణలకును. 130

వ. ఎట్టులంటేని. 131

ఉ. నీవిరిదండ కేమి వెల నీసిగ కెంపులసంత దండకుం
గోవయొ క్రేవయో యెఱుఁగ్రొవ్విరి గుర్తము గోపఁబాసినం
గ్రేవ ఘటింపఁ గన్నెవిరికెంపులనింప దరస్మితప్రసూ
నావలి క్రేవక్రేపమధురాధరపెంబశిఖాతటంబునసన్ 122

క. ఎవ్వరికో యిరువురిలో
నెవ్వరికి నపేక్షసేయ నిరవగుచునఁగా
నివ్వని కింపులమాటలఁ,
బువ్వులచే రెత్తినట్లు పుట్టుం బొంతన్. 183

ఆ. తరుణి నీవు చూడి విరిదండదానవా
తగులుదండదాన వగుదుగాక
యనుచు జాణ గట్టుఁ గనునవ్వుదండ య
వ్వువ్వులావి కట్టుఁ బువ్వుదండ. 134

ఉ ఈవిరిదండ కొప్పు పెణిమెచ్చిన నీవిడి యేమి యిచ్చినం
బోవుఁ గదా బళీ తెలిసెఁ బో వెఱదండము నేను నోటనా

పూవులపూవుబోఁడి ముడిపూవుల దండలదానిఁ జేరరా
దా! వెలయాలనా యనును దద్విట లీలకుఁ బుష్పలావియున్. 135

వ. మఱి యన్నిదిక్కులం జొక్కులు గులుకు పలుకులఁ జొక్కంబులై
రొక్కంబుల ధిక్కరింప నవి యట్లుండె. 136

క. ఈతీయతీఁగె నవ్వన,
కేతనులత కెత్తువచ్చె యెత్తయ్యో నె నీ
చేతివిరిదండ యను యువ,
చేతోభవు పుష్పలావి చీరదె మరలన్. 137

ఉ. ఆనగరంబు గంధవహుఁ డంగడివీథులనాడుచుం గురా
సాని పిసాళిగందవొడి సన్నపుఁ గుంకుమపూవుఁ బోఁచ లే
మేనియుఁ జొచ్చి యెత్తికొని యిచ్చకు వచ్చినత్రోవఁ బోవఁగా
నౌనని పెట్టికట్టి యొకఁడైన మరుం గిడఁ డెంతముద్దొకో. 138

సీ. కొలుతురా చసువు గైకొనఁగఁబువ్వొడులార
పదరేణువులపొంతఁగుడుకొనుఁడు
కలతురా సహవాస మలరుఁదేఁ మలార
వలిగుబ్బ చెమటలఁ గలకొనుఁడు
తగుదురా చెలిమి కుద్యానవాస లార
మేనితావుల నత్తమిల్లికొనుఁడు
అగుదురా తోఁబుట్టు లళికుమారకులార
కురులతో ముచ్చటల్గొంఁగికొనుఁడు
గీ. పోలు నని యేచి వాని నపొందుపట్లఁ,
దారసిలుఁ దట్లపైఁజల్లుఁదార్చుఁగూర్చుఁ
జేడియల నాటకొండల నాఁడునాఁడు,
మధురసాకూతసాకేతమారుతంబు. 139

సీ. పరువంపుమొగ్గలు విరియింపఁ బువ్వారుఁ
దోఁటకుఁ దుమ్మెదదాఁటుఁ దేఱ

విరికి క్రేఁగగు తేనె వెడలింప నేలని
    పుప్పొడి కనుజాఁటుబూది చల్ల
వలపువసంతమై వఱలువాడ ల నాడు
    వలపువీసరవోక నిలువఁ గావ
నలుక మోములకు వెచ్చలురేఁచి కలయింపఁ
    గళరేఁగు పనులపై నలఁతఁదీర్ప

గీ. వలఁతియై చూడ నలఁతియై మెలఁగుచుండు,
సకలవీథుల వాకిలి శంబరారి
కేడుగడయును వాసనాప్రేరితాళి,
సీరుతంబగు సాకేతమారుతంబు. 140

ఆ. చెదఱిపాఱు నళులు పొదమీఁదిపూవిల్లు
రిత్తవడిన చివురు బత్తళికయును
దెలుపు వేగుఁబోక వలఱేని యూఱట
నుపవనాంతరముల నొకట వీట. 141

ఉ. వైపణపేటికావివిధవాసన లుప్పతిలంగ లోనఁబై
నౌపవనప్రసూనరజ మంతటఁ గప్పికొనంగ నుండుఁబోఁ
బైపయిఁ దావిగట్టు వలిపంబున జుట్టిటుఁ బెట్టినారు గా
నోపు జవాదికోఱయని యొప్పుకొనం దగుఁ బ్రోలు భూవరా 142

క. వలదుపవనవాసనలం
గలవిపణుల మృగమదాదికము గమగమలున్
వెలుపల లోపల వలపులు
గల నునుఁగప్పురపు బరణిగా కది పురమా 143

వ. అట్టి సొంపులకుం బట్టయిన యప్పురంబున కధీశ్వరుండు 144

సీ. వైవస్వతమనునాసావీథి నెవ్వాఁడు
డిగ్గన వెలుఁగొంది డిగ్గ నుఱికె
లోకలోచనమైన యాకాశమాణిక్య
మెవ్వాఁడు గాఁజూచె నింటిమొదలు
కిటికచ్ఛపగజాహిగిరు లేవు రెత్తిన
నేల యెవ్వఁడు వలకేలఁ బూనె
సత్యలోకాధీశనిత్యానుసంధేయు
నిలువేల్పుగా నెవ్వఁడలకుఁ దెచ్చెఁ

ఆ. దం(డి తుమ్మఫలము తరణివంశమున ము
క్తాఫలంబు ధరణితపము ఫలము
ఫణిశయానుకృపకు ఫలమతండిక్ష్వాకు
జనవిభుండు రాజచంద్రమౌళి. 145

ఉ. వేలుపు లౌననం బుడమి వేలుపు లిచ్చలఁ బిచ్చలింప నే
వేలుపుఁగొల్వనొల్ల కలవేలుపు వేలుపురంగశాయి న
వ్వేలుపు బంతికి న్మొగమువేలుపుగా యని కోరికొల్చురా
వేలు పతండు వొల్చుఁ దొలువేలుపుగొంగ యనం బ్రసిద్ధుఁడై. 146

మ. అని పల్కం జనమేజయుండు మునినాథా యెచ్చటంగెల్చె ఘో
రనిశాటప్రతతిం బితామహగృహార్చావిగ్రహంబైన రం
గనివాసిం దనయింటి కెట్లు కొనిరాఁగాఁ గాంచె నిక్ష్వాకుఁ డ
జ్జననాథాగ్రణివార్త దెల్పుమన వైశంపాయనుం డిట్లనున్. 147

సీ. భూనాథ విను జగత్పూజ్యసామ్రాజ్యంబు
శతమఖభోగంబు నతిశయంబు
వెనుప వైవస్వతమనుకుమారుఁ డయోధ్య
సుఖమున్న నారదసఖుఁడు వచ్చి

యతనిచే నర్చితుఁడై లోకవార్తలు
కొన్ని వక్కాణించి మున్ను నలువ
తపముసేఁతయు రంగధామంబు ప్రత్యక్ష
మగుటయు నిలువేలుపుగ నొనర్చి

గీ. యతఁడు శ్రీరంగపూజల నాచరించు
క్రమముఁ జెప్పినఁ బరమభాగవతుఁ డాతఁ
డెచటఁదపమాచరింతు నేనెపుడు గాంతుఁ
బద్మజుఁడు గన్న నిధి యన్నఁ బర్వతుండు. 148

మ. పరమప్రాజ్ఞ సరస్సరిద్వనగిరు ప్రఖ్యాతము ల్పాడమే
నరనారాయణసంయమిప్రవర నానాపుణ్యగాథారహ
స్యరసజ్ఞాపకకీరవృద్ధ సహవాసప్రీతదివ్యర్షి భా
స్వరమౌ నాబదరీవనంబుకరణి న్వాక్రువ్వరే దేనియున్. 149

సీ. మును లిష్టసల్లాపమున నున్నఁ జెంగటఁ
జంచరీకము ఝుంకరించ వెఱచుఁ
దపసులపై రంచుఁ దలపొలంబునఁ బోపు
మెకము నీవరిచేను మేయవెఱచు
వ్రతులు కాషాయవస్త్రము లారఁగట్టినఁ
బ్లవగపోతము చెట్టు ప్రాఁక వెఱచు
మౌనులమణులువో దీననున్నవి యంచు
నంచ తామరకాయ చించ వెఱచు

గీ. నేమనఁగవచ్చుఁ గొనియాడ నెవ్వఁ డెఱుఁగు
నజభవాదుల కైన నత్యద్భుతంబు
బదరికాశ్రమవాస్తవ్యహారికాంక్షి
వివిధ నియమోపచిత తపోవిభవమహిమ. 150

సీ. ఆశ్రమస్థులరక్ష కావరణంబుగాఁ
గంపకోట ఘటించు గంధకరటి

యుటజాజిరంబుల నూడ్చి పొఱఁగ గ్రొచ్చి
యేటిక ల్దిసివైచు నేకలంబు
మునికుమారులఁ దోడికొనిపోయి యడవిలోఁ
బుట్టతేనియ త్రవ్వి పెట్టు నెలఁగు
పొదముండ్లు చెలిపి తపోధను ల్చనుత్రోవ
ఘంటాపథము సేయుఁ గాసరంబు

గీ. జపతపోమనుగాఢనిష్ఠలకును బ్రతి
బంధకము సేయు రాక్షసభటులమీఁద
సెలవుఁ గల్పించుకొనిపోయి గెలిచి వచ్చు
నచటి కంఠీరవములు సంయముల మ్రోల. 151

గీ. సంయమిక్రతుహుతరసాశనము మఱఁగి
యగ్నిభట్టారకుఁడు నిచ్చ లచట నుండ
నతని యెకిరింతయేడిక యనుదినంబుఁ
గొండగొఱియల బెదరించుచుండు బలిసి 152

క. భారతవర్షప్రభువగు
నారాయణు బదరికావనంబ కద పయః
పారావారము ... ...
... ... గాఁగన్. 153

క. విచికిత్స లుడిగి చేసిన
నచటి కృతము కోటిగుణితమై ఫలియించు
న్వచియించితి నని పర్వతుఁ
డచిరద్యుతివోలె నరిగె నంత నతండున్. 154

ఉ. ... అప్పుడప్పుడమి ... నూతకటారికోలలా
కొత్తులుఁ జిన్న నాఁ డరుల నోర్చిన సుద్దుల కాని దండురా
సత్తువలేని రాచముదుసళ్ళు నగళ్ళకడం గుమారకా
యత్తత నుండఁబంచెను సమంచితనీతివిచారదక్షుఁడై. 155

క. ... ... ...
ధీనము సచివవ్రజంబుఁ దెఱఁగొప్ప సుధా
ధీనము సుతశతము నయా
ధీనము గావించి నిజసతీసహితుండై. 156

వ. రథయానంబున. 157

సీ. పుణ్యసరోరణ్యభూములపైఁ ద్రోవఁ
జనుచు నొక్కెడ నొక్క వనమునందు
నొకసరస్తటమున నుచితక్రియాకలా
పములు నిర్వర్తించి సముపవిష్టుఁ
డై యుండఁగ వసిష్ఠుఁ డాగమించి సమాచ
రించు సపర్యలూరీకరించి
త్రిపదీగతత్రివేణీధర్మకలిత మ
ష్టాక్షరమంత్రంబు హరిపరంబు

గీ. పిలిచి యొదల వలకేలు నిలుపరించి
చదివె నాతని దక్షిణశ్రవణవీథి
నపుడు తచ్చిత్త మానంద మనుభవించె
నమ్మహాముని యంతర్ధినధిగమించె. 158

వ. ఇవ్విధంబున నధిగతపరమార్థుండై యప్పార్థివోత్తముండు తన చిత్తంబున
నెత్తికోలు ఫలించెనకా తలంచి రథారూఢుండై చని కతిపయసరస్సరి
దరణ్య గిరివరసముత్తరణానంతరంబున నెదుర బదరీవనంబుం గని ముని
శ్రావితలక్షణప్రత్యభిజ్ఞ నెఱింగి శతాంగారోహణంబు దొరంగి కురంగీ
పురోగమనసందిష్టమార్గంబున ప్రవేశంబును జాటింపు పనస పారిజాత సరళ
సహకారాదిసాంద్రతామిహిరకిరణనిరాసంబును గ్రముజటాపరస పరాయణ
పటువినిక్షిప్త విస్మృతసరస్తట సమిత్కుశగ్రహణనియుక్త ప్రక్షాళితపాణి
యుగప్లవగపదద్వయాను ధావసదర్శనీయపద్యాహ ద్వ్యసరాశంబును
సుమారమరుదుపరిచంక్రమణసముచ్చలితసురభికుసుమగర్భ కరణావసర
సమున్మిలితశిరశ్రుతివనితాలంకృత కబరీభరవిశంకిత హోమధూమ నిరం
తరాకాశంబును దదాగమవితర్కిత నిజతపశ్చరణనిశ్చయ పరస్పరవిజ్ఞా
పనపరచతుర శారికావచన నిర్దేశంబును సభిముత్రగంధసముపక్రమ

సమర్చనసమయసమాసీనగురుశిష్యపురఃప్రసవఫలవర్షి వనదేవతాకర
కమలపూర్వోత్తరదక్షిణదృశ్యాదృశ్యతాజనితవికచస్వకీయవదనవిలోకిశు
కనికరప్రపంచితకించిన్ముఖరహాసలేశంబును నగ్నిష్టోమాదిహవిర్భాగ
భోగాహూతసర్వనిలింపసమాగతిజ్ఞాపకయాగశాలాబహిర్భాగభాగైరా
వణస్వీకృతభోజినీభూతకరశీకరపిప్పలీలాశంబును దపఃప్రారంభపరి
ణామప్రవర్ధనదశాంతరప్రసన్నపరాదృష్టహరిహరబ్రహ్మసందర్శన
సంభ్రమోద్ధితనమోంతనిగమాంతస్తవపాఠకబ్రహ్మరాజర్షిపరిష్కృత
ప్రాగాదిదిగవకాశంబును నగు బదరికాశ్రమప్రదేశంబుం గనుంగొనుచుఁ
దన యాదలఁగదలు తుదలు దోఁచని తత్తదతిశయంబులవాఙ్మనస
గోచరత సూచింపనిలింప స్వాంతదంతావళాలానంబగునారాయణస్థానంబు
సొచ్చి యచ్చోట సంఘీభవించిన విరించసము లగు సంయములం గమ
లాక్షీసమేతుం డై సేవించి దీవించి సంభావించినం బొదలి తదీయపర
మోపకారంబున నుచితప్రకారంబుగా డగ్గఱి యగ్గరుడధ్వజు భజించి
నిజరాజధానికి సపరిజనకథంబుగా రథం బనిచి యంచు. 159

క. దినముఁ గనువిందు సేయఁగ
మునిగృహముల వన్యభోజ్యములఁ దృప్తుడై
మనుతనయుండంత నయం
బునకుం బనుపఱచి దేహముం దైవమతిన్. 160

క. సతి పరిచరింప విమల
వ్రతుడై గురుఁడగు వసిష్ఠవాచంయముఁడు
గ్రతపంబుఁ జేసి యుత్కృ
ష్టతపడసిన మంత్ర మచట జపియించె వెసన్. 161

చ. అడుగును నంగుటంబు నఖాగ్రము మేదినిమోపి మోవిలో
నుడివెడు మూఁడుమాటల మనుప్రవరంబున ధర్మమైన య
య్యొదయుని బెంకిమీఁదఁ బొడవొప్పఁగఁబుట్టలువోసె భానుడుం
బడమటికొండపై నిలుచుపాటికి బైట శిరంబు దార్కొనన్. 162

చ. ఒఱగక యిట్లు పాదనఖ మూఁది జడల్వెడ జాఱి మౌళిపై
గిరిగొనితోఁచఁగా ముడుపుఁగేలఁ దపం బొనరించె భూవరుం
డెఱిఁగి యొఱింగి యెప్డు దనయేలెడునాట నధర్మమట్లుగాఁ
బఱచినపాటు కట్టి కుడుపం జనునో చనదో విధాతకున్. 163

సీ. క్రాఁగిన వినువీథివేఁగి డిగ్గిన గాడ్పు
ధరఁ ద్రొక్కి దిర్దిరఁ దిరుగ నెగయు
ప్రేగుప్రేసినచోట వెడలిన శేషర
త్న ప్రభ గోత్రభిద్ధనువు మెఱప
వెచ్చనియిలు వేఁడి వెలుఁ గనునదియాస
లుడిగి లోకము ముచ్చముడిగి వడఁక
వలపు దుమ్మై వియోగుల యేపు లుడివోయి
యలరు పుప్పొడులు చేవంటఁబడఁగ

ఆ. మిడియ నెండ గాయ జడివాన గురియఁగ
సీతు గదుర వృక్షజాతు లలర
నగ్నిలోన బయల నప్పుల నప్సరో
గణము ప్రోలఁ జేసెఁ గడిదితపము. 164

చ. అతఁడు తపంబు సేయగ భయంపడి యింద్రుఁడు దివ్యభామలం
బ్రతిమధుమాసముం బనుచుఁ బంచిన వా రరుదెంచి తత్తపః
ప్రతిభకు దృష్టిదోషములు వాయఁగఁ గమ్మని లేఁత నవ్వులుం
జతురకటాక్షచంద్రికలుఁ జల్లుదు రింతియ మాటిమాటికిన్. 165

ఆ కడఁగి యపుడ కాదె కర్పూర తిలకకుఁ
బిలిచి ప్రియముఁ జెప్పి బిదురపాణి
పంతమాడెఁ జూవె బలభేదికొలువున
నదియు నంతరాయ మాచరింప 166

వ. అమ్మందగమన కిందుకందర్పమాధవమందమారుతంబులు సహాయులుగాఁ
బ్రార్థించి కొంత మంతనంబుఁ దలపెట్టి. 167

సీ. పగలు వెన్నెల గాయఁ దగవు గా దనకుమీ
యింతి నవ్వులవెంట నింతుగాని
యలయించువిలుగాని యలపడ దనకుమీ
తొయ్యలి బొమతోడఁ దొడుదుగాని
బయటఁ బూవులు వన్న బాడిగా దనకుమీ
యింతినవ్వులవెంటనింతుఁగాని
మలయంబుపైఁ గాని వలనుగా దనకుమీ
వనితగుబ్బలు సోఁకి వత్తు గాని

ఆ. రాచతబిసి మీఁద నేచి యీ కర్పూర
తిలక విలసనంబు గులుకునపుడు
చంద్ర కుసుమశర వసంత మందసమీర
యనుచు నెచ్చరించి యనిచె వ్రజి. 168

క. హిమరుక్స్మర పుష్పాకర
కుమారగంధవహులపుడు కోమలి లీలా
సమర సమద నిశితకటా
క్షములకు నాసీరభటులు గావుట కలిగెన్. 169

వ. అచ్చరలలో హేమాదులు కొందఱు కామాదులమ్ముందే రగుటకుం దగం
బిఱుంది సందడింప. 170

క. అచ్చెలువ మనువ మగతెగ
నెచ్చెలి జత డోయితోఁజని తపోవనికి
న్వచ్చి పని ద్రిప్పెగాముని
ముచ్చెచ్చ మరుఁ డపుడు రాజముని గనఁబడిచన్. 171

వ. మ్రొక్కి యచ్చేడియకుం జూపిన నదియు 172

ఉ. అంబుధియల్లుకుట్టు మన యచ్చరజాతికి బావవేల్పు, పీ
తాంబరుఁ డెట్టు లట్ల హృదయంబున కెక్కె నితం డటంచు దూ
రంబునఁ జాఁగి మ్రొక్కె ఋని రాజున కోడితిఁ బొమ్మటంచు గ
ర్వఁ బటీ పచ్చిఁ కంతుఁ ఁటవైచిన వాసనకైదువో యనన్. 173

క. అటులు ప్రణమిల్లి దివిష
త్కుటిలాలక రాచతపసి కొమరుఁగని బలా
జటులా పీరికిఁ దాలిమిఁ
జిటిలిచి యేనెప్పుడొక్కొ సిగ ద్రెంచుతున్. 174

మాలిని. అనుచు నతని మ్రోలన్, హావ భావాదిలీలన్
జినుకొక మకరాంకుం జేయు తీయంబు చిల్కన్
దనసఖులును దానుం దమ్మి నెమ్మోము తావిం
దనిసి కొదమతేటుల్ తందనాలుగ్గడింపన్. 175

వ. వనవినోదంబునకుం జొచ్చి విచ్చలవిడి విహరించునవసరంబున. 176

సీ. బెలకుల క్రొవ్వాడి వలచి వచ్చు కటాక్ష
మలతి పొన్నల పొలుపార్చియార్చి
చలువతోఁ దియ్యంబు సగపాలు కలసిన
పలుకునకొకమొగ్గ విలిచివిలిచి
యొరపులొయ్యన సాన నోలవాడెడునడ
నెమ్మిబోదుఁబపాల నెరపి నెరపి
తళుకులనెత్తావి కులికిపోసినగుబ్బ
లెలగాడ్పులకు నెదుర్కొలిపి కొలిపి

ఆ. చిగురు చిమముఁబోయి చిన్నారిపొన్నారి
మించుముద్దుఁ జక్కడించిడించి
యింతనంతఁ బోలసె నెలనాగ యెమ్మెటి
మది విరాళి పెనుప నదను వేఁచి. 177

క. మరచితిగా మును వలఁగొన
కెఱిగితినని మరల వచ్చి యెలనాగమునిం
చెఱుకుపిలుకాడు వాడిన
మెఱుగుంబోఁగనఁగఁ జుట్టె మెయి జిగి నిగుడన్. 178

వ. అయ్యవసరంబున. 179

క. కసరి పొదరిల్లు వెడలఁగ
నొసలొక తలిరాకుదాఁకె నునుగాడ్పునకున్
భసలగుణ మెక్కు వెట్టఁగ
గుసుమశరాసనునివిల్లు కుసులకు విఱిగెన్. 180

క. అందున వెఱగందియునా
కందర్పుఁడు నవమృణాలగదయనఁగా గు
ర్వింద విరి సురియయనగాఁ,
జెందిరతూపనఁగ జిగురుఁజేయమ్మనగన్. 181

క. గొబ్బన గొబ్బునఁ జేతికి,
నబ్బిన కైదువులఁ జెనకి యాడిన చెనకుల్
జబ్బువడుఁ గాని యేమిట
మబ్బొరయద ముని మనస్సమాధి జ్యోత్స్నన్. 182

క. సోముని వెన్నెలతోపులు
నాముని క్రొవ్విరులుఁ బూజలటులై యుండెం
గాముని పసలాముని దెస
భూమిని హరిభక్తు లఖిలపూజ్యులు కారే. 183

చ. మనుతనయుండు నంతట సమాధి సమాపన వేళయైన లో
చనములు విప్పి ముందటఁ బ్రసన్న పరిస్ఫుట బింబమొప్ప ని
ల్చిన నెల నిల్వుటద్దమువలెన్ మెఱయంగ మరుండు మాధవుం
డును నునుగాడ్పు మేనులకు నోఁచఁగ నచ్చరలాటలాడఁగన్. 184

వ. నిరీక్షించి రయంబునం జనుదెంచి. 185

సీ. రతికుచ స్వేదాంబురతపదాంబుజుఁడైన
పంచబాణునకేల పాద్యమనఁగ
విరహిని కన్నీటఁ గరములు కడిగినా
దమృతదీధితికేల యర్ఘ్యమనఁగ

కదియలేదేచోటఁ గాలూదఁ జలిగాడ్పు
దొరకేల కుశపరిస్తరణమనఁగ
గమ్మని పూవెల్లఁ దుమ్మెద కనిపెట్టు
బుష్పాకరునకేల పూజయనఁగ

సీ. సిగ్గుపడినారు చిత్తంబు చెఱుపఁబోయి
యచ్చరలకేల కుశలంబు లడుగుటనఁగ
జేసె నాతిథ్యములు తాల్మి మోసులెత్త
నట్టి తరుణాపరాధులక తపస్వి. 186

వ. అప్పుడప్పుష్పకోదండాదు లొండొరుల మొగంబులు సూచికొనుచుఁ దమ లోన. 187

క. తలఁకిరి తలలూచిరి వెల
వెలఁబాఱిరి వెఱఁగుపడిరి వేడుకపడిరి
నిలుకడ యీ తాలిమి యీ
గెలువంబీబుద్ధి యేరికింగలదనుచున్. 188

వ. అందునుం గందర్పుఁడాచందఁబు డెందఁబున దలపోసి. 189

చ. కలువలవిందు నక్తముచు, గమ్మకొలంకుల గాడ్పు క్రుంకుచె
ల్వలజడలున్ వసంతువనవాసము క్రొవ్విరి కత్తికోతలున్
వెలలివి నాదు మాధుకరవృత్తివిశిష్టగుణంబు నెంచియో
చెలిమియుఁ బ్రేమయుంబొదలఁ జేసె మహాముని యాతిథేయముల్. 190

ఆ. మరులు దొట్టిపొంటె మాచేయుపచు లెల్ల
నిట్లు వట్టివగుచు నెట్టవడియె
గాక యచట మమ్ముఁ గైకొని చూపినా
దద్దిరాత పస్వి యతిథి పూజ. 191

వ. అని తనమ్రోల ప్రాంజలియైయున్న రాజర్షి నాలోకించి. 192

గీ. నను జయించితి వేలయ్య మనుకుమార
విఱు గెఱుంగ జగంబెల్ల నెఱుఁగు నన్ను
నెవ్వరేమేమిగారు నా యేటుదాఁకి
యమ్మ నీబుద్ధి కెదురెక్కుఁ దయ్యెఁగాక. 193

క. అనిమిషరాజాదులు నా
ననవింటికి మారుమలసినారా హరుడున్
ననుఁ జిక్కులువెట్టియు నా
కొనకుూతన యోడిపోయె గ్రోధంబునకున్. 194

ఉ. ఎన్నటిమాట నీ వెఱుఁగుదే తుహినాచలమౌట మేనకం
గన్నులఁ జూపి యంపసెగఁ గ్రాచిన కాకకుఁ జల్లఁ జల్ల దా
రొక్కన్న విరాళినాఁటి వలిగొజ్జఁగి నీటు జుమయ్య ధాత్రికిం
బన్నిన కోడెకొండ యొడబాటునఁ దాల్చెఁ దదంక మిప్పుడున్. 195

ఉ. పుట్టుచు భూతరాసు లిటు పుట్టఁగఁజేయుట కె త్తికొన్నఁదో
బుట్టువు పూన్కియాడు మగపుట్టువు లన్నిట బందుకట్టి యే
బెట్టినచిక్కు గాదె గెలిపించె ప్రసూనశరంబు పంచి కొ
న్నటి పనుల్ వరించు నుభయాత్మకమైన ప్రపంచమంతయున్. 196

క. తూలక తులిచెంబవనునిఁ
దేలక తేలించె జలధిఁదీవ్రానలునిం
బ్రేలక ప్రేలిచె నీయెడఁ
జాలక చాలించెఁ బ్రసవశర మాకడకల్. 197

పంచచామరము. అభీష్టసిద్ధి నీకగున్ మహాత్మ పోయివత్తుమా
ప్రభుఁడు వజ్రపాణి మమ్ముఁ బంచె నివ్విశేషముల్
లభించెనంచుఁ బల్కి యబ్బలంబు వెంటరాఁ గుభృ
ద్విభేదిపాలికేగి చెప్పె విప్పివిప్పి యంతయున్. 198

సీ. మసమసకలువాఱు మసలికన్నులు విచ్చి
నేలనేర్పరయంగ నిలువఁబడుచు
నూఁతకోల కెలంకులరయ ముందటనార్చి
కడకుఁ జంకులు ద్రోచి యడుగులిడుచు
బలుచప్పు డెద్దియే నలతియై యేతేరఁ
దన మంచి చెవియొగ్గి దవుల వినుచు
గద్గదస్వరము టిక్కుటెలుంగుతోగూడ
సెలఁగ హరిస్తుతుల్ చేసికొనుచు
వచ్చి ప్రాఙారుఁడొకఁ డిచ్చ పాణిసాచి
తడవి నీ వెవ్వరన్న నేత్రములు మాకు
మిగుల నొప్పవు రాజర్షి వగుట దోఁచెఁ
దపముబహువిఘ్న మీవెట్లు దాల్చితనిన 199

ఆ. దర్పణంబు లేక తనమోము గనరాదు
దాననైన వెన్ను గానరాదు
కన్నులొప్ప నెంత గననోఁపుఁ జెప్పడా
యెఱుక చూపకాంచు నెల్ల యవియు. 200

వ. అది యట్లుండె. 201

గీ. హస్తమస్తకసంయోగమాచరించి
తెన్ని విఘ్నంబులును నన్ను నేమిసేయు
నయ్య తరియింతునన నవ్వి యతనికతఁడు
గరుడవాహనుఁడై పొడకట్టిపోయె. 202

దోధకం. పోయినఁబోఁబోకపుణ్యముతో రా
బోయినవాడజపూజితరంగ
శ్రీయుతఁడే దయసేయు శుభాభి
ప్రాయమిదేయని పార్థివుఁడంతన్. 203

క. గనితలపోయుచు నెప్పటి
మనమునఁ దదపేక్షఁజేసి మనునందనుఁడున్
ఘననిష్ఠనుండె ముని చె
ప్పిన మనురాజంబు మది జపించు గడఁకన్. 204

వ. అనిన విని జనమేజయుండిట్లనియె. 205

క. అయ్యా పంతంబాడిన
యయ్యచ్చర యేమిచేసె నమరేశ్వరుఁడుం
గయ్యాలగడసు తుదినే
మయ్యెం జెపు మన్న నతని కతఁడిట్లనియెన్. 206

క. వంచినతల యెత్తుట మన
సించక కర్పూరతిలక యింటికిఁ బోయెన్
బంచశరవచనములఁ గలు
షించి సునాసీరుఁ డమ్మ సిమ్ముచు వచ్చెన్. 207

ఉ. వచ్చిన సర్వదేవగణవల్లభు నభ్రగజాధి రూఢుఁ ద
న్మెచ్చక యత్తపోవని సమీపగ కుండయినట్టివానిఁ గ
న్విచ్చి గురించి చూచె నల విష్ణుపరాయణుఁ డిష్టపూజ లే
నిచ్చెద నంచుఁ దాఁగులిశమెత్తి మహేంద్రుఁడు వైచె వైచినన్. 208

ఉ. అంచులు నూట నుగ్రనిబిడానలకీలలు గ్రక్కుకొంచు నే
తెంచు రయంబు చూచి పరతెమ్మిక నెన్నఁడు విష్ణుచక్రమా
యంచు నతండు భక్తివశుఁడై నగుచుండఁగఁ దత్క్షణంబ వే
యంచులకైదు వడ్డపడి యార్చి పవింబడఁగొట్టె గొట్టినన్. 209

క. సిగ్గుపడి నిడుద బుడిపులఁ
బొగ్గువలెంబడిన వజ్రముంగని సురరా
జగ్గణములతోఁ దన ధృతి
యుగ్గువడన్ వేఁ బితామహునికడకేఁగెన్. 210

చ. అఱిఁగి పయోరుహాసను పదాంబురుహంబుల వ్రాలి తత్తపో
గరిమము పేరు చెప్పి తనకగ్గిన కైదువుసూపి యద్దరా
వరుపయిఁ బోయి వజ్రమును వమ్మయి దీప్తిఁదొరంగె దేవ నీ
వరమునసేమెకాక యిఁక వచ్చు నె యీాది వెలుంగఁ జేయఁగన్. 211

క. అని మఱియు మఱియు నడుగగ
విని లోకపితామహుఁడు వెఱగంది మనం
బున భగవద్భాగవతుల
యనుపమశక్తులకు మ్రొక్కి యతనిం బలికెన్. 212

ఉ. అప్పటి వేఁడి నార్చినది యంతియె వైష్ణవసాధనంబు నీ
తప్పున దీనివేఁడి కది దప్పునె తప్పినఁ దప్పనిత్తునే
యిప్పటికంచుఁ దెల్పి తపమేమిటికోయని యోగదృష్టిఁ దా
నప్పుడు కాంచి రంగనిలయా! యిటువోయెద యంచు మూర్ఛిలెన్. 213

క. కప్పుడిగి వెలిగెఁ గులిశం
బప్పెనుదొర దీనివేఁడికది దప్పునె య
న్నప్పుడ యది యట్లుండెం
గుప్పతిలన్ మూర్ఛ కెట్లొకో యన నఱుఁడున్. 214

ఆ. ఒయ్యఁదెలిసి యొద్దనున్న యింద్రాదులుఁ
దానునపుడు రంగధామమున్న
తావు సేరఁబోవుటయుఁ గటాక్షించి శ్రీ
రంగశాయి యాదరమునఁ బలికె. 215

సీ. అనఘ నీకుఁ బ్రసన్నుఁడన చింతయేల యే
నాది సంకల్పించి నదియ వినుము
తొలుత నీచేనర్చితుఁడ నింక సాకేత
మునఁకేగి యిక్ష్వాకుముఖులచేత
యుగచతుష్టయనిరతోపాసితుఁడనౌదు
నటమీఁద సప్తమన్వంతరములు

కావేరినడుగడ్డఁ గాపురంబుండుదు
దివసాంతమున నిటఁ దిరిగివత్తు

ఆ. నీ విమానముననె యావిగ్రహముతోన
జోకపరతు రాకపోకలనిన
ధాత కదలె రంగధామంబు ఖగరాజు
నంసమెక్కిరాఁగ నంచనెక్కి. 216

చ. కమలజుఁ డిమ్మెయింగదలగా మఘవాదులు రా బురస్సర
త్తుములమరుచ్చమూముఖరదుందుభినాదము భూనభోంతరా
శముఁ జెలగింప నచ్చరల లాస్యముఁ జూచుచు రంగధామదై
వము బదరీవనంబునకు వచ్చె జగంబులకద్భుతంబుగన్. 217

వనమయూరం. అత్తరిని దివ్యమురజావళుల ధింధిం
ధిత్తిమికిఁ జిత్తములుదేల నల నృత్తా
యత్తమగు మెచ్చునకు నచ్చరలతోడన్
బొత్తుగలపెన్ నృపతపోవనమయూర్తుల్. 218

ఉ. ముచ్చటనంతసేపు తనమ్రోలికి నాఖగరాజునెక్కి యా
యచ్చరలాడఁగాఁగమలజాదులు గొల్వఁగ రంగధామమున్
వచ్చెన కా దలంచి మనునందనుఁ డప్పుడు కన్నువిచ్చి తా
నచ్చెరువొంది చూచి నిజమేయని తాండవమాడె వేడుకన్. 219

గీ. తాండవానంతరమున మార్తండపౌత్రుఁ
డూర్ధ్వబాహుఁడై హరిఁ జూచుచుండు చొప్పె.
పుటములెగయుచు నానందపుర షు మీఁది
నిలుకచూపఁగ నిలిచిన నెలవనంగ. 220

క. లోఁగూర్చి యతఁడు పిలిచిన
రాగలిగిగినసంతసంబు రంగేశ్వరుకుం
దాఁగోరినట్లు దైవము
రాగాంచిన సంతసంబు రాజుంగాంచెన్. 221

చ. నరగురుఁ జూచి యప్పుడు సునందుఁడనందగు ముఖ్యవాసుఁడొ
క్కరుఁడరుదెంచి నీకుఁ దన కల్గినదాపుర మీశ్వరుండు బా
హిరముగఁ జేసెఁజూడుమిది యిల్లది విగ్రహమేమి నిత్యకిం
కరులమనంగఁ దత్పురుషకారమునం దగఁజేరి సన్నిధిన్. 222

మధురగతి రగడ.

జయ జయ యీశ్వర సకలప్రేరక
భయహర చిద్రూపలతాకోరక
అనుకంపామణిహార మనోహర
యనుదివసపరమహంసమనోహర
దీన ప్రీణన దీక్షాధారక
నానాబ్రంహ్మాండ సముద్ధారక
దామోదర నీ తామరపొక్కిలి
యెల్లనలువలకు నిమ్మది మిక్కిలి
జగములకును నీచల్లని యడుగులు
బగలును రేయును బట్టిన గొడుగులు
శరణాగతరక్షక నీసన్నిధి
యిరవుకొనియెనే యీపంచాయుధి
పడగగొడుగుహరి పరపగుగంతులు
కడఁగి కనిరి యీగరుడానంతులు
సముఖంబిచ్చెనె జయవిజయస్థితి
సుముఖుండయ్యెనె సూత్రవతీపతి
నను మన్నించిరి నందసునందులు
చనవిచ్చిరి మాసనకసనందులు
ముదురఁ జదువులకు మొదలో యీయిలు
కుదురై తుదినీకోడలు రాజిలు
దేటపడియెనే దివి యిందొక యెడఁ
గోట బలిసెనే కుతలంబొకకడఁ
గొలిచి నిలచినవి కొండలబారులు

ఘళఘళరవముల గదలెడునేరులు
మాటల మఱిగిరి మనువులు వసువులు
దాటెనుడుగ్రహ తతి శశివసువులు
కబురువడసిరేకాదశరుద్రులు
తబసులు పన్నిద్దరు నిర్నిద్రులు
వేఱుపడరు తొలువేల్పులు వేల్పులు
దూఱిరి మధురగతుల జడదాల్పులు
గాఁచిరి దుర్గాగణపతులింబుల
జూచితినింద విశుద్ధజగంబుల
నీవే తానో నీశ్రీరంగము
సేవించెద జేజేజయరంగము. 223

గీ. అనుచు నగ్గించి మాటకు దనరనజ్ఞ
వలఁతియై కోర్కెలీనఁగ ఫలముదడయ
నలువలంకుల దండప్రమాణరచన
విలసిలఁ బ్రదక్షిణచతుష్క విధులు సలిపి 224

చ. మఱియు ననేకవందన సమర్పణమొప్ప ముకుంద యెద్దిరా
నుఱఁదనకొప్పమంచు సమయోచిత పూజలఁదేల్చి పిల్చి య
య్యుఱమరలేనిబంటు దలపారసి చిప్పన వచ్చి మౌళిపై
నెఱఁగిన రంగధామము వహించె శిరోమణివిభ్రమంబుగన్. 225

వ. అన విని జనమేజయుండవ్వలి కథాక్రమంబెట్టిదనిన. 226

ఆశ్వాసాంతపద్యములు

శా. అంభోరాశిగభీర భీరహిత బాహాధారధారాళవా
గ్గాంభీర్యప్రతిభాపితా మహామహాగంధాసుహృద్భూమిభృ
జ్జంభారాతి కృపాణపాణవరవస్వాహావధూనాథ సం
రంభభ్రామ్యదరాతిపట్టనవన వ్రాతాంతరోద్యద్యశా. 227

క. వారాశిముద్రితాఖిల
భూరాజ్యరమారమణ నభోమణి వంశాం
భోరాశి హిమానీకర
నారాయణచరణనలిన నమ్రనిటాలా. 228

స్రగ్విణి—విద్యుదుద్వేల్లదుద్వేక్షణానందనా
సద్వచస్సన్నుత స్వచ్ఛకీర్తిచ్ఛటా
హృద్వచఃకాయకర్మేందిరాప్తప్రియా
విద్విషద్వాహినీవింధ్యకుంభోద్భవా. 229

—* గద్య *—

ఇది...శ్రీమత్తిరుమల తొళప్పాచార్య చరణసరసీరుహ సేవాసమాలబ్ధ సామ్రాజ్యధౌరేయ నిజకావ్యాభరణాయమాన యెల్లభూపురందరవర నందన మట్లనంతభూపాల ప్రణీతంబైన కకుత్స్థవిజయం బను మహాప్రబంధమునం బ్రథమాశ్వాసము.



శ్రీ ర స్తు

# కకుత్స్థవిజయము

## ద్వితీయాశ్వాసము

క. శ్రీమద్దివంశరాజన
భోమణినిబిడౌజ యెల్లభూమిబిడౌజా
రామామదనా శత్రు
గ్రామాభీలా విభాళగండరబాలా. 1

వ. అవధరింపుము. మనునందనకథాసుధాధారాధౌతమానసామయి జయిం
డగు జనమేజయునకు శంపాయనుండగు వైశంపాయనుం డిట్లనియె
న త్తెరంగున. 2

క. పులుగు దొర నివ్వెరగుతోఁ
దలయూఁచఁగఁ గదలి దివ్యధామంబుఁ దలం
జులుకందాలిచి వినయాం
జలితో బ్రహ్మాదులకును జనవిభుఁడనియెన్. 3

ఉ. ఇంటికినిల్లుగట్టుకొని, యేలఁగవచ్చు మురారి వెంట నా
యింటికి వచ్చి పూజగొనియేగుట నన్నుఁగృతార్థుఁ జేతయో
గంటిరె యంచు సమ్మతిలఁగాఁ గొనియాడి పితామహుండు ము
క్కంటియు నింద్రుఁడున్ మొదలుగాగల యందరు రా ముదంబునన్ 4

శా. శ్రీమద్రంగవిమానమానిత శిరశ్శృంగారుఁడారాజయో
ధ్యా మార్గంబున వచ్చె దుందుభి మృదంగారావముంగాహళ
గ్రామారావము దిక్కుడుంగ జనితారావంబు సేవింప రం
డో ముందోడక వచ్చె రంగపతి యం, చుద్దండమై మ్రోగగన్. 5

వ. ఇత్తెఱంగునం జనుదేరఁ గుమారసామంతపురోహిత వరూధకరియోధ జవన తుఖార వీరభట పౌరనట విలాసినీ సమభియానంబు వివిధతూర్య ముఖరాయమాణంబయ్యె నయ్యెడ రంగేశ్వరుండు. 6

క. నరనాయకుఁ డరదముగాఁ
బురప్రవేశంబు నడపి భూరివిభూతిం
దిరువీథులు వేంచేసిన
పరమోత్సవమపుడు భువనపాలురఁదేల్చెన్. 7

వ. అనంతరంబున. 8

సీ. అహిరాజశయన చిత్తానుసారంబున
మనుతనూసంభవు మనవిఁమీద
నంభోరుహాసను నాజ్ఞావశంబున
బృందారక ప్రభుప్రేరణమున
సరయూసరిద్వరోత్తర తటాంతికమున
దమసామహానదీదక్షిణమున
బ్రహ్మర్షు లధివసింపఁగఁ గోరుకొనుచోట
వీఁటికోటకుఁగూతవేటుమేర

గీ. రత్నమయముగఁ బ్రాసాద రంగమంట
పోపమంటపప్రాకారగోపురాది
విభవములతో నయోధ్యకు నభిముఖముగ
విరివినగరు వినిర్మించె విశ్వకర్మ. 9

క. వేలుపు వజ్రఁగివెట్టిన
కీలునఁబలుకాటమాటక్రియ గనుపట్టుం
గాలోచితముగఁ దద్ది
వ్యాలయరత్నప్రతిమలకనురూపముగన్ 10

వ. మఱియు నయ్యమరశిల్పాచార్యుండు. 11

సీ. ఒకప్రదక్షిణవిధి నుపచారదీక్షిత
బ్రహ్మ సౌధంబులు ప్రస్తుతించి
యొక ప్రదక్షిణవిధి నుద్ఘోషితవ్యవధాన
విపణిహర్మ్యావళి విస్తరించి
యొకప్రదక్షిణవిధి నుభయనాట్యంబుల
మేళంబులకుఁ జంద్రశాలలునిచి
యొకప్రదక్షిణవిధి నుత్సవాగత లోక
పతులకుఁ బ్రాసాదవితతినిలపి

గీ. కీలుతెరలును గీలుగుజ్జాలు కీలు
నేనుగులుఁ గీలుటంచలు హేమరత్న
కీలితావయవములుగా గీలుగొలిపె
గీలుకీలునఁ జైతన్యలీలలెసఁగ. 12

వ. అనంతరంబు యంబుజాసనాది నానాదివిజ వరిష్ఠ వశిష్ఠప్రముఖ ముని
సమ్మతంబుగా మనుతనయుండు తద్దివ్యాగారంబునందు. 13

క. శుభతిధి శుభవారంబున
శుభయోగమునం బ్రశస్తశుభకరణమునన్
శుభతారన్ శుభహోరన్
శుభకరు శ్రీరంగవిభుని శుభమతి నిలిపెన్. 14

స్రగ్ధర—ఉంచె న్నానాచియోగార్హులు శుభనటనకళాయుక్తిమై గొల్చియుండన్
బంచెన్ లావణ్యధన్యప్రమదలఁ బ్రజలం బల్వురం గూర్చియుండన్
నించెం బ్రోల్గాఁగఁ దాదృగ్నిజపుర మొక మన్నినిపాలెంబు బోలం
బెంచెం దద్రంగధామప్రియవిభవములం బ్రీతులై వేల్పులెంచన్. 15

క. బలియఁగ మద్దెలతాళము
సెలగగ నావజము మెరయ సేవావేళం
గెలఁకుల బొమ్మల కొమ్మల
కొలకొలమను క్రందు గ్రిందు కోనెలయందున్. 16

గీ. ఇత్తెరంగున నమ్మానవేశ్వరుండు
దివ్యభోగాభివృద్ధి సంధిల్లఁజేయ
రంగమందిర ఫణిలోక రాజశాయి
యచటి నిత్యసుఖావాసమాదరించె. 17

క. హరిచేత ననుజ్ఞాతులు
హరినమ్మినబలముచేత నర్చితులునునై
పరమేష్ఠిప్రముఖజగ
త్పరిభృడులపుడరిగిరాత్మపట్టనములకున్. 18

చ. అరిగిన నన్యులైరనక నయ్యజశంకరు లష్టలోక పా
లురు మొదలైన వేలుపుల లోఁగిలిమేడలు దీవులేలునె
య్యురబసలెట్టులట్ల హరియూరఁ గుదుర్పడఁదత్తదీయులన్
నరపతి నిల్పె దండితిరునాళ్ళకు వారలువచ్చియుంటకున్. 19

చ. కలవు బిడారులందు నవఖండమహీశుల కంతరీపరా
జులకజముఖ్యదివ్యులకుఁ జుట్టలకాప్తుల కన్నియిండ్లనుం
గలకల నవ్వురా బదనికల్ గదరాయివి రత్నకుట్టిమ
స్థలముల నంటిపుట్టెనన సంతనగా నవరత్నజాతులన్. 20

వ. ఇవ్విధంబున మనునందనుండు వివిధసంపత్కళానిగళ నిబద్ధసకల జనహృదయసారంగంబగు శ్రీరంగంబున నుభయవిభూతిసుఖంబులను భవించి విరించిప్రముఖులు నంతరీపభూపాలురు నిజనివాసంబులకుం జనిన పిదపం బదపంకజవాస్తవ్యదివ్యమునిమనోభృంగతతియగు రంగపతికిం గైంకర్యపరుండునుం బరిపాలితరాజ్యభరుండునునై మంత్రిపురోహిత పుత్రమిత్రాదిసమేతంబుగా సాకేతంబున సుఖంబుండి. 21

మ. నవవర్షక్షితిపాలఫాలముల విన్యస్తమ్ములై యా కటా
క్షవిలోకంబుఁ గరాంజలుల్ దదయ నిక్ష్వాకుక్ష్మాభర్త వా
సవతేజంబు వెలుంగ నుజ్జ్వలసుధాసౌధంబునం జూట్కికి
ట్టవు నానెప్పటి కొల్వువేళ మణి పీఠాసీనుఁడై యుండఁగన్. 22

సీ. శిరసున నొకచాయ జిలుగు రుమాలులో
జీరణంబొకచెంపఁ జిక్కఁజెక్కి
చికిలి నిగ్గులు చిమ్మ చిన్నారి క్రొవ్వాఁడి
చేబాడిద భుజాగ్రసీమఁ జేర్చి
పసిడికట్టులఁ బొల్చు పవడంపుఁబిడితోడి
యులిదట్టిపొరవెంట మొలనమర్చి
పదనుదప్పక లోహపాషాణములబట్టు
చిత్రికపల్లు డాచేతఁ బూని

గీ. నిగనిగని కెంపుముక్కును నీలనయన
కాంతులును బచ్చరెక్కలకైపుగల్గు
కృతకకీరంబు వలకేల నతిశయిల్ల
వచ్చె వడ్రంగి యొకడు భూవరునికడకు. 23

మత్తకోకిల— వచ్చి యెమ్మెయిఁ గేలువంచిన వానిచేత విచిత్రపుం
బచ్చ విల్తుని తేజి భూపతిబాహుశాఖల వ్రాలివా
గ్రుచ్చి యంగదపద్మరాగముఁ గ్రోలఁబోయిన మేలు మే
లచ్చపల్కు ఫలభ్రమంబున నట్లకాయనిరెల్లరున్. 24

గీ ఆపుడు రాజుకటాక్షించి, యతనిఁబిలిచి
యెద్దినీరాక వాంఛితం బెట్టిదనిన
నిక్క వేలుపుఁగొండ యింకొక్కకాను
కీవు గైకోలు నాకునభీష్టమీఁగి. 25

వ. అనినోరనుడువఁదడవ. 26

క. మొఱుఁగులగుంపై యురుములఁ
జెరగాని మేఘునవుఁ బాసి చేరెనిచటికి
త్తఱినన హయఘోషలతో
ఘోఁయుచు నొకదివ్యరథము మేదిని వ్రాలెన్. 27

ఆ. వ్రాలి కొలువు మేడ మ్రోల శోభిల్లుచు
నరదమునికి సూచి యతనిఁ జూచి
దివ్యశిల్పియొకదే యితఁడని రాజు
సభయు సంశయించి సంభ్రమింప. 28

వ. అతండు నగుచు నట్ల యగుటం జేసి నిజాకారంబు దాల్చి తనకుం బుదమి
రేండుగావించు ప్రత్యుత్థానాదులు గైకొని యభ్యర్చితుండయ్యె నయ్యిరు
వురు నర్హాసనంబులనుండి యొండొరుల గుశలంబులడిగినంత నజ్జన
విభుండు వినయంబున నయ్యమరముఖ్యునకుం బ్రాంజలియై. 29

గీ. ఈవు నిలుచుండఁ గూర్చుండి యేను నిన్ను
నొక్క సామాన్యుఁగాఁ జూడనోడనైతి
ననఘ మాకెల్ల నిక్కవం బావహిల్లి
వైభవముఁ దాఁచి యీలీలవత్తురయ్య. 30

మ. అపర బ్రహ్మ నీవు నావుడు నృపాలా! దేవకార్యార్థినై
యిపుడే వచ్చినవాఁడ నొక్క వినయంబే పాటినేజేయ న
య్యుపదేశంబునఁ గానికూడ దదికాదా యట్టులేరాక నా
కుపచారంబొనరించెదే వినుమ దీయోద్దేశ్యముం జెప్పెదన్. 31

క. బలవంతులు దైతేయులుఁ
బలఘస్మరముఖులతోడ బద్ధద్వేషుల్
కలహములు కాకమానవు
కలవాడవు నీవు విబుధకార్యంబునకున్. 32

సీ. నేమివినిర్భిన్న నిమ్నోన్నతంబుగా
నవనిభాగమున బిట్టుఱుగఁ జాలు
చువ్వనెగసి విష్ణుపదాంతరమున రె
క్కలు వచ్చెనో యనఁగదలఁ జాలు
త్రోవ నిన్నడుగక దుర్వార గమనమై
దందశూకజగంబు దరియఁ జాలు

రవిరశ్మిరహితఘోరప్రదేశంబులు
వెలుగించుకొనిచొచ్చి వెడలఁజాలు

గీ. పెంచి యొకచోటననువైనచించఁజాలు
మించి యొకచోట విభువై చరించజాలు
దివ్య మీతేరు మీకు నతిప్రయత్న
మున నొనర్చితి గైకొమ్ము మనుజనాథ. 33

ఉ. నీవిదియెక్కి పద్మభవనిర్జరనాథులు చూడనెప్పుడుం
బోవుచు వచ్చుచుండి పనిబుట్టిన వేల్పులపాలఁ గల్గిచే
చేవ యొకింత చూపుమని చెప్పితిరో హితుఁడయ్యెనయ్యెడన్
దైవతలోకశిల్పి యరదంబటువెట్టి మహాద్భుతంబుగన్. 34

తరళ — మనుతనూభవుడుం బ్రమోదనిమగ్నమానసుఁడై నిజా
సనముఁడిగ్గి రథంబు చెంతకు సంభ్రమంబునవచ్చి య
ర్చనమొనర్చి ప్రదక్షిణాదులుసల్పి ఖడ్గగదాశరా
సనశరప్రముఖాఖిలాయుధజాలమేర్చి యమర్చినన్. 35

వ. తేరును వీరరసంబు దేరుచుం బోరుగోరుచుం గహకహాధ్వనుల గర్జిలు చుండెం దద్దివ్యరథమాహాత్మ్యంబు చూడందలంచి విభుండు సేవాసమాగతమూర్ధాభిషిక్తులను మంత్రిపురోహిత ప్రముఖనిజానురక్తులను నగరి వాకిట నిలువంబనిచి నిజప్రథమకుమారు సుకుమారు సారథ్యంబునకు నియోగించె. 36

క. అని పలికిన జనమేజయ
జనపాలకుఁ డాప్రతాపశాలికి నెంద
ర్తనయులొకో యని యడిగిన
విని వైశంపాయనుండు వినుమనిపలికెన్. 37

క నూర్వురు కుమారులతనికి
నిర్విఘ్నకృతప్రతాప నిర్వైరిదిగం

తోర్వీదుర్విషహాధురా
నిర్వోఢలు గలరఖర్వనిర్వేలయశుల్. 38

క. సకల జ్యేష్ఠుండందును
వికుక్షి యిక్ష్వాకుఁగొలువ వెసఁదమ్ములతో
నొకనాఁడు వాఁడు రాఁగా
సుకుమారుండనిరి దేరి చూచి మహర్షుల్. 39

క. ఆఋషి వచనములతనికిఁ
బేరయ్యెన్ నాఁటఁగోలెఁ బ్రియసుతునతనిన్
సారథిగాఁగొని విభుఁడా
తేరెక్కి కదల్పఁ బనిచెఁదిన్నఁగ మింటన్. 40

ఆ. అవనినుండి మింటి కరదంబు రాఁగాంచి
నింగిఁదిరుగుప్రొద్దు నేలకేల
పోయిరాఁగ గడగెనో యని పైసూచి
కాదిదేమియంద్రు ఖచరసతులు. 41

వ. ఇత్తెరంగున గగనంబునం బోవు సమయంబున. 42

సీ. ఒకవేల్పుతో మాటలకు నిల్పవలసినఁ
బగ్గముల్ గదియంగఁ బట్టుకున్నఁ
గెలని వింతలు చూడఁ దలఁపు గల్గినచోట
నెప్పుడప్పటి వాఁగె త్రిప్పుకున్న
ముంచిపోవు విమానములు కూడఁగోరినఁ
గేలెత్తి ధే యని తోలకున్న
జగదంతరప్రజాసమ్మర్ద పథముల
హాధిరా యని వేగమాగకున్న

గీ. మసలుఁ గేడించుఁ దిరుగు సమ్మతిగ నరుగు
రథికహృదయం బెఱింగి యౌరాగుఱ్ఱాలు

నాగల కొక్కండలంకార మగుటకాక
యేను సొరదినని వాని బూననేల. 43

క. అని సుకుమారుఁడు నెమ్మన
మున రథరథ్యముల మెచ్చి బొగడుచు నిచ్చం
జననిచ్చె నడుమ నారద
ముని వచ్చెఁగ్రొత్తయెలమి మోమున మొలవన్. 44

క. అతనికి జనవిభుఁడు యథో
చితసంభావనలొనర్చి చేతివిపంచీ
లత యందికొని శతాంగ
స్థితునింగావించి పలికెఁ జిత్తంబలరన్ 45

ఆ. తివిచి చూడలేదె గవిశన యెన్నండు
నొళవుదుమ్ముగప్పి యొప్పఁడాఁగి
తంత్రులూడి విన్నఁదనమొందె నిదియేమి
మహతి యున్నయునికి మౌనిచంద్ర! 46

క. ననుఁగరుణాలోకనమునఁ
గనుఁగొనఁగాఁగలిగెనొకొ వికాసము నెమ్మో
మునకుం గానీదేవర
కనుఁగవబడలికలుగన్న కైవడి తోచెన్. 47

వ. అనినవిని మునివరుఁడు. 48

చ. పుడమికి నీవు రాజవయి పుట్టితి వెన్నఁడు నాటనుండియుం
గొడవలు గట్టిపెట్టి నినుఁగొల్చిరి రాజులు కన్నుఁ దోయియున్
బడలకమించి యేకలహపారణకున్ వికసించుఁ దద్వ్యథన్
దడవులఁ బట్టి చూడనికతంబున మాసె జుమయ్య వీణయున్. 49

శా. పాతాళంబున లేరె వీరులచటంబాటిల్లవే కయ్యముల్
చూతుంగాకని పోవ దానును సమిచ్ఛాన్యంబుగాఁ గానిసీ
నీతోనేమి యటంచు వేర్పడితి నున్నిద్రాళు లోకంబు మ
చ్చేతః క్లేశము వాయఁబోయెదను రాజీవాసనుంగొల్వఁగన్. 50

క. అని వచ్చుచుంటి నిన్నుం
గనుఁగొంటిం బందువయ్యెఁ గన్నులకును నా
మనమిపుడు నిండుకొనియెం
జనవర యొక మేలు దారసంబగు ననినన్. 51

వ నగుచు నజ్జగతీవిభుండు 52

క. నాకంబెట నలినాసన
లోకంబెట నిఖిలమౌనిలోకేశ్వర యీ
లోకములలోన భవదవ
లోకమునకు వేఱువడిన లోకము గలదే. 53

ఉ. నావుడు నారదుండు నరనాథ భువర్భువనంబు మీదెఱం
గీవలనెల్ల దీనికడయెల్ల దివాకరమండలంబు సు
మ్మావలనాకమాపయి మహర్జగ మావల కెక్కి వెండియుం
బోవఁగ సత్యలోకమెట పోవలతేనియుఁ ద్రోవపెట్టెదన్. 54

క. మీతాత లోకలోచనుఁ
డాతండ వచ్చె వచ్చి యరదము నిలిపెన్
నీ తేరి కద్దతెరువున
నీతో మాటాడఁ జూడ నెమ్మది తివులున్. 55

క. అని వైరించిని పలుకఁగ
దనరథమినరథము సేరఁ దరమి నృపాలుం
డినుమారు ప్రదక్షిణముగఁ
జననిచ్చె బురఃపురోనిషణ్ణాంజలియై. 56

గీ. ఇత్తెఱంగున వలఁగొని యెదురనతని
మండలాభ్యంతరముఁ గాంచి మఱియుఁ జేసె
నాలుగుప్రదక్షిణంబులీలీల దోఁగ
దోఁచెనో చక్రియని నారదుఁడు నటింప. 57

ఆ. అవనిలోకనాథుఁ డరదంబుతోనిట్లు
తపనదైవతప్రదక్షిణములు
రెండు మండలస్థపుండరీకాక్ష ప్ర
దక్షిణములు నాల్గు దగనొనర్చి. 58

చ. ఎదురు రథంబుదక్కి నుదురెక్కిన యంజలితోడ నిందిరా
సదన సదాహితాభ్యుదయ సర్వసకాశనిజప్రకాశ మ్రొ
క్కెద నిగమాంతవేద్య రథకృత్య సమర్థిత వైనతేయ నీ
పదములు జూడఁ గంటినని పజ్జఁబొనర్చె యథాక్రమానతుల్. 59

ఉ. అమ్మెయిఁ బ్రస్తుతించి నతుఁడై యతడుయ్యెడఁ జూడజూడ బిం
బమ్మున నున్న మాధవుఁడు పార్థివు కంటఁబడం గరంబు చో
ద్యమ్మయి ద్రోచె నారద మహాముని పేర్కొని రాజరాజ నీ
యుమ్మడి కీర్తనం బిరువు రొక్కఁడుగానొనరించె గంటివే. 60

వ. ఈ యంశుమాలి సాక్షాద్వనమాలియగుట ప్రకటంబయ్యెనని నుతించు సమయంబున. 61

ఉ. రార కుమార యంచు దినరాజు కవుంగిలి సాచి పిల్వఁగా
దేరికిఁ దేరు దారసిలఁ దెచ్చి కుమారుఁడు దాను వచ్చి య
ప్పౌరుషధన్యుఁ డంబురుహ పాలనపుణ్యఫలంబ యీదృశా
కారయుగంబు దాల్చెననఁ గాఁదగునంఘ్రులమీఁద వ్రాలినన్. 62

క. కరుణాకరశీతలుడై
యిరువురనిరుగేలగ్రుచ్చి యెత్తి యొనర్చెం
బరిరంభణ మంభోరుహ
పరమాప్తుఁడు వారి హృదయపద్మములలరన్. 63

వ. ఇత్తెరంగున నాలింగనం బొనర్చి దినమణి సుకుమారుంజూచి మఱియుఁ
గలరు గాక మఱేమి యిట్టి భాగవతముద్రానిర్ణిద్రులు గలరేయని
వెండియు. 64

చ. ఇతఁడొకకాయ గాఁచి సుతునిల్లనిపించె మునీంద్ర వీని సం
తతికభివర్ధనం బరయఁ దావకధన్యకటాక్షపాతమే
వ్రతమని పల్కఁగా ఘనత వర్ధిల వైష్ణవతేజమేఁగి భా
రతసుకుమారగర్భముఁ జొరంబడినం బ్రమదప్రసన్నుఁడై. 65

క. ఇనుఁడయ్యిందరికంబెను
మునుమున్న మహాద్భుతంబు మున్నిటితెరన్
మునిఁగిన మునిఁగని కంటే
వనమాలి కృపావిశేషవైభవమిచటన్. 66

క. వంశపతియై జగత్పతి
యంశంబున వీనికొకరుఁడావిర్భవిలున్
సంశయమేమిటికిఁ ద్రయ
త్రింశత్కోట్యమరభరధురీణతఁ బెరుగున్. 67

కవిరాజవిరాజితము.

అని చతురాననసూనునకున్ వినయప్రతిపాద్యబహూక్తులున్
మనుమలకుందగు మన్ననలుం దిననాథుఁడొనర్చి జయించి విరిం
చన భజనంబుగ సాఁగిచనుండని సారథివైప ధరంబొప్పయం
గనుఁగొనఁ బశ్చిమఖంబునపై యెకకంటి రథంబు వెసంబఱచెన్. 68

ఇత్తెఱంగునఁ జంగున నినుని తేరు
పడమటికిఁ దాటఁగాంచి యీ యెడయొకింత
నిలచి తడసిన వెనువెంట నిబ్బరముగ
వచ్చెఁబొమ్మని నారదుండిచ్చమెచ్చి. 69

క. కమలభవభువనయాత్రకుఁ
దమయరదముఁ బఱపఁ బనిచి తండ్రికొడుకులన్
ప్రమద వికచాంతరంగుల
సమయోచిత వల్లకీరసంబునఁ దనుపన్. 70

వ. తలంచి. 71

ఉత్సాహ— లోకబంధుసత్కృపావలోక కల్పవల్లికల్
నీకు నీకుమారునకు ఫలించె దోడుతోడ నిం
కే కొలంది శోభనంబు కుదురుకొనునె యంచు ని
క్ష్వాకు నృపతికిం బ్రసంగవశవచఃప్రపత్తులన్. 72

క. మనమలరించుచు నెమ్మెయిఁ
జనువాడావలనుసూపె జనవరనాకం
బునకిది సౌరదల యేజగ
మున వాడును మొగముఁ బ్రాల్చుఁ బోయిందుండన్. 73

సీ. ఊర్వశి రంభ తిలోత్తమ శశిరేఖ
హరిణి చంద్రకళ యనంగలతిక
మదనమోహిని వపుష్మతి కాంతిమతి శుభా
ననకళానిధి వరూధిని ఘృతాచి
మేనక పంచాశ్వమేధిని రాజసూ
యార్థిని క్రతుశుల్క తీర్థశుల్క
జలపద కర్పూరతిలక లీలావతి
దారుసంజీవని దానశుల్క

గీ. మునిమనోహర ధాన్యమాలిని సమీచి
ఖంజికస్థల ప్రమ్లోచ మంజుఘోష
చారునామచకోరాక్షి సౌరభేయి
హేమ మొదలైన యచ్చరలేమలధిప. 74

గీ. వీరె ఖచరాదిధైర్యముల్ వీటిఁబోవ
జనుచునున్నారు నముచిసూదనునిసభకు
నిపుడు నీ పాలికందఱు నేఁగుదేరఁ
బోడఁగనఁగరాక నిలచెఁ గర్వూరతిలక. 75

శా. కంటే నాడు భవత్తపశ్చరణ దీక్షాపాటవం బొక్క పూ
వింటంబోదని తానువచ్చి దగభ్రూవిక్షేపముల్ సూపినన్
గెంటింపంగ వసంబుగాక కడకుంగేడించెనో లేదొ క్రీ
గంటం దూరుచుఁ దానసిగ్గు గదిరెం గాబోలు నచ్చెల్వకున్. 76

క. అని పూర్వకథాక్రమమున
ముని దనమనమునకు వెఱఁగు మొలపింపఁగ మ
న్ననసేసి యధిపుడచ్చర
ననిచెం బరమేష్ఠిలోకయాత్రావాంఛన్. 77

క. ఆ త్తెఱఁగున నయ్యచ్చర
మొత్తము పొడగాంచిపోవ మునితో రాజున్
దత్తనయుఁడు దివ్యరథో
దాత్తగతుల్ వొగడికొనుచుఁ దగుగతిఁజనఁగన్. 78

సీ. లేమల నడుపులా ! యామందయానంబు
లటఁజేరిగాకని హంసపిండు
కొమ్మల గుబ్బలా ! కొలమునసాములు వీడు
కొనిరంటగాక నికోకకులము
చెలువల చూపులా ! కలిగినమీలెల్ల
బయలెక్కెఁగాకని బకకులంబు
మగువల మొగములా ! గగనారవిందంబు
లొదవెఁగాకని తేఁటి కొదమసంతు

గీ. వచ్చెనో యిప్పుడచ్చరల్ వచ్చిపోవ
ననఁగ మానసముననుండి హంసినుండి

సామిదొననుండి చంద్రపుష్కరిణినుండి
వింటఁబడి వచ్చెఁగాసారవిహగతతులు. 79

మత్తకోకిల—— వచ్చినంగని మానసాదినివాస వాసనవాసెనా
విచ్చిరాఁ బనియేమి యేమని విన్నవోక మలాకరం
బిచ్చె మానిసిమాటనేరుపు లింక వీనికభీష్టమిం
కెచ్చటోయని వారలారయ నిచ్చగింపఁగనచ్చటన్. 80

సీ. మొకరిదేఁటులు తీరవికచకేసరములు
చేముంచియక్కులఁ జేర్చికొనఁగ
రవరకొక్కెరలు బేడసమీఁలదరఁగలు
తెగఁదాటి నడిమికిఁ దెచ్చుకొనఁగ
కవజక్కవలు దళత్క్రమల కోమలదళా
వళులు బంతులుసాగ బిలచికొనఁగ
రాఁగరాయంచలు నూఁగారబెళిఁగిన
బిసములు దమపాలఁ బెట్టికొనఁగ

గీ. పరపుశతయోజనంబుల పాటిసూప
బొడవు మఱినూరుయోజనంబులు పొసంగ
గగనమిరవైన నిడుసాగగడ్డతోడ
గట్టెదుటఁదోచె నపుడొక్కకమ్మకొలను. 81

వ. అయ్యవసరంబున నమ్మగురుందమలోన. 82

చ. వికచసరోవరంబు పసివేరునలంగకయుండె గెడ్డతోఁ
బెకలిచి తెచ్చి మింట మొలపించినవారిపు డెవ్వరో వివా
దకథకుఁచోటుసూపని పితామహసర్గ నిసర్గవైభవం
బొకయిదె మేలు రథ్యములకూరటగాఁ బదఁమూదఁ గల్గెఁగా. 83

క. ఈవేళ కిచటకొకకొల
నావిర్భావంబునందు నదికాకున్నె
5)

తావిన్నవినికి యవ్విహ
గావళి కాదనినవచ్చు నాముచ్చటతోన్. 84

వ. అని తలపోతలకుంజొచ్చిరందు మనునందనుండు వెండియు. 85

సీ. తివుట పుట్టింపవే పవనపాకంబులీ
పొలపంబు దవ్వులపొలముగాక
కలుగదే కమలసౌగంధికాదికములీ
వలపనాఘ్రాతపూర్వంబుగాక
యొప్పనుప్పొంగవే యూర్మిశీకరములీ
చలువ వేఱొక వింతకొలముగాక
పొసగవే క్రౌంచసారస మిథునంబులీ
సంసారమన్యాదృశంబు గాక

గీ. ఇట్టి కొలనెట్టుసేసె లోకేశుఁడనఁగ
నందు గంధర్వవిద్యాధరాదులపుడు
వల్లభులుదారు జలకేళి వలలఁబడిరి
సమధికవిమానములనుండి దుమికిదుమికి. 86

క. మగపిండు మగువపిండుం
దెగలేర్పడి చల్లులాడ దివికుప్పరముల్
నెగసిపడు వారిధారల
నగుదెంచె నమేఘవృష్టి యంచలు సెదరన్. 87

వ. అంత. 88

సీ. ఒకరథాంగంబు కొంచకచంచుపుటి నొక్క
పూబోఁడి వలిగుబ్బవాడిచిపోయె
నొకబేదస వికస్వరోల్లాసగతి నొక్క
కలికి కన్నులవెంట బెళకుమనియె
నొకకచ్ఛప కిశోరమొరసి చెక్కులనొక్క
తొయ్యలి మీఁగాలు ద్రొక్కిపోయె
నొకమిండతుమ్మెద యురికి యుక్కున నొక్క
తరుణిధమ్మిల్లంబుతన్నిపోయె

గీ. పోవుగాకేమి యీసులపొంతఁబోక
యెఱలయేమేమిపుట్టునో మఱియుననక
విభులఁబురికొల్పుదుర కానివెడలరైరి
మెలతరారార జలకేళిమీఁదిబాళి. 89

క. ఈకరణి జలక్రీడలు
మేకొనియెడువారుఁ దటనమేరుచ్ఛాయల్
గైకొనియెడువారునునై
యాకాశచరుల్సెలంగ నక్కొలనమరెన్. 90

ఉ. నారదుఁడప్పుడోనృపతి నల్వొమొగంబునదీని కారణం
బారసి విందుమన్న నతఁడౌననఁదేరటువాయఁదీరమున్
నీరముఁజేరియున్న మహనీయులమ్రింగి సరస్సుదానవా
కారముఁదాల్చె వృక్షవిహగంబులు రక్కసులై భజింపఁగన్ 91

ఉ. క్రొవ్వున నార్చి శంఖనఖ కూర్మశిరః పృథురోమ దర్దుర
గ్రీవ శ్రవస్సహస్ర తిమికీకస రోహితమీనపుచ్ఛరా
జీవ భుజాది రాక్షసుఁ జేపదలెన్ జలజంతుభూమికల్
భూవర భూపరుంతు మునిపుంగవుమోమును విల్లుఁజూడగన్. 92

ఉ. అప్పుడు నారదుండు మనుజాధిప యీజగదద్భుతక్రమం
బిప్పుడు గానవచ్చె నిది యేర్పడనంతయు నేఁగ్రమంబునం
జెప్పెదఁగాని తేరువిలుసిద్ధము జోడుసిడంబు వీరికిన్
జొప్పడిరాకమున్న తెగజూడుము కొందఱనంచుఁబల్కఁగన్ 93

సీ. అజగవాదులకును బ్రజలైన ధనువులు
బౌదినాలుకలుగోయు ప్రదరములును
ఒరలువెల్వడి మంటలుమియు ఖడ్గంబులుఁ
గాలదండఖ్యాతిగనినగదలు
దివ్యాస్త్రహతుల భేదిలనిడామరములు
జముఁడు మూర్ఛిల మ్రోగు శంఖములును

నక్షత్రమ్ముకంటె నెత్తగునట్టి పడగలు
  రవిరథ్యములఁ దట్టఁ దివురుహరులు

గీ. గలుగ వరలబ్ధరథములాకస్మికముగ
నొదవ దనుజులు రథికులై రొక్కలక్ష
దానవేతరరహితంబు లౌనుగాక
గగనకాసారదైత్యుచే జగములనగ 94

క. ఆవేళ దివిజకానన
దావాగ్ని నభస్సరోభిధానుఁడు రక్షో
దేవుఁడొకమహారథమున
వేవెలుఁగుల వేల్పుకంటె వెలుగుచునుండెన్. 95

చ. మనుజవిభుండు పద్మజకుమారుఁగనుంగొని నోరిమాట నో
రన వసియింప.వచ్చె రథరాజసమాజము వచ్చుఁగాక మీ
రనుట నిజంబు యయ్యసుర యక్కజుఁడభ్రసరస్సమాహ్వయుం
డని యగుఁగాక యంచుఁ ధనువందినఁజూచి యనెన్ మునీంద్రుఁడున్.96

క. తడయకుము నీభుజాబల
మడరింపుము నేను నోపినంత సహాయం
పడుదునని హెచ్చరిక చేఁ
యుఁడుగడఁగెన్ బార్థివుండు యుద్ధంబునకున్. 97

వ. అనినవిని యవ్వలివృత్తాంతంబు సవిస్తరముగాఁ జెప్పుమని యడిగిన
యాత్రేయకుమారుంజూచి వైశంపాయనుండు. 98

ఉ. వాసవవిద్విషన్మదనివర్తన నర్తనలీల లెమ్మెయిన్
వాసరరాజపౌత్రుఁడును వారిరుహాసనపుత్రుఁడున్ సము
ల్లాసి సమీక కౌశలములం బచరింప నుపక్రమించి ర
య్యాసురసేనతోడ నవియన్నియుఁ జెప్పెదనీకు నేర్పడన్. 99

మ. హయరాడ్వారణ ఘోషరోష హసనా హంకారహుంకారముల్
వియదంతఃపుటపాటనంబు సలుపన్ విక్రాంతరక్షస్సము
చ్చయ ముచ్చైస్సమ్రయభీమమై పయికొనంజండాంశు పౌత్రుండు ద
ద్భయదాకారులఁ జెండెఁగుండలితకోదండప్రయుక్తాస్త్రిదై. 100

చ. జనపతివేఁడితూఁపుల భుజంబులువ్రచ్చి యురంబులుచ్చియా
ననములు వాఁడి చాపములు నాఁడిశతాంగములాఁడి యుగ్రకే
తనములు నూడినం జురుకుపుట్టినవారలు రేఁగిమూఁగి ర
ద్దనుజపతుల్ మహారథు లుదగ్రశిలీముఖవృష్టిముంచుచున్. 101

చ. పసిడి మెఱుంగువెట్టు పుటపాకవిశేషములోలె విద్విష
ద్విసరశరారనోచ్చలిత విశ్వభయంకర రేఖ
... ... రథరాజము తేజము సానబట్టి పెం
పొసగెనకాని చొచ్చియను నుచ్చముసేయఁగజాలదేమియున్. 102

క. అంతటఁ బోవక దానవ
సంతానము వివిధవిశిఖజజ్వాలసము
ద్భ్రాంత జగదంతరంబుగ
సంతమసారిజకుమారు సరికింబెనఁగన్. 103

చ. మిడుగుఱు మిన్నులై మెరయుమేరువులై పొదకట్టు చుక్కలై
పొడవునఁ బొల్పుదంతులయి పోయివడింబరతెంచు మబ్బులై
పిడుగులురాల్చు గాడ్పులయి బిస్సునలేచు ప్రవాహపఙ్క్తులై
కదలులముంచునట్లు వరగర్వము సూపఁగ దద్రథావళుల్. 104

కం. ఒకయేటొక పోటొక
వెటొక యాటొక ముట్టి పాలు నొందకతంత
క్కటపుటలు మాన్పె నొక్కం
ఢకలుషదివ్యాస్త్రతతులనది యిట్లుండెన్. 105

ఉ. ఏమనవచ్చునయ్య ముగురెక్కిన యవ్విభు తేరఁ దద్రథ
స్తోమము సించియాటలకుఁ జొచ్చినచందము మందలీలమై
లోమెరపున్ వెలిన్వెలుఁగులోకము పిక్కటిలంగ వైభవ
స్థేమముసూఁపుడాఁగు వెదకించుకొనుంబరతత్వమోయనన్. 106

ఉ. డాఁగని దీప్తితో మెకరుఁ డాగిన డాఁగగ నీఁక నెత్తుటం
దోఁగక తోచుచుంబగరఁద్రుంపఁగఁజొచ్చె నృపాలుబాణముల్
మూఁగినమూకలుఁబయల మూకలరోయఁగ బిట్టునేలకున్
వ్రేఁగుగ రాలఁ దద్వివిధ విస్ఫుట ఘోరశరీరఖండముల్. 107

వ. అప్పుడు 108

సీ. కరికరస్థూల రక్తనవాంబుధారలు
బలసి జోరున జడివట్టిగురియ
తరుణమేదఃఖండకరకానికాయముల్
భేతాళ భక్ష్యంబులై తొరంగ
ముఖహుంకరణ శేషముఖరమస్తకములు
బిడుగులై పలుగొండ లదరఁబడఁగ
సలఘుబాహూరు జంఘలువెల్లి పాముల
బలగమై బెలుచఁగప్పలుగరాల

గీ. అద్భుతావహమైన వర్షాగమంబు
భూభువన మెల్ల నెఱుగంగ బుట్టెనయ్యొ
సరసురోగహితముగా ధరణివిభుఁడు
గగనమునఁజూపు సంగ్రామకౌశలమున. 109

ఉత్సాహ— అట్టివేళ విశ్వకర్మ యరుగుదెంచి దీనికిన్
జట్టి పుట్టదంచుఁ బాంచజన్యశంఖమున్
బట్టిగాగ నిచ్చియల నభస్సరత్సురద్విషన్
జుట్టి వ్రేల భూవరునకుఁ జూపి యేకతంబుగాన్. 110

క. జలజహిత వంశవర నీ
బలుతూపుల వీఁడు రథము పై నొరగ వెసం
దల ద్రుంచి యుదరదళనము
సలుపుట గర్జమని తెలిపి చనుచున్నంతన్. 111

వ. మధుప్రముఖ బలవదసుర సమరపరంపరా పరిచిత పరమపురుషాధర స్పందంబైన చిందంబు జనకకందంబుగాఁ బుట్టిన గెలుపుముట్టిసేకురిన యుత్సాహంబు దేహంబుపొంగ నుత్తంగనిజరథాధ్యక్షంబుదుర్నిరీక్షంబును హృదయానుసారి సర్వపథీన ప్రచారదక్షంబును సారథినిరపేక్షంబు నై యుక్కుమీర నోరకుండ నాలయని ప్రచండ కోదండ ధరుండై సుకుమారుండుకుమారుడునం బోలె విక్రమంబునకుపక్రమింపనఖండ తాండవ పాండిత్యంబు కృత్యంబుగాఁ గమలభవాపత్యంబత్యంత నయన మధుర సంగరరసానుభవ ప్రభవంబైన యానందవిభవంబు ప్రకటింప వికటపుట పతాకుల కెడగలుగందొలంగి నింగినాంగిరసపురోగములై గములగుచు గీర్వాణులు చలాచలపాణు లగుచు నిగూఢవచనంబులఁ దనకు మంగళాశాసనంబులు సేయ నాఁటుత భుజావిజృంభమాణ బాణాసనంబుతోఁ బినాకిపాణియుఁ బోలెనాభీలశరజాలజ్వాలలం ప్రేలిచి యాడుచుంతం గలగుండువడి విడివిడిగాఁ బలలభుగ్బలంబు ప్రాచి కవాచికిం బతీచి కుదీచికిం బరవఁ బఱవసంబు గల మగలుకొందఱందఱిం బేరు పేరంజీరి. 112

ఆ. పాఱు డొక్కఁడొకఁడుపడుచువాఁడిటవచ్చి
పోయియొకఁడ చిక్కెపోటుబంటు
కలను వాడువ నుప్పుఁ గలువోలె నిక్కచ్చి
తేరువానికోడువారె మీరు. 113

చ. అని వారింబురికొల్పఁ గోత్తలకుఁ జేయం గల్గువా రగ్నిలో
చన పాతాళవిభేది మర్త్యమథన స్వర్గాంతకాదుల్ శరా
సనముల్ నింగికి వ్రేసి పట్టుచు భుజాసంరంభ మేపార శం
ఖనినాదక్షుభిత త్రిలోకముఁగ ఫీకన్ ధాకి రొక్కుమ్మడిన్. 114

గీ. వారివెనువెంట శౌర్యదుర్వారుఁడగుచు
నపుడునృపబాణవితతిఁ బ్రత్యస్త్రహతుల
గూల్చిమాడ్చుచు వచ్చెఁ బోఁగూర్మశిరుఁడు
వెలికి లోనికి వెదఁబాకుతలయుఁదాను. 115

చ. మనుజవరుండు కూర్మశిరు మస్తము వెల్వడువేళ వేఁచి తో
డనఁ బలు తూపుఁ జీలలు మెడం బిగియించి భవన్ముఖంబు నీ
యనుఁగులు వింతవింతపడి యందరుఁ జూతురు గాక లోనికిం
జొనుపకు మన్న నీవు నిఁకఁ జూతువుగా యని యల్గి యాతఁడున్ 116

క. ఒకశూల మెత్తివైచిస
సుకుమారుఁడు నడుమ నఱుక ఁజూచి విభుండ
వ్వికటశిరుశిరము దనుజులు
తుకతుక నుడుకంగ వాఁడి తూఁపునఁగూల్చెన్. 117

ఆ. సూడువట్టి పెనగుచో మీనపుచ్ఛుని
తోఁకఁదునుము కొడుకుదుండగమున
కధిపుడల్ల నవ్వియద్దాయ రక్కసి
బ్రతుకుమాన్పె దివ్యబాణమేసి 118

సీ. జనకుండు దుమికి కచునిఁ గీటడంచినఁ
దనయుండు పృథురోముఁ దల యదల్చె
గురుఁడు భేకగ్రీవు కుత్తుకదునిమిన
సుతుఁడు రోహితుని జీవితముఁ గొనియెఁ
దండ్రియధ్వరవిఘాతకు బాఱిసమరినఁ
గొడుకు శంఖనఖాఖ్యుఁగోలుమసఁగె
నయ్య రాజీవబాహాసురుఁ బొలిఁగొన్న
బిడ్డండు కునఖునిఁ బిలుకుమార్చె

గీ. దివిజరాజాదిదిక్పాలదేవతాక
విశిఖముల నిట్లు దైతేయ విశసనంబు

సళిపి రిక్ష్వాకు సుకుమారు లలయ కెలిమిఁ
గొంతవడి వంతువడి మరుతోఁ్కటి వొగడ. 119

భుజంగప్రయాతము.

గిరిస్కంధుఁడుగ్రాజికేళీధురీణ
త్వరం బార్వతంబైనవాలంబువింటన్
గరంబల్లి సంధింపఁగా దాని వానిం
ధరాభృద్ధనుర్ముక్త దంభోళి తీర్చెన్. 120

ఉ. అంతటఁగేలుమోడ్చి కొడుకయ్యకుఁ గయ్యము సేయవచ్చునా
కాంతక మర్త్యభేది పలలాశులఁబేర్కొని చూపి వీరునా
వంతని కొన్న నియ్యకొని వానికి వారికిఁ బోరువెట్టి వృ
త్తాంతవిశేషమింకఁ గలదాయని రాజు మునీంద్రుఁ జూచినన్. 121

క. తలయూచి యతఁడు భళిభళి
కొలువోయిది రణము యిష్టగోష్ఠికథకుం
దలసూపె నిట్టితేజము
కలుగున కద యింతకొడుకుఁ గాంచిననీకున్. 122

సీ అనిపల్కి చెప్పెద వినుము వేఱొకఁడేల
జననాథ గగనకాసారకథయ
యప్పేరువానికి నన్వర్థమని సర
స్వతి పల్కె వినువీథి జననవేళ
వాడుగ్రతపమును వాతాతపాదులు
గ్రోలి పుట్టిననాటఁ గోలెఁ జేసె
దాన లోకములు కొందలమందఁగా నజుం
డడిగిన వరమెల్ల నతనికిచ్చె

గీ. నవని యవనిగ నాకసంబాకసముగ
జలము జలముగ గాడ్పు గాడ్పుగను బాంచ

గీ. వారివెనువెంట శౌర్యదుర్వారుఁడగుచు
నపుడునృపబాణవితతిఁ బ్రత్యస్త్రహతుల
గూల్చిమాడ్చుచు వచ్చెఁ బోఁగూర్మశిరుఁడు
వెలికి లోనికి వెడఁబాకుతలయుఁదాను. 115

చ. మనుజవరుండు కూర్మశిరు మస్త్రము వెల్వడువేళ వేఁచి తో
డనఁ బలు తూపుఁ జీలలు మెడం బిగియించి భవన్ముఖంబు నీ
యనుఁగులు వింతవింతపడి యందరుఁ జూతురు గాక లోనికిం
జొనుపకు మన్న నీవు నిఁకఁ జూతువుగా యని యల్గి యాతఁడున్ 116

క. ఒకశూల మెత్తివైచిస
సుకుమారుఁడు నడుమ నఱుకఁ జూచి విభుండ
వ్వికటశిరుశిరము దనుజులు
తుకతుక నుడుకంగ వాఁడి తూఁపునఁగూల్చెన్. 117

ఆ. నూడువట్టి పెనగుచో మీనపుచ్ఛుని
తోఁకఁదునుము కొడుకుదుండగమున
కధిపుడల్ల నవ్వియద్దాయ రక్కసి
బ్రతుకుమాన్పె దివ్యబాణమేసి 118

సీ. జనకుండు దుమికి కచునిఁ గీటడంచినఁ
దనయుండు పృథురోము తల యదల్చె
గురుఁడు భేకగ్రీవు కుత్తుకదునిమిన
సుతుఁడు రోహితుని జీవితముఁ గొనియెఁ
దండ్రియధ్వరవిఘాతకు బాకిసమరినఁ
గొడుకు శంఖనఖాఖ్యుఁగోలుమసఁగె
నయ్య రాజీవబాహాసురుఁ బొలిఁగొన్న
బిడ్డండు కునఖునిఁ బిలుకుమార్చె

గీ. దివిజరాజాదిదిక్పాలదేవతాక
విశిఖముల నిట్లు దైతేయ విశసనంబు

ఉ. అప్పటి బంధువీరవిరహప్రభవంబగు ఖేదమక్కటకుం-
ముప్పిరిగొల్పిపోవఁ దనమోమును గన్నులుఁ జేవురింపగా
నప్పిశితాశనాధుఁ డహహా ధనువేను ధరించు పాటివో
రెప్పుడు గల్గునోయనఁగ నిప్పుడగా యొనఁగూడెఁ గ్రక్కునన్. 130

చ. అనిహతశేషభీతరథికావళిఁ బేరునఁ జీరిపేరెలుం
గున మనమెల్లరుం గుడుచు కూడు చుఁడీ మనుజుండనంగ నే
మని తలలూడఁ బారెదరొ యంతటి ఁహదొర లేమి బాసనో
యనిఁబడిరంచు సైనికుల నందఱఁ గూర్చి యుదర్చిరాకృతిన్. 131

ల య వి భా తి

వెలుఁగుచు నతండు తనకెలకులన వచ్చు నృపదళితరథిజాత
రథములకు నిజమాయా
బలముమెయి మున్నెపుడుగలరథికసారథులుగలిగికరినాట్టహాసములు
సెలఁగగాఁగో
త్తలకెదురు జేయఁగని కలఁగి సురకోటిమది బలుబెడద వచ్చె యిఁక
గెలుపరిదివీరల్
దొలుతఁదలపాటుఁ దమపలుదలలపాటు లిటుగలుగవనిపింతురటె
గలబెడఁగులందున్. 132

చ. అని తలపోసిచూత మెటులయ్యెడునోయని వేచియుండఁగా
నినకులదీపకుండుఁ దలయేటులఁ బోయినవారికిం బున
ర్జననము తోన కల్గుటకు సంశయవిస్మయ రూషితాత్ముఁడ
య్యును మది జీరికింబొనక యుచ్చరవంబుగ శంఖమెత్తినన్. 133

చ. చినిఁగె దిశల్ నభంబవిసెఁ జిందరవందయై గ్రహస్థితుల్
సనియె వియర్ఝురం బొలికెఁ జాలె సురాళికపాయశంక కం
పనమున భూతముల్ మిడిసె భైరవుఁడుల్కె విధాతబెగ్గిలెం
బనివడిఁ దేర్పఁ దేర్ప నల భర్గుని కౌగిట దుర్గ మూర్ఛిలెన్. 134

క. మాయావిషహరమంత్ర
ప్రాయాగత పాంచజన్య భవహుంకార

ప్రాయోగత మహిమనత
న్మాయారథిసృష్టి యంత మాయంబయ్యెన్. 135

వ. అట్టి మహాఘోషంబు నిజరోపంబునకు దోహదవిశేషంబుగాఁగొని మనుజ
విభుండు దనుజవిభుమీఁద నురవడించిన. 136

ఉ. సంకున నెచ్చరించి నను సంగరకేళికి బిల్చికొన్న నీ
బింకము మెచ్చితిన్ విడిచిపెట్టెద బొమ్మని యిచ్చ్యకొంటి నీ
బొంకులదేహమున్ విడువు పోరకపోయెదవంచు రాజుకో
పాంకురలేశభూషితదృగంచలుఁడై యెదిరించి నిల్చినన్. 137

ఉ. ఎక్కటి కయ్యమయ్యె నపుడిద్దరకు న్మఱివారిదిక్కులం
బెక్కులు తూపు లప్పతిలి పెద్దలు పిల్చిన పిన్నపాప ల
ట్లెక్కన నుండ దూరుచుఁ దదంసతటంబులకెక్కఁ బారుచుం
జెక్కులు చీరుచున్ నడుమ జివ్వకుఁ జీరుచు నుండె నచ్చుగన్. 138

ఉ. అప్పటికింత తెప్పిరి తదారవవిహ్వలశక్రముఖ్యుల
ల్లప్పటి తేరులే వెదకి యారథిసారథి సృష్టి క్రమ్మరం
దప్పట నూడ జూడఁ దమతక్షకుఁ డప్పుడు చెప్పె బేనికిం
జెప్పక శాంబరీహరము శ్రీహరిశంఖజ శంఖమిచ్చెన్. 139

ఆ. మహిమ జూచి సంకు మాయాహరంబని,
పిదప దెలిసె రాజు మొదలదాని
బాంచజన్యభజనభక్తుఁడై సురశిల్పి
వడసె నెఱిఁగివేడ్కపడిరి సురలు. 140

క. రథిసారథిరహితములా,
రథములు వరశక్తి శరపరంపర రక్షో
రథికులకుఁ దోడు కుఱియఁగ
ప్రథనము సుకుమారునకును భరమై పెరిగెన్. 141

వ. ఉపక్రమించినది మొదలు మనుకుమార గగనకాసార యుద్ధంబు వియచ్చర
విరుద్ధంబై చాలుసాగి సహస్రాక్షవీక్షావిద్ధంబై యెడనెడ నితరేతర పరా
క్రమ నిరుద్ధసమభివృద్ధంబై వెలుంగుచుం జెలంగుచుండె నందు. 142

సీ. అమరారి విశిఖాసనార్జితాహుల మ్రింగె
నధిపకోదండభూహరిరథములు
నక్తంచరేష్వాసము క్తదంతులఁ గూల్చె
జననాథ కార్ముకజన్యహరులు
దనుజబాణాసనోద్గతమైన చిచ్చారె్చ
నృపధనుర్భవమైన నీళ్ళవరద
అసురశరాసేద్ధమైన చీఁకటిసించె
భూపచాపజమైన ప్రొద్దువెలుఁగు

గీ. పలలభుక్కల్పితాస్త్రంబు పార్వతంబు
నవనిపతిము క్తకులిశాస్త్ర మపహరించె
నస్రపము పేరియస్త్రంబు నాసురంబు
రాజకరవాసవాస్త్రముగ్రాజిఁగెడపె. 143

క. తుదినసురశ క్తి వైచిన
గదనధురంధరుఁడు శేఁడు గైకొని పైపై
బ్రదరసహస్రము విడచెం,
బొదినడిచెఁ గటారిఁబొడిచె బొమముడి ముడిచెన్. 144

క. జనపతి సాధనములనది
తునియక యలయక యొకింత తొలివడక రయం
బున ననలకీల లుమియుచుఁ
జని తాకిన నతఁడు మూర్ఛచని యుఱిఁగె నృపా. 145

ఆ. ఇటులు నిటలఘటిత,కుటిలభ్రుకిటియైన
మొగముతోడ వీఁపమూర్ఛనున్న
తంత్రికయ్యమపుడు తానందికొని నుకు
మారుఁడట్టహాస ఘోరభంగి. 146

ఉ. విల్లురుమంగఁ జేసి యొక వేఁడిశరం బరివోసి యేసి య
బ్భల్లిదు ప్రక్కనొంచిన నపాయపు టూపిరికుట్టివట్టి మూ
ర్ఛిల్లి యొకింతలోఁ దెలసి చిచ్చులుమూఁడును మోములం
జెల్లివెలుంగు శూలమునఁ జిన్నదొరం బలుమూర్ఛ ముంచినన్. 147

గీ. అసురవిభుజూచి మునినాధుడౌటవిడచి
వెదలెనని వెత్తి రాకుండ బుడమిఱేఁడు
తెలిసి గదఁగొన్నరిపుశక్తి దిగిచివైచి
మఱియొరఁగిక్రమ్మరందేఱె యురక నిలచి. 148

మ. దితిజేంద్రాతిశయంబు ప్రధనోద్రేకంబు దత్తాదృశో
ద్ధతయోధిదికవిభ్రమంబుఁగని యేతన్మాత్రబాణోత్కరం
బు తరంబా యివి చక్కఁ బెట్టనని శంభుబ్రహ్మసంభావితా
క్షత నారాయణదైవతంబగున యస్త్రంబుం బ్రయోగించినన్. 149

శా. ఆయస్త్రంబఖిలాస్త్రశక్తిజనకం బక్షయ్యసారంబభి
ప్రాయజ్ఞంబు సమస్తసాధనరథవ్రాతంబుతోఁ గూడఁద
న్మాయాజేయులదానవేయులను భస్మప్రాయులంజేసి దై
తేయాధ్యక్ష శిరంబు ద్రుంచి కటుప్రవృత్తిం గుక్షి భేదించినన్. 150

క. దుడిదుడివెడలెడు దానవు
కడుపోకలోకమని మెలఁగి గంధర్వాదుల్
తడవుండమిఁ జెడిరంతట
బొడిసేసెఁ దదస్త్రమసుర బొంగియుదేరన్. 151

సీ. ఇత్తెరంగున నమ్మహత్తర సాధనం
బసురదాహకలీల లాచరించి
యుపశమింప నృపాలుఁడు త్పాటితత్రిశూ
లంబు బాహాంతరాళంబు తడవి
తేర్పఁదేరి కుమారుఁ డార్పుతో దిగ్గన
లేచి నల్దిక్కులు చూచియాడ

నగి నారదుఁడు పిల్చి నారాయణాస్త్రప్ర
భావంబు మ్రొక్కి యుపన్యసించె

గీ. నతఁడు మౌనికి తేనికి నతులొనర్చె
రాజుసుతు, గౌఁగలించి నారదునకెరఁగె
దపసి యిరువుర దీవించెఁదపనకులుల
వారిపైఁ బుష్పవృష్టి యవ్వారి గురిసె. 152

కందద్వయగర్భితభాస్కరవిలసితము

పంచవదను నలువుల్ దిశలించెన్ భాస్కరవిలసిత మెలమిరహించెన్
గొంకం విబుధవిభుండరుదెంచెన్ గొప్పసురలు నృపతిలకుల గాంచెన్
మించెఁప్రణయ పరిరంభముపెంచెన్ మ్రొక్కులఁ బ్రియములుపిదప
వరించెన్
బొంచి కనిన జయకందము లెంచెన్ బోరితెరఁగులిటు
తెలమి వహించెన్. 153

ఇందు కందద్వయవిభాగము.

క. పంచవదను నలువుల్ దిశ
లించెన్ భాస్కరవిలసిత మెలమిరహించెన్
గొంచక విబుధవిభుండరు
దెంచెం గొప్పసురలు నృపతిలకులఁ గాంచెన్. 154

క. మించెఁప్రణయపరిరంభము
పెంచెన్ మ్రొక్కులఁ బ్రియములు పిదప వరించెన్
బొంచికనినజయకందము
లెంచెంబోరి తెరగులిటు తెలమి వహించెన్. 155

వ. అనిన విని జనమేజయుండవ్వలి కథాక్రమంబెట్టిదనిన. 156

మ. నతనానానరపాల మౌళివిలసన్మాణిక్యనీరాజనాం
చితపాదా దళితారి వీరజయలక్ష్మీగేహ బాహాబల
ప్రతిభానిర్జిత హేమగర్భనృప నర్వజ్ఞక్షమాపాలసం
శ్రితమందార మహీజ భూధరణ శేషీభూతమాద్యద్భుజా. 157

క. భేరీభూరిధణంధణ
ఘోరారవకుపితగంధకుంభిమదాంభో
ధారాఘటితధునీకలి
తారామవిహార విజయయాత్రాభరణా. 158

రథోద్ధతవృత్తము.

గౌరితారిణితకంజబాంధవా
ఙ్గారిహానిదినయామినీభ్రమా
చార చారుసుయశః ప్రతాపసం
చారదూరితరసాసశీభయా. 159

:- గద్య :-

ఇది శ్రీమత్తిరుమలతోళప్పాచార్య చరణసరసీరుహ సేవాసమాలబ్ధసామ్రాజ్య ధౌరేయ విజకావ్యాభరణాయమాన యెల్లభూపురందరపరనందన మల్లనంతమహీనాథప్రణీతంబైన కకుత్స్థవిజయంబనుప్రబంధంబునందు ద్వితీయాశ్వాసము.



శ్రీరస్తు

# కకుత్స్థవిజయము.

## తృతీయాశ్వాసము

క. శ్రీచోడవంశభవ యహి
తాచారభిదాప్రచండ యయ్యరగండా
భూచర ఖేచరలోచన
గోచరసుమభల్ల మల్లి కోనయయెల్లా. 1

వ. అవధరింపుము మనునందనకథాసుధాధారాధౌతమానసామేయజయుం
డగు జనమేజయునకు శంపాయనుండగు వైశంపాయనుండిట్లనియె. 2

ఉ. వెండియు వజ్రపాణి నృపవీర తపశ్చరణంబు నాఁటి యా
యెండకు వానకుం జలికి నిక్షుశరాసను తోడుగాఁగ నీ
గుండియ యంతగాగ నారఁగోసిన నాతగవెంత యట్టి యు
ద్దండత సైచి గండమిది దాటితి నీ నెనరెంత మాపయిన్. 3

మ. అని యా రాజు తలంపెఱింగి ప్రజలోకాలోకలీలోత్సవం
బునకే మున్ జనుదేరఁగాఁ జనుట యొప్పంగాదె రమ్మంచు నా
యనఁదోకొంచు బలారి వహ్నియమదైత్యాంభోధిసమ్రాణ్మరు
ద్ధన దేశానులు రా విమానములు వింతల్ సూపుచుం బోవుచున్. 4

సీ. విద్యాధరాదులు వీరునీచేనేఁడు
బ్రతికి వచ్చిరి వీరిపాట వినుము
వెన్నెలపొలము నీవియ్యాల కులకర్త
చంద్రుఁడేయాతఁడీ చాయరమ్ము

జలజారి యాఁడుమండలమిదే నీకీర్తి
గెరలించు కులకర్త మరలిచూడు
సడలు సమీరపాశములెత్తి నీగెల్చు
గ్రహగతుల్ చక్కఁగాఁ గాఁచెఁజూడు

గీ. మనుజవల్లభ సప్తర్షిమండలంబు
వేదసంవాదముఖరంబు నాదరింపు
శిరసు మిన్నిటఁ దడియంగ శింశుమార
చక్రగతుఁడైన ధ్రువుపెంపు సన్నుతింపు 5

క. ధ్రువ మండలమౌదలగా
రవిమండల మడుగుగాగ రాజిలు పదునా
లువు లక్షల యోజనముల
భువనము త్రిదివమిది భోగభూమి నృపాలా. 6

క. కృతకాకృతక త్రితయ,
ద్వితయమునకు నట్టనడుమ దీనింగంటే
కృతకా కృతకేతరతా
యుతము మహర్గగము కోటియోజనము నృపా. 7

మ. జనలోకంబున నందనాదుల నివాసం బొప్పు వీక్షింపు యో
జనకోటి ద్వితయప్రమాణమిది భాషావల్లభుం డాత్మనం
దన యోగ్యందగఁ జేయనాఁడ కృతకాద్యంబయ్యెలే రాజభా
జనముంజూతుమహాశ్చతుర్గుణము రాజన్యా తపోలోకమున్. 8

మ. అపునర్మారకలంబు చోట కృతకాధ్యక్షంబు కల్పాంత దా
హపుటాయాసము పొర్వుపొర్వునకు రాదంద్రదందురే యట్టి బ్ర
హ్మపదం బల్లదె యారుగోలలది సత్యంబెన్న నన్వర్థమీ
యపరూపంబును జూడఁగంటివిది భాగ్యంబయ్యె రాజోత్తమా. 9

చ. అనిపలుకన్ నృపాలుఁడమరాధిప యిక్కడియెండలెందుఁ జూ
చిన యవి కావనుష్ణము లశీతలముల్ బహుభానుచంద్ర సం

జనిత మయూఖసంఘముల సందడిచందము నొందెనేమొకో
యనవుఁడు మానవేంద్ర వినవా యివి బ్రహ్మసభావిభావళుల్. 10

క. వింతలుగావా యివి తమ
చెంతల జేరంగనీక శీతోష్ణకర
ధ్వాంతంబులైన వెలుఁగులఁ
బంతంబున మెడలువట్టి పాయఁగనూఁకున్. 11

క. తనయులకును మనుమలకును
దననేరుపు నూరిపోసి తాల్చిన సర్గం
బున భరము వారిఁబూనిచి
పనిదీరి విధాత యీసభం గొలువుండున్. 12

చ. ప్రమదవనంబునం బ్రియసరస్సుల రత్నకృతంబులైన కు
ట్టిమములఁ జుట్టుకోటలఁ దటిన్మయకుడ్యములం బరస్పర
భ్రమద మహాస్స్వరూపమున పజ్జయు దవ్వునెఱుంగనీని వి
భ్రమముల నాసుధర్మ నొరవట్టు విధాతృపురీనికేతముల్. 13

క. తాదృశ పురహర్మ్యములకుఁ
దాదిలియగును దినకరసుధాకరతేజః
ప్రాదుర్భానిదానమ
హాదీధితి తెలియఁదరమె యాసభమహిమల్. 14

క. అని దేవేంద్రుఁడు సకలము
వినిపించుచు రాగ దివిజవృతుఁడై రాజుం
దనసుతుతో మునిపతితో
జని చొచ్చెం దజ్జజంబు చతురరథగతిన్. 15

గీ. ఇనవిభుండట్లు బ్రహ్మదేశంబు సొచ్చి
బ్రహ్మనగరంబు దరిసి యాబ్రహ్మదేవు

నగరి హజ్జారమున వాహనంబు డిగ్గి
బలభిదాదులుఁదానును బ్రహ్మసభకు. 16

వ. పిలిపించికొని చేరంబోయినంత. 17

సీ. అనఘ యోగబ్రహ్మలగు సనకసనంద
న సనత్కుమార సనత్సుజాతు
లను కుమారులు భృగుండును బులస్త్యుండుఁబు
లహుఁడు గ్రతుండంగిరసుఁడు మరిచి
యును దక్షుఁడును నత్రియును వసిష్ఠుండును
ననవబ్రహ్మలై తనరు సుతులు
వెండియు మన్వాదివిశ్వకర్తలు ప్రజా
ప్రియు లూర్ధ్వరేతులు నయనమునులు

గీ. మిహిర మిహికాకరాదిక గ్రహగ్రహణంబు
మేషమీనాదిమాంతిమాశేషరాసు
లశ్వినీముఖ్యతారలు నర్హభంగి
నోలగముసేయ నద్భుతంబొలయ మఱియు. 18

సీ. శ్రుతులంగములు బహుస్మృతులు మీమాంస త
ర్కముఁబురాణేతిహాసములు నవలి
గానాదివిద్యలు నానాప్రకారభా
షలును గాష్ఠాకళాక్షణముహూర్త
దివసవిభావరీతిథిపక్షమాసబు
త్ర్వయనహాయనయుగతా ప్తభేద
కాలంబు ధర్మార్థకామమోక్షములు ద
క్షిణ లధ్వరంబులుఁ బ్రణవమంత్ర

ఆ. వర్గములును బ్రాచ్యవాచీప్రతీచ్యుదీ
చ్యాదిదిశలు నుజ్జ్వలాభిరామ
మూర్తు లుల్లసిల్ల మోదుప్పఁగేలురమూల
నిలిపికొని భజింపఁ గెలకులందు. 19

క. ధృతియును మతియును బుద్ధియు
రతిశబ్ద స్పర్శరూపరసగంధాక్ష
స్మృతిసంకల్పవికల్ప
వ్రతశమదమములును రూపరమ్యతఁగొలువన్. 20

సీ. భావగాంభీర్య సంపదనగాధత్వంబు
గానరా సప్తపాథోనిధులును
మోహనాంగంబుల మొలచు లేఁజెమటల
జలమయత్వము తోఁప సకలనదులుఁ
బ్రబలబాహాంతరప్రథిమఁ గాఠిన్యంబు
బయలు ద్రొక్కఁగఁ గులపర్వతములు
సురభినిశ్వాసవైఖరిఁ బుష్పజాతుల
తావు లేర్పడ వనదేవతలును

గీ. దృగ్గరిమఁ బావనత దేజఁ దీర్థములును
గటిపృథుత్వంబు వొడసూప గహ్వరియును
దివ్యమూర్తుఁతోఁ గొల్చి తేజరిల్లఁ
దనరు పరమేష్ఠిఁ బంకజాసనుని గాంచి. 21

వ. వసురుద్రాదిత్యగరుడగంధర్వ విద్యాధరాదులుఁ బావకప్రముఖులు నంత నంత వందనంబులు సేయ నముచిమధనుండు నారదబృహస్పతిపురోగ ముండై కొంత చేరంజని పరమేష్ఠికిం బ్రణమిల్లి ప్రణవాదినమోంతవచ నంబులం బ్రస్తుతించి మనుతనూభవుంజూపి నభస్సురాసురసంహార పౌరుషం బుగ్గడించుచుండె నతండును బితామహ సభామహోవిభవ వైలక్ష్యవిలోకనజనిత విస్మయవిస్మృత సేవాసమయ సముచిత వ్యాపా రుండై సుకుమారుండు కొండొకవడి యూరకుండి పదంపడి తన యనుంగుఁ దండ్రి యక్కొలువుననుండి చేరవచ్చి మన్వనుగ్రహంబున న్మరలఁ దేర్పందెలివొంది. 22

క. ఆ కరస్పర్శకృతాఖిల
సకలనిటలతారతమ్య సఫలాక్షరథే

ఖక దేవమీకటాక్షము
వికసిలుఁగా కనుచు నెరఁగి వెండియు బత్తిన్. 23

సీ. పూర్వగీర్వాణులఁబుట్టించి యామిని
యైయుండె నేదేవు కాయమొకటి
సురసంఘనిర్మాణపరిణామమునఁ బొల్చె
దివసమై యేదేవు దేహమొకటి
పితృదేవతలను గల్పించి సాయంసంధ్య
గానేర్చె నేదేవు గాత్రమొకటి
బహుమనుష్యులఁగాంచి ప్రథమసంధ్యాభావ
మున నిల్చె నేదేవు మూర్తి యొకటి

గీ. యతనిని బ్రసన్నునింజేయ నతనిచేతఁ
బావితుఁడఁ గాఁగ నతనికిఁ బ్రణుతి చలుప
నతనివలనఁ బ్రాప్యజ్ఞాన మధిగమింప
గోరుదు నతండు నీవఁచే భారతీశ. 24

వ. రంగేశ్వరుకొలువునం గనుపట్టినయట్టుగా దతనిం బుట్టించిన దేవుండవై సేవకృపచేసి తనిన నవ్వి యవ్విరించి యగునగు బహువిధతపంబుల కతన నతనిం బుట్టింపంగంటి ముక్కంటిమొద లేనుదుద తదీయసన్నిధానంబమరి యట్లుండుదు నది యట్లుండె మదీయసర్గంబులు కొన్ని యుగ్గడించి తదనుగుణమనోరథంబులు నీకుం గలుగఁ జలిపెదాఁడవు.25

ఉ. వేల్పులకంటె మున్ను సురవీరుల మేము సృజించు టెంచి సం
కల్పము మాప్రసన్నతకుఁగా నొనరించితి నన్ను నీవచః
కల్పన కర్త మేమి యల కయ్యము మాకు ననిష్టమంచునో
యల్పులఁద్రుంచి లోకములయాపదఁ దీర్చితి వింత యొప్పదే. 26

వ. ఇంకొక్క యెచ్చుమాటయుం గలదు. ప్రాప్యజ్ఞాన మధిగమింపఁదలతు నంటివి. 27

క. చనునే ప్రాప్యాంశమునకుఁ
ఆనవరి వటు పలుకఁ బ్రాప్యసంపద యెల్ల
న్మనుమున్నుఁగఁదలమోపునఁ
గొనిచనవా మమ్ము నడిగి కొనివచ్చితివా. 28

గీ. అనుచు శ్రీరంగధామంబు నాత్మనిడి కృ
తాంజలియుఁ బూర్ణపులకుఁడు నానిమీలి
తాక్షుఁడునునై పదంపడి హర్షబాష్ప
భరమెసఁగ జెప్పలెత్తి భూపాలుఁజూచి. 29

ఉ. ఏమనుచుండు రంగపతి యింకిట మాపటికైన వచ్చునా
యామొగ మాయలంతినగ వాతలయంపిగ నిద్దబాహు వా
వామభుజంబు చాఁపు మఱవంబున దెప్పుడు వచ్చురేయి యే
సీమముఁ బట్టి నాతపము సీదగునో యతిలోకపార్థివా. 30

పద్మనాభవృత్తము.

రావన్న రాజన్యరత్నంబ నీయట్టి రాజర్షియున్నాఁడె నా సృష్టియందున్
దైవంబు నీ సొమ్ముగాఁ జేయఁగంటే కదా పద్మనాభావతారాశ్రయంబై
నీవంశముం బెద్ద వర్ధిల్లు మామీఁదినెయ్యంబు డెందంబునన్నిల్పు మంచుం
దీవించి సత్కారసంప్రీతు నమ్మేదినీలోక సంరక్షకు న్వేగనంపెన్. 31

వ. ఇంద్రాదులుం దమ నివాసంబుల కరుగ ననుజ్ఞాతులైరి. అంతం గుమార
సమేతంబుగా నతిలోక భూలోకేశ్వరుండు. 32

గీ. నలువయడుగుల వ్రాలి సభ్యులకు మ్రొక్కి
గురునకెరఁగి నారదునకుఁగరము మొగిచి
మరలి రథమెక్కి రూఢవిమానశక్ర
ముఖులతో నమరావతిమ్రోల వ్రాలి 33

వ. గగనతరంగిణిం గనుంగొని. 34

క. బలజంభరుధిరధరపవిన్
దొలచిన పెన్నిటిరేకతో నీనది యెం
తలరునొ నిర్యత్కుంకుమ
లలాటరేఖావిభాసి లలనల నగుచున్. 35

క. అని తత్పుణ్యోదకములఁ
గొని కొనియాటలకు నిలిచికొలిచి నదిస్వీ
డ్కొని యమరావతి సొచ్చెం
జనపతి యొక యెదురుకోలు సంఘదఁగనుచున్. 36

వ. అది పురందరవచనసమాగమంబున జయంతుఁ డతనికొనర్చిన యెదురు
కోలు వినుమిత్తెఱంగునఁ దత్పురప్రవేశంబు చేసి. 37

సీ. నందనవనవాసనల సొంపు విలసింప
నలసంపుఁ జలిగాడ్పులనుసరింప
నెక్కిన మణిహర్మ్యమేచాయ యాచాయ
మేచాయఁగలసతులెమ్మెఱసిచూడఁ
దనపోరఁ దెగి యందు మనువారు దనవారి
తనమూఱఁ జిఱునవ్వు దనికి మ్రొక్క
యజ్ఞభిక్షాదాత యని వేగ మనురాగ
మున యాగఫలభాగులను నుతింప.

గీ. దనకు సురరాజు నిజరాజధాని వైభ
వములు చూపుచు సంగడివచ్చు నపుడు
దను నతఁడు మించి చననోడఁ దానునతని
మించిచననోడఁ బౌరులీక్షించి రలరి. 38

గీ. ఇవ్విధంబున సౌహార్ద మెలయ నరిగి
నగరి మొగసాలకడ వాహనములు డిగ్గి
పెద్దలిద్దఱు ముందటఁ బెరసి కేలుఁ
గేఁగొని వేత్రహస్తులు మ్రోల మెఱయ. 39

క. సుకుమారుండు జయంతుఁడు
నొకజోడయి రా దిగీశ లోకగుంపై రా
నొక రౌననఁ గక్ష్యాంతర
వికస్వరశ్రీలు చూడ్కి విందులు సేయన్. 40

శా. చేరంజొచ్చి సుధర్మయందు విలసచ్చింతామణీపీఠికం
దారాసీనులుగా దిగీశు లుచితస్థానంబు లందుండఁగా
ధీరోదార కుమారులొక్క మణివేదిం గూర్చి కూర్చుండఁగా
నారంభాసతు లాడి రెచ్చుజత హాహాహూహూవు ల్పాడఁగన్. 41

క. ఇవ్విధమున నుత్సవముల
నితిహాసముల మనఃప్రమదంబు
ల్నివ్వటిలఁ జేసి యింద్రుం
డవ్విభునకు నొసఁగె మణిమయాభరణాదుల్. 42

వ. ఇట్లు బహూకరించి యించుకవడి దలంచి. 43

మ. భుజశౌర్యంబునఁ బెద్దవై హితుఁడవై పోరాని బంధుండవై
త్రిజగద్రక్షణదీక్షకెక్కితివిఁ కేదీయిచ్చు మాదీవనల్
నిజమై వర్ధిలుమన్న రాజతనుపాళీయౌవనప్రౌఢికి
న్విజయంచేసెను బ్రహ్మపుత్రుఁడు హిమానీరుక్కులగ్రామణీ. 44

క. అచ్చతురాననసూనుం
డచ్చటఁ దానపుడు మొలచి యాశీర్వాదం
బిచ్చెనె యింద్రుఁడు మెఱుఁగులు
దెచ్చెఁగదా ప్రాయమునకుఁదీవననినన్. 45

ఆ. సేమమెచ్చు ననఁగ జిష్ణువర్ధిష్ణులం
దుపచరించిరతని నుచితవిధుల
నుల్లసిల్లి మునియు నుభయాభిముఖవేది
నభిమతాసనమున నధివసించి. 46

సీ. విషమసాయకునకు విఱిగిన పేఁ డంటి
నేఁడుగా వెడవిల్లునాడు నిలిపెఁ
దనుగంధవహునకుఁ దల చిటచిట దీఱ
నేఁడుగా నునుదేఁటి గూడు దెఱచెఁ
బుష్పాకరుని పూర్వపూజకుఁ దెరవుచ్చి
నేఁడుగా పూవుఁ క్రొవ్వాఁడి యయ్యెఁ
గుముదబాంధవు ప్రతాపమునకుఁ జలివాయ
నేఁడుగా వెన్నెల వేఁడిఁబెట్టె

ఆ. వలపుఁజల్ల వచ్చి వలచిన వలపొక
తపసిఁజేని శాపకృపలఁ జేసి
కలఁగి తేఱె యిట్లు కర్పూరతిలకకు
నేఁడుగా పునర్జనికి ఫలించె. 47

వ. అని పూర్వోత్తర కథాసంఘటనంబున కుపక్రమించి. 48

చ. వరమున నట్టె రెండగుభవంబున నట్టె సురేంద్రుకొల్వు న
చ్చరయటె నిన్ను మన్మథవశంవదుఁ జేసి తరించెనట్టె యి
ట్టిరె మగ లెందు నెక్కుడి పటీరతుషారనగంబు లేటిమం
దర మని నారదుండు మనునందను ధీరత మెచ్చి యిట్లనున్. 49

సీ. నిర్జరేశ్వరసఖ నీ చేయునాతిథే
యములను బనిగామిఁ దమమనంబు
లగవీరులై మన్మథాదులు దిరుగంగఁ
దిరిగిన కర్పూరతిలక నిన్నుఁ
గలఁచిన కలుపొకకడ రవుల్కొకనఁ దాల్మిఁ
బడి వెన్నెలలఁబట్టి పుట్టి స్రుక్కి
తపమున నీకు మోహపుదేవి కా గోరి
ఛనితపోవనిఁ గణ్వమునికి మ్రొక్కి

గీ. యనుమతికి డాయ నివి మాయ లవనిఁ బుట్టు
మని శపించిన నతఁడు దే...
శాపమిది నీ తపఃఫలరూప మబల
బ్రదుకుమనఁ జేరెఁ జెలిపిండు వెదకికొనుచు. 50

క. చేరిన చెలులకుఁ జేరువ
నాఋషి నిర్మించి చూపి యదె కంటిరె క
ర్పూరతరువాటి మీక
ర్పూరతిలక యచటఁ బుట్టుఁ బొండని యనిచెన్. 51

చ. అనిచిన నూర్వశీజలపదాదిసఖీశత మోమహాత్మ యీ
వనితకు గోరుచుట్టిపయి వచ్చిన రోఁకటిపోటు తప్పెఁబో
మ్మనుటయ కాక రక్షకుఁడవైతి గదా యని పోవుచుం జుమీ
మన కెదురయ్యె నేననిన మాటకుఁ బొంగె లతాంగియున్ మదిన్. 52

క. భూమండలేశ గగనస
రోమహిమకు మున్ను వచ్చిరో రారొకతల్
దామెఱుక చేసి కొనరవి
యేమో యిట్టగునొ కంటిమేయని వారున్. 53

కవిరాజవిరాజితము.

అటు లపు డచ్చర లచ్చెలితోఁ జని యిక్కఱి సెప్పిన నీసురరా
జట కవిరాజవిరాజితభూరివియత్క్రమలాకర దైత్యసము
త్క్రిటన చణున్నిను జూడఁగవచ్చుచుఁ ద్రోవన తావిని పొమ్మిఁక మే
లిటు లగు టొప్పనితోఁ జనియె న్మునిపాలికి గామినియున్. 54

క. మునిరాజు తన మనోపీ
క్షణచేయుటఁ చేసి మానసంబగునమ్మో
హనవనమున నొక కపురపు
టనఁటి మొదల నుండెఁ బెనుబయల్గల నీడన్, 55

ఉ. చూచె వనీవిభూతి యెదనొచ్చిన నిద్దుర కన్నుమూయను
న్నేచె మెఱుంగు లెల్లెడల నిండఁ దళుక్కునఁ దోఁచి మాయమై
తోఁచె సఖీసకాశరుచిఁ దొయ్యలి యమ్మని మూదలింపఁగా
మోచె సమీపపుంగదళి మోహనగర్భము మెచ్చ నచ్చరల్. 56

తరళ. మరునితూపునుబోని నెచ్చెలి మాయమైనపు డచ్చరల్
తరళము లమ్రప్రాణము ల్పదిలంబుగాఁ గనఁబట్టఁగా
వెరవుసేరని నిల్పుఁవ్రాసిన వేలుపైనను నేర్పునే
మరలఁదెచ్చినయట్టు లమ్మని మ్రానఁజూపిన మెచ్చరే. 57

మ. అటు లాశ్చర్యపుమెచ్చుచో నతనిరంభాదుల్పశంసార్హమౌ
ఘటనం గొల్చుచుఁ దద్విశాలవలయాకారస్ఫురద్భూరుహా
చ్చటపై బారలు సామ దీర్ఘ విపులాజ్ఞసచ్ఛదశ్రేణిచేఁ
బటపుంబందిరి వెట్టికొన్న వనరంభం జూచి వర్ణించుచున్. 58

క. అప్పా కపురపు దుమ్మా
యప్పాండిమ కాక నీకు మది నలుగుదుమే
యప్పాడిగఁ జెలికిచ్చిన
యప్పా భరమెత్తె నిది మదంబా రంభా. 59

క. అని యాపేరును గడుపున
మినమిన మన మంచిరాచమెచ్చులపేరుం
గనఁ దగువావులఁ బేర్కొని
మునివనసౌభాగ్యమహిమమును గని మఱియున్. 60

క. వని కిట్టి సిరియె కాఁగల
పనికై చెలి కపుడ తెప్పపాటు గదురవే
యనఁటి కిటు దివ్యగర్భమె
ఘనిమహిమకుఁ జేతులెత్తి మ్రొక్కెద ఘనఁగన్. 61

సీ. కపురంపుఁ బలుకులు గలగలరాలుట
క్రొత్త చిట్టుములు రక్కొనుట నెఱపఁ
బయిపాటుగా డిగ్గు పవనాంకురంబులు
బడలికయూర్పుల బాగు మోవ
వలపాని ప్రాలిన యెలదేఁటి వాచవి
కందిన మనుబెల్లయంద మొంద
నిలిచిన నిలుకడ చలువచప్పరములో
ముని యున్కిఁ బవళింపకునికిఁ దెలుపఁ

గీ. దొమ్మిదిముహూర్తములు మోచెఁగమ్మకదళి
గర్భమామీఁదఁబై పొరల్గలయ విరిసెఁ
బుట్టె నొక పుట్టుఁగపురంపుబొట్టు బిడ్డ
క్రొమ్మెఱుఁగు చెక్కిచేసిన బొమ్మవోలె. 62

క. కన్నకడు పపుడు రంభకు
నున్నఁదనముఁ దిన్నఁదనము నూల్కొలిపెఁ దగం
జిన్నపడుచున్నరంభకు
జెన్నారఁగ ముద్దువచ్చి చేతికి వచ్చెన్. 63

సీ. ఆరంభయలమంగ నందంపుఁజెయి సాచి
గిలిగింత లలచంద్రకళకుఁ గొలుపు
నాచంద్రకళ వొంగి యమృతమొల్కఁగఁబల్కి
చెవులపండువు లూర్వసికి గడించు
నాయూర్వసి కరంగి యడుగుఁదామరఁదాల్చి
చికిలివేడుకలు మేనకకు నడపు
నామేనక చెలంగ నదటుఁజూపులు వన్ని
కనుబండువులు వరూధినికిఁబెనుచు

గీ. నిన్ను నే శిల్పి కల్పించెఁ జిన్ని మెఱుఁగు
గమ్మఁదావుల నీరంభ కడుపునొచ్చి
యనఁగ నల్లదిగో నని మునికటాక్ష
మచ్చరలకెల్లఁ జూపు నయ్యనుఁగుబొమ్మ. 64

గీ. పొదము ప్రాయంబు శకునంబు నడుము ద్రొక్కె
వెదలు బాల్యంబు జడిసిననడుము ద్రొక్కె
నమ్మముద్దాడ నడుమీల్గెనమ్మయనుచు
నెత్తిముద్దాడెఁ జెలిచెల్వనిలకు డించి. 65

వ. అయ్యవసరంబున. 66

మ. దశమైకాదశలగ్నవేళలను మీఁదంగఱ్ఱఁ దక్కన్యకుం
దశమైకాదశవాసరోత్సవము లుద్వాహాదులుం జేయునాఁ
డు శతానందసమానుఁ డమ్మఘవుపీడుం బోలెఁ బొల్పొందసౌ
ధశతభ్రాజితసర్వవస్తువుల నుద్యానంబుఁ జేసెన్నృపా. 67

క. ఒకయిలు విలసిలు వైవా
హికమై యతికనకమై యనేకమణీక
ర్మకమై సకలకకుద్భా
మకమై తీరై సుధర్మమారై యెందున్. 68

వ. అది యట్లుండె ననంతరంబ యమ్మెని యమజ్ఞ నచ్చర లచ్చెలువకు నభ్యంగమజ్జనాద్యుపచారంబు లాచరించువారై వలయువస్తువులు మేడకుం జని తెచ్చిరందు. 69

సీ. నలుఁగు వెట్ట నురంబునకుఁ బూపచన్నులు
బలిసి క్రిక్కిఱియఁ జే వెలలదపుడు
శిరసంటికొన గోళ్లఁ జిక్కువాపిన కురు
లొక్కనలు సాగిన బారఁ గొలువ దపుడు
గంధామలకమిడఁ గదలింపఁ దొడవులు
తిరుగఁ బుట్టఁగఁ దివ్వఁదీఱ దపుడు
కట్ట మేనహిమోదకంబార్చి మడుగులు
పొదవుదోఁచినఁ దాల్పఁజోల దపుడు

ఆ. చాలు ననుచు సరససమయోచితోక్తులు
జరపి యుచితవిధులు చలిపి చెలులు

నోచ్చలితుఁడైన ముని యచ్చరితము ల్నడప వచ్చెఁబురుడున్
వెడలనిచ్చెఁ గ్రియలన్నా
క్రుచ్చె నటమీఁదితగవచ్చు పడఁగామొదలి యచ్చెలువపేరయపుడిచ్చి
నటు లుండన్. 76

వ. అట్టి సమయంబున రంభాసంభవం జేరి. 77

సీ. వెన్నెలబయలు పూవిలుకాని యాఁకుఁ
జిగురాకుబోఁడి నీ చిన్నినగవు
రతివల్లభుని విహారమునకు లేఁదోఁట
మెలఁత నీకనుదీఁగ మెఱుఁగుఁజాలు
దర్పకు డాఁగురింతలకుఁ జీఁకటిమేడ
మగువ నీ వేనలి జిగిబెడంగు
తామరకొలను కందర్పుని యోలకు
వనిత నీవదనలావణ్యరసము

ఆ. పెక్కులేల మరల ముక్కంటి దయకల్గి
కమ్మకత్తి మనసుఁ గన్నపెట్టు
గండుదొంగ కెపుడుఁ గర్పూరతిలక సి
రివి మేను టెంకి మావిమ్రాను. 78

ఉ. అచ్చరమేనినాఁడు నదయాడుదుగా తనయందు నన్నుఁ మా
మచ్చిగఁ బాయలేక నభమానభమయ్యె నితంబమయ్యె నో
నెచ్చెలి యీయిలాతలము నీదగుపాదము సోఁక నెయ్యమై
వచ్చెఁ దదీయ బుద్ధికితవా తరువాతఁ బతిప్రవృత్తికిన్. 79

వ. అని పలుకునవసరంబున. 80

ఉ. కమ్మని మేనులుం దెలియఁ గల్గిన కౌనులు వాలుఁగన్నులు
న్నిమ్మలు వండెఁ బొమ్మనఁగ నేర్చినకన్నులు రేఁచిరేని జుం
జుమ్మను కొప్పులు న్నడలు చొప్పులు నొప్పఁగ నారగింపఁగా
రమ్మని పిల్వవచ్చి రుడురాణ్ముఖిఁ గొందఱు బోనకత్తియల్. 81

ఉ. వచ్చిన నెచ్చటన్మొలచి వచ్చితిరే యన నోలలాడుచు
న్వచ్చితిమమ్మ యేము నొక వారిరుహాకరవీది నీజటా
ఖృచ్చతురాననుండు మొలపింపఁగఁ దమ్మిలతోడఁ బుట్టి మా
కిచ్చె సుగంధగంధి పదిహేరి-రేటము లబ్జనామముల్ 82

సీ. అనవిని యచ్చరల్కు నిరాజునటు మ్రొక్కి
యయ్యనిన్నటఁగోలె నెఱుఁగుబిడ్డ
చెంతవాయక యుంటి రింతలో నీసృష్టి
సాగుటెక్కుడయును జానఁగాము
కులకటువోదురే కొలనుసొచ్చియె తెచ్చి
కొంటిరి నెఱజాణ కొమరుఁగెంపు
ఘనసారతతికి నిచ్చిన తేజమింద్రాణి
మెచ్చుసుమ్మన నతండిచ్చగించి

గీ. అరసి కన్నియ నాకొంటె వారగింప
నరుగు మిది నాకు మధ్యాహ్నికావసరము
పోయివచ్చెదమనఁ జిన్నివువు నఱచ్చె
నతనికిఁ దదాజ్ఞ మాకు జోహారునవచె. 83

చ. అపుడట నుండి యేను గుతుకాగత మౌనులు గణ్యతాపసా
లపనమనోనుకూలవిధులన్ బలుదీపన లిచ్చియుంచినం
గపురపుబొట్టుభామ చెలికత్తియ లౌనన మేడకేగుడు
న్విపులరసంబులై వలచె విందులు బందుచు రెండుపూఁటలన్. 84

సీ. కమలగంధిపయోజగంధిపంకజగంధు
లానందసన్నాహ మచ్చుపంపఁ
బాథోరుహసుగంధిపద్మసుగంధులు
ఘనసముల్లసనంబుఁ గడలుకొలుపఁ

గంజగంధిసరోజగంధిసారసగంధు
లుపచితంబై తపంబొనరఁ జేయ
సరసిరుహసుగంధిజలజసుగంధులు
సుసరమై సుషిరంబు సొగియఁ దేఱ

గీ. వపురపాంగవేణీవిభావతయవీథిఁ
గనదనిర్వార్యమూర్తియై వనజగంధి
మువ్వెలుఁగులోని పరతత్త్వమో యనంగ
శుద్ధనాట్యంపుఁ దెరువునఁ జూడబొలిచె. 85

ఉ. కుంచియదోయి మూఁపులకుఁ గోపులకున్నెఱిచూప జోఁటిజో
డంచు లలంకరింప గుఱుతైన కిరీటమువెట్టి జక్కిఁణీ
సంచున కజ్జగంధి జలజాతసుగంధి మణీమయక్రియ
ల్గాంచినఁబుట్టఁ బుట్టెఁ డెఱిక ల్నెఱపెం గొఱవంజి యాటలన్. 86

క. పేరోలగముతలంపుల
పారంబులు వలికి యులికి పడఁజేయుచు నొం
డే రెండె యనెడు నెన్నిక
నీరాకకుఁ బక్షమెంచి నెచ్చెలి గలఁచెన్. 87

చ. పగతురు నెయ్యురు న్బిరుదుపాటలలో గెడగూడఁ గేకకున్
సిగసిరసూచెఁ గత్తిమొనచిమ్మను గుమ్మను నేలసోఁకుఁచు
న్నెగయఁగ జొక్కుటాటలకు నేరిచి నీరజగంధిదాపలై
జిగిజిగిచూపురా నెడమచేతన మీసము దువ్వెఁ జిందునన్. 88

గీ. చెలువ కొఱవంజియెఱుకచేఁజిన్నవోయి
చిన్ననగవైన నగదయ్యెఁ జిందుగొనఁగఁ
గోరజగగొమ్ము బరిగెత్తి గోకి మీస
లారజపుఁగేక బోఁటికి నమరెనపుడు. 89

వ. అంత భవదీయ రూపరేఖాతిశయంబులు మనంబునం దలంచితలంచి లతాంతకుంతకుంతాధీన స్వాంతయగు కాంతంజూచి చింతించుచుఁ జంద్రకళాదు లుద్యానవన విహారంబులఁ బరాకుసేయం దలంచి తోకొని పోయి. 90

క. రాచిలుక రాణివాసము
లోచెలి యెలమావి చిన్నియుప్పరిగలపైఁ
జూచితె ముసగనలాడుచుఁ
జూచెదరాతలిరుచెడపుసోరణగండ్లన్. 91

చ. చిలువలఁ బొంచి చంచువులఁ జించు భవన్నవరోమరాజిసో
టుల కివి వచ్చుచేలని యెటో కబరీసమతాభిలాషి ని
ర్మలనిజబర్హపఙ్క్తియపరాధము గాచెనుగానఁ జూడుమో
లలన శిఖావళావళి హళాహళి కన్నులపండు వయ్యెడున్. 92

క. ఈవిధమున సుమశరశర
ధావనగళదాత్మసక్తధైర్యఁ గని వని
భూవిహరణకై తవగతి
భావము మఱపుత్తమనుచు భామలు చనఁగన్. 93

ఉ. గబ్బుమదంబునంధము పొకాలి పికాలి శుకాలి అంతులా
గుబ్బులు రేఁగఁ బుప్పొడులు గొబ్బున జుబ్బన రాలుచుండఁగా
మబ్బున గుజ్జుఁగెంజిగురు మావిడిచూచి చలించె గబ్బిలే
గుబ్బెత కంతుచే బిరుసుఁగ్రోవి రవుల్కొనెనంచు నయ్యెడన్. 94

క. చిలుక యొకటి యతిరయమున
నెఱమామిడి చిగురుఁ గొమ్మ యెక్కంజతగాఁ
బొలిచెం గెలిచితిగెలిచితి
గెలిచితినని పలికి కలికి కిలకిల నవ్వెన్. 95

క. ఆసమయంబున మకరం
దాసవరసపాన మదవదళినీగానా
భ్యాసవిశేషనిరంతరి
తాసహ్యత బధిరవృత్తి కాస్పదమయ్యెన్. 96

వ. అయ్యవసరంబున. 97

చ. వడిఁ జనఁ జూచి యాతఁ డనివారణఁ దాఁకు నిశాటకోటులన్
మడియఁగ మోఁద నెత్తుట సమస్తముఁ దోఁగెనొ నింగినాఁగ న
ప్పుడు కనువట్టె నస్తగిరిభూమి వెలుంగుల ఱేఁడు నిల్వ నె
ల్లెడ నరుణంబులై కనదహీనవిభాతతు లాకసంబునన్. 98

క. రక్షోవీరుల నట సమ
రక్షోణిం జంపి నిజకరకృపాణాస్ర
క్ప్రక్షాళనమునకు జగ
చ్చక్షువు చనియె నన నపరజలనిధిఁ జేరెన్. 99

ఆ. సోముఁ డేగుదేఱ యామినీకామిని
తన్నలంకరింపఁ దలచి లేఁచి
చిక్కు పాపవచ్చు చికురబంధంబన
నిండెఁ దమము కమలజాండఘటము. 100

వ. ఇప్పగిది జారిణీజారచోరవారమానసకాలుష్యంబు వెల్లివిఱిసి యజాండ
కరండంబు నిండు చందంబునం దమస్సముదయంబులుదయంబునొందు
సమయంబున. 101

సీ. పూర్వదిగీశగంధర్వమౌళిఁ దనర్చు
పికిలిపూవుఁ దలాటమొకొ యనంగఁ
బొడుపుగుబ్బలిరాచకొడుకు చుట్టినయట్టి
వలిపచందురుకావిపాగ యనఁగ

దర్పకజైత్రయాత్రావార్తఁ జైత్రుఁ డ
గ్గడిఁ జాటు తలిరు జేగంటయనఁగఁ
జిన్ని రేఁప్రోయాలు వెన్నెలప్రాలు
జల్లించు బంగరపు జల్లెడ యనంగ

ఆ. నంతఁదోఁచెఁ గతిపయప్రయాణానుగాం
భోనిధానవిదితమానసాను
రాగ సూచకాహిరాట్ఫణామణిమహో
వహనసహనవీచి తుహినరోచి. 102

వ. అంతనంతకంతకుం బొడవై పొడవై పొడవై పునం బొంకంబగు మృగాంకంబు యామినీకామినీ పురాతనవిరహిసమయ విషమశర ప్రసవ మార్గణ వర్గక్షత మార్గనిర్గళ దనర్గళ రుధిర ధారాపూరంబు తోరంబుగా నెండం బదనేది ఘనీభవించు నలుపున నలుపు దెఱపు రాజు విరాజమాన మూర్తియై గగనవీథిం జనునప్పుడు. 103

క. సలసలఁదెరలు విరహిద్రు
క్సలిలంబులు చలి పిసికి చవిచూచుచు వె
న్నెలపిండి యొక చకోరిక
కులుకుచు నొకకజ్జ మగనిఁ గుడుకంజేసెన్. 104

లయగ్రాహి

కోరితావవిందు దనకోరి జిగియాక చనకోరియని చేరెడు చకోరియు
లతాశృం
గారములు దేఱెడు నగారములు కృత్రిమనగారములు కేకి
నయగారములునుం గా
సారములు దేమరకసారములు పుష్పరసనారములు మారభుజసారములు

కారములుదాల్చు సహకారములు తేఁటులప్రకారములు బోఁ[illegible]కి [illegible]ారములు

సీ. అధికచంద్రాతపవ్యథకుఁగా కిరుకేలఁ
బయ్యెదఁ దురముపైఁ బట్టుకొనుచు
వర్త్మవల్లీప్రసవములు మెట్టుటకుఁగా
కడుగుఁదమ్ములకడ ల్దడవికొనుచుఁ
గటుకోకిలార్భకార్భటికిగాక తటానఁ
జెవులలోఁదర్జనుల్సేర్చికొనుచు
మలయగంధిలమంద మరుదాగతికిఁ గాక
చెలికత్తియలఁ జాఁటుచేసికొనుచు

ఆ. నిప్పులొలుకు మరుని నిశితహేతులువోని
చిగురుగములు చూచి దిగులుపడుచుఁ
జెలులకొఱకుఁజరపె సింగారిపూఁదోఁట
నాటవెలఁదియోట తేటపడఁగ. 106

క. ముదిరిన రేయెండలచే
నెద వడదాఁకంగఁ గొమ్మ యెదవడఁ జొచ్చెం
బదురున్మాటలఁ బెట్టెడు
పదరేటికిఁ గొలుపనింకఁ బదరే యనుచున్. 107

చ. ఉపవనభూమి నిప్పగిది నొయ్యనఁ నొయ్యనఁ జేరఁ గేళిస
ల్పపగిదిఁ జంపకాదిసుమభూమిరుహాగత శీతవాతధూ
తపరవశత్కనత్తను లతాస్థితిఁ జూడఁగనోడి నెచ్చెలు
ల్గపురపు వేది నొక్కయెడఁ గామిని నుంచి యనంగు దూఱుచున్. 108

ఆ. మింటఁ బూవుఁదెచ్చి మొననూపు నామని
కంటఁ గానరాక కాముఁడేసె
నీద తెల్లఁగాఁగ నెఱగాని వెన్నెల
జాద నల్లఁబడఁగఁ జనియె గాడ్పు. 109

ఉ. హాలహలంబులు మ్రింగె శశి నౌదలఁ దాల్చెఁ బ్రసూనబాణునిం
గాలునిఁబ్రోలి కంచెఁ జలిగాలి భుజంగమభూషకోరలం
గూలఁగఁద్రోచె నీశ్వరుఁ డకుంఠితదివ్యవిభూతిపేర్మి నా
ఫాలవిలోచనుం దలఁపు పంకజలోచన నీవు నావుడున్. 110

చ. కుసుమరసంబు దెండు వలిగొజ్జఁగినీరము దెండు దెండు సా
రసబిసరాజి నాఁజని భరంపడి తెచ్చిన శైత్యకృత్యము
ల్వెసవెసఁ జేయఁజేయ నవి వేఁడిమిపోడిమి నంతకంతకున్
వసమరఁ జేయ నిందుముఖి వావిరిఁ బల్కు మనోభవాదులన్. 111

ఆ. నీకు వెఱచికాదె లోకవిధ్వంసక
మగని ఱొమ్ము విడిచి డిగఁగ వెఱచు
గన్నతల్లి కుసుమకార్ముక నీవింకఁ
బాంథజనుల భంగపఱచుటరుదె. 112

చ. మముఁ బెఱవారిఁ బల్వురఁ గ్రమంబునఁ జెప్పఁగ నేల యక్కటా
సుమశర మాధవాదు లగుజోదులఁ గూడి జగత్త్రయంబునుం
గమరుపఁ జూచి కాదె కలకాలపుబాధఁ దరింపఁ జాలమిం
గమలజురాణి వల్లభుమొగంబున వ్రేలునహర్నిశంబులున్. 113

క. మట్టొకటి కలదె నీకుం
దొట్టినమదమునఁ దపోధనుఁ బరాశరుని
న్నట్టేటఁ బుట్టి ముంపవె
కట్టా కందర్ప కుసుమకాండములవడిన్. 114

చ. తుహినమయూఖ నీవు తలఁ ద్రొక్కి వశింపఁగ గాదె భీతిఁజెం
ది హిమధరాధరాత్మజకు దేహములోన సగంబు గాఁగఁ దా
బహుమతి సేయఁగాఁ దలఁచె ఫాలవిలోచనుఁ డెవ్వరింక ని
న్నహహ తరించువారు వనజాక్షులఁ బేలఁ జెప్ప నేటికిన్. 115

క. ఇత్తెఱవ చిక్కెఁ జిత్తజు
కత్తులఁబోనం బరోపకారము కొఱకై
యెత్తితివిదె నీదేహము
చిత్తమునం దుంచుమయ్య శీతమయూఖా. 123

ఉ. మందసమీరసైంధవ యమందమరంద ఝురీపరీత మా
కందపుటీవిలాస గిరికందర మందిరకేళిలోల యిం
దిందిరసార్వభౌమ యశిదేశ మిళిందపురందరా పఘా
కొందక కావు నీలకచ యున్నది నీవల తెక్కమాటునన్. 124

వ. అని యమ్మందగమన లందఱు నందంద కందుచు నిందుకందర్ప మందా
నిలాదుల ననవరతమరందబిందుకుందేందీ వరారవిందచందన సందోహ
సంపాద్యపాద్యాద్యుపచారంబులంబూజించి హెచ్చరించి యచ్చంచరీ
కాంచిత కేశపాశకాశాపూర్తిం బ్రదత్తప్రసాదాసాదితంబుగా నక్కనందార్చి
యుం జెక్కునం జేర్చియుఁ గన్నుఁ నొత్తియుం జన్నుల మెత్తియు
హస్తంబు లందుఁడిచియు మస్తంబున న్మడిఁచియు నుపచరించునట్టులై
యుండిరి. 125

ఉ. ఇంతకు నెంతకాఁగలదొ యేఁజనుదేఱకమున్న చిత్తభూ
చింతఁ జిగిర్చి రేఁబవలుఁ జెక్కులపైఁ బుంకాంకురంబులై
కాంతకుఁ దోఁచెఁ బెంజెమట కాలముపెంపున కేమిసందియం
బింత యుటెంగి యుండు మిఁక నేమట వత్తుము పెండ్లినాఁటికిన్. 126

వ. జన్మాంతరంబు లెత్తియైనను భవత్సంయోగంబ కావలయునని యభిల
షించియున్న యక్కన్నియం బరిగ్రహించుట యుచితంబు. అదియునుం
గాక యమ్మహానుభావుండగు కణ్వముని యనుంగుంబట్టిఁగాఁ జేపట్టిన
కతంబునఁ బరిగ్రహించుటయ యుచితంబు. 127

సీ. అని యొప్పఁజెప్పి యమ్మనుకుమారకుని నా
సుకుమారుఁ దోకొని సురతపస్వి

దేవేంద్రుననుమతిఁదెచ్చి మాతలి యిడ్డ
యరద మెక్కి యయోధ్యకరిగె మదన
జయశంఖ మౌనంచుఁ జదివె హేమాచంద్ర
కళలకు మున్నాడి కదలివచ్చె
తెల్లదేఁటి యొకండు దెలిసితి మునిసృష్టి
గా దాని నదియును గడఁక నట్లు

ఆ. పలికి ఝుంకరించె బలభేది కేలెత్తి
నయభయములు సూపె నరవరునకు
వచ్చి యచ్చరలును వజ్రికిఁ గర్పూర
తిలక తెఱఁగు మ్రొక్కి తెలిపిరపుడు, 128

శా. ఆమాటల్విని రాజుఁ జూచి జయశంఖాలాపచాతుర్యమున్
హేమాచంద్రకళావచోరసము నీకెట్లుండె నన్నారదుం
దేమీ బొంకెనె యింక వీరిఁగొనిపొమ్మీవత్తు వైవాహిక
శ్రీమౌఖర్యము సూపరేప యని యంచె న్వజ్రిభూవల్లభున్. 129

మాలిని—అనిచిన నతిలోకుం డానతుండై బలారా
త్యనుమతి ననుఁగై రానంబు భూశంఖభృంగం
బన తనుభయమాలిన్యాశయం బింతికిమ్మం
చనునయమయమై రానచ్చర ల్మెచ్చటాడన్. 130

మ. తనతే రెక్కిచనంగ నందన వనాంతఃకంతుసైన్యంబు భో
రన మ్రోయింగను తన్మనశ్శ్రవణ మూర్ఛ త్తేర్చె నత్తోఁటఁజ
ల్లనిమందు ల్గొనివచ్చి చంద్రకళ తెల్పం దేఁటి వారించె న
మ్మెనఁజంతు ల్వరుసన్రతిస్మరకును ల్మోమైన మూఁడానలన్. 131

వ. అంత నచ్చరలవ్వలం జనునప్పుడు భూవిభుంజూచి. 132

క. అదె లీలావతి యూర్వశి
యదె యల్లదె రంభ మనరథైకాగమ సం
పద చూచిచూచి వెసఁబో
యెద రీజీవాతువార్త యింతికిఁ దెలుపన్. 133

క. అనునప్పుడు బదరీవన
మున పొంతం గణ్వముని తపోభూమి దెస
న్ననవిల్తులెంక సార
థ్యనిరూఢిం దేరునిల్పె నచ్చరలంతన్. 134

ఆ. కతలు వదలి వచ్చికైదండ లొసఁగంగఁ
దేరు డిగ్గి రాజుతేఁటివోయెఁ
దెలిసివచ్చి వేళ తెలుపంగఁ జని కణ్వ
మునిపదంబు మకుటమున భజించె. 135

వ. అమ్మహర్షియు నాదరించి విధేయంబగు నాతిథేయంబు సలిపి సమాసీనుం
డైన యజ్జగతీజగదీశ్వరు నిరీక్షించి. 136

మానిని—కోపము కాదుగదా యొకకోపునఁ గూతలుగూసె మహీశ మనో
భూపరివారపరంపర మేరుపుపొంతన తావకచిత్తమియ
త్తాపరిమేయమహోన్నతి నత్తఱి నత్తెఱఁగై యిఁక మానినికిం
జేపడఁ జంతకు నూతఁగ నూతనచేష్టితమే మటుఁజేయుటకున్. 137

చ. అనిముని రాజు హృదయంబున కింపొనరించి సన్నఁగాఁ
దనుఁ గనుగొన్న నయ్యెరుపదంబులఁగంతుని గెల్పుముట్టు నే
చని చెవిచెంత సంకుచిత ఝుంకృతినూకొని విప్పుతెక్కలో
య్య నిలిపియాడుచుం దపసియాడిన మాటలకాత్మఁబొంగుచున్. 138

ఆ. మనుకుమారుఁ జూచి జననాథ యంపించు
కొనుమనంగ నతఁడు మునికి నెరఁగి
దీవనలు వరించి తా వేడ్కతో వచ్చి
యరదమెక్కె నెక్కెనదియు నొగలు, 139

వ. చతుర్ముఖముఖంబున నతిలోకశబ్దవాచ్యుం డయ్యెనే యితఁడని ముని రాజానురాగంబున దనవాకున నిక్ష్వాకునతిశయంబు పునఃపునరాఖ్యాతంబుగాఁ జేయుచుండె నది యట్లుండఁ జంచరీకసారథ్యంబునం బఱచు రథంబు విడిదికడ న్నిలిపి. 140

క. డిగి రాజు సొరఁగఁ దానుం
దగినంతై నగరుసొచ్చెఁ దద్దివ్యరథం
బగునగు నన రంభాదుల
మగరాయనిఁ గొలువఁ బనివి మధుకరమరిగెన్. 141

వ. అరిగి యనంతరంబ 142

చ. మదనధనుర్గుణావగుణ మార్గధురంధరమైన తెల్లతు
మ్మెద మదిరాక్షినూపురము మీఁదన తెక్కొంతోడి ము త్తియం
బదియన వ్రాలి చెప్పె నరుదందఁగ నచ్చటి మేలువార్త చూ
చెదవిపుడన్నియు న్నృపతి చెంతఁజెలీ యనుమాట మీటుగన్. 143

ఉ. చెప్పిన తేఁటిగాంచి మునిచెయ్యి మనోజునకు న్సహాయమీ
యప్పచికొండ పుట్టె సకియా యిఁక నోడకుమన్న యన్నులం
దెప్పిరి చూచె నప్పు డొకతీఱుననున్న విరాళి బాల యీ
త్రిప్పుల నన్నుఁ బెట్టఁడిఁకఁ దెచ్చువిభున్మరుఁ డంచు వేడుకన్. 144

ఆ. అని బహూకరించి యనిచిన నెలదేఁటి
పుడమి జేని విడిదికడకు నరగి
ప్రొద్దుపుచ్చుచుండె భోజనముననంత
రమున నిష్టగోష్ఠిఁ బ్రమద మొదవ 145

వ. అమ్మఱునాఁడు. 146

క. ఉదయమ్మునఁ గల్యాణా
భ్యుదయము గనుఁగొనఁగవచ్చి పురుహూతాదుల్
తదుపవనహర్మ్యనిర్మల
పదవి న్వసియించి రటకుఁ బ్రమదంబెసఁగన్. 147

క. నెమ్మిఁ జనుదెంచె నృపజా
తమ్ములతోఁ బంధుజనవితానమ్ములతోఁ
దమ్ములతో వివిధపదా
ర్థమ్ములతో నవ్విదుక్షితల్లియనుజ్ఞన్ 148

వ. అఖిలాంతరీపభూపతులును దాపసాగ్రేసరులును జనుదెంచిరంత. 149

క. తలగడిగి దివ్యతరుణీ
తిలకంబులు చెలికి జిలుఁగుఁ దెలిపావడచే
నలకలఁగల తడి యార్చిరి
తిలకము గనుపట్టెనపుడు దిద్దినరీతిన్. 150

క. వనరుహలోచన లెల్లరు
మనమున నివ్వెరఁగు వడఁగ మణిభూషణచం
దనదివ్యాంబరములమరె
మునిలోకస్వామి కరుణ ముద్దియమేనన్. 151

ఆ. మనుజనాథుఁడేగె మంగళస్నానాది
కములు సలిపి భూషణములు దాల్చి
యమరవిభుఁడు సుతుఁడు నఖిలబాంధవులును
సందడింపఁ గణ్వసదనమునకు. 152

వ. మునివరుండును గర్మపుణ్యాహవాచన మధుపర్కాదికృత్యంబులాచరించె
వసిష్ఠాను మతంబున నమ్మహీమండలాఖండలుం డుద్యద్రత్న పీఠంబున

నుండి గుడజీరకంబులు ధరించెనట్ల గృహదేవతాసన్నిధానంబున గుడజీర
కంబులు ధరించియున్న కన్నియందోతెచ్చి నెచ్చెలులు తదభిముఖంబుగాఁ
దెరమఱుఁగున నుంచిరంత. 153

క. జనవర గుడజీరకములు
మును నిల్పుమనంగ వజ్రిముద్దియలెత్త
న్వనజాక్షి మును నిలిపెఁద
క్కినసఖులపుడువిద గెలిచె గెలిచె ననంగన్. 154

క. రతియును రతిపతియును బలె
క్షితిపతియును సతియునుండఁ జెంతఁబురంధ్రీ
తతి యారాత్రులు దాలిచె
నతులితమణిభాజనముల నంతంబ్రీతిన్ 155

క.ముని ధారవోసెఁ జంద్రా
ననఁగృష్ణార్పణమటంచు నరనాయకయి
వ్వనజాతాననఁబ్రోవుము
మనుకొని ధర్మార్థకామములతోఁ బ్రీతిన్. 156

వ. అనిన నట్ల కాకయని పాణిగ్రహణం బాచరించె. 157

ఉ. ఈశుఁడు సర్వమంగళకు నిందిరకున్మధుసూదనుండు లో
కేశుఁడు వాణికి న్శచికినింద్రుడు గట్టుగతి న్వసిష్ఠమౌ
నీశుఁడు నయ్యరుంధతియు నెంతయుఁ బ్రేమనొసంగఁ గట్టెను
ర్వీశశిఖావతంసమణి యింతికి మంగళసూత్రమయ్యెడన్. 158

సీ. భూకాంతుపిమ్మటఁ బురుహూతముఖ్యులు
నంబుజానన వెన్కనప్సరసలు
జననాయకు సమీపమున వసిష్ఠాదులు
కమలలోచనచెంతఁ గణ్వముఖులు

నరనాథు చెంగట నవఖండభూపతు
లభ్రిమరకుంతలపొంతఁ గమలగంధు
లవనీశుఁ డున్నచో నఖిలబాంధవులును
సతిదండ బదరికావ్రతిగణంబు

గీ. నిలిచి తమతమ గెలుపులు దెలుపుకొనఁగఁ
బుడమి భేరీధణంధణస్ఫూర్తి మొరయ
దేవదుందుభినాదము ల్దివిఁజెలంగ
బోరనన్మించెఁ దలఁబ్రాలు వోయునపుడు. 159

వ. అనంతరంబు వేదికారోహణంబును బ్రధానహోమంబును నిర్వర్తించి. 160

చ. అలస సమీరకల్పిత సమంచిత వీచుల నోలలాడున
జ్జలజలముల న్హసించుటకుఁ జాలెడు హీరమణీఘృణీస్ఫుర
ద్వలయవధూకర ద్వయము దాల్చినలాజలు వ్రేల్చ భూవిభు
న్వలగొనఁబంచె నగ్గురుఁడు వారిజలోచనతోడ వహ్నికిన్. 161

ఆ. సప్తపదములంద జనపతి సతిఁజేర్చ
రాజ లెమ్ము లెమ్ము రమణి నేను
విన్నవింతు నీదు విన్నపంబంతయు
ననియె నొకతె యెల్లరును నగంగ 162

వ. ఇవ్విధంబున నాల్గుదినంబులుం దత్తదుచిత ప్రకారంబుల నడిపి చతుర్థా
హంబున దేవతాబలి ప్రముఖ నిఖిల కృత్యమ్ములు నిర్వర్తించి యమ్మ
హోత్సవానంతరంబున. 163

గీ. అమరవల్లభు నవ్వసిష్ఠాదిమునులఁ
బూజఁదగఁజేసి దీవించి పుడమితేని
చెలుల నళిభర్త సప్సరోజలజముఖులఁ
గూర్చి సుతనంచె నమ్మని కుంజరంబు. 164

వ. అనవిని జనమేజయుం డప్పాలికథాక్రమం బెట్టిదనిన. 165

ఉ. ఫాలదృగగ్ని దృగ్జ్వలనభాపటభాపి భుజాసి పర్శనో
న్మీలిత సాధ్వసస్థగితసిద్ధవిలోచన వైరివీరభూ
పాలకఫాలరక్తరసపానపలాశన తుష్టభూతభే
తాళపరీత భైరవపతద్రణమార్గ నటద్భటవ్రజా. 166

క. ప్రతిదిన నిజపురయజనా
గతబృందారకవితానకరుణా పూరా
ర్జితమహితాశీర్వాదా
వితవితరణగుణమణీ నవీనపయోధీ 167

సుగంధి- వారిజాక్ష సత్కటాక్ష వర్ధమానవైభవా
సారసారసారిసారచంద్రకాల సద్యశః
పూరపూరితాంతరీపభూపవీరమానసా
గారభూనటత్ప్రతాపగర్వితారిభంజనా. 168

గద్య

ఇది శ్రీమత్తిరుమల తాడపాచార్య చరణసరసీరుహసేవాసమాలబ్ధ సామ్రా
జ్యధౌరేయ నిజకార్యాభరణాయమాన యెల్లభూపురందరవరనం
దన మల్లనంతమహీనాథప్రణీతంబైన కకుత్స్థవిజయం
బను మహాప్రబంధంబునం దృతీయాశ్వాసము



శ్రీరస్తు

# కకుత్స్థవిజయము

## చతుర్థాశ్వాసము

క. శ్రీఖండ సురభిగుణగణ
శాఖాద్రుమచిత్త యెల్లజగతీభర్తా!
లేఖాయమాన నిర్మల
భూఖాయిత కీర్తిపరమపూరుషమూర్తీ. 1

వ. అవధరింపుము. మనునందన కథాసుధాధారాధౌతమానసామేయ జయుం
డగు జనమేజయునకు శంపాయనుం డగు వైశంపాయనుండిట్లనియె. 2

శా. సల్లోకంబుల సన్నుతుల్చెలఁగఁగా సంతానసంతానముం
బెల్లై పూవులు చల్ల నల్ల జయలక్ష్మీకల్యకల్యాణగా
యల్లావణ్యవతీవితానములు సౌహార్దంబునం బొంగఁగా
నల్లోనేరెడు వాడుచుంజనఁగ రంభాద్యప్సరోభామినుల్. 3

వ. దుర్విషహాపూర్వపూర్వగీర్వాణాఖర్వగర్వనిర్వాపణదుర్వారదోర్వీర్యోర్వీ
ధూర్వహుం డగు మనుతనయుండు చలదంచల జాతవాతధూత జీమూత
జాతనికేతనకేతన సాకేతనగరంబు కరంబు సంతసంబునం బొంగ నల్లల్లఁ
జనిచని విజితవిబుధాగారంబును పురవరమాహారంబును నగు హజారంబున
న్నిలిచి శతమఖప్రముఖ బర్హిర్ముఖసంఘంబును వసిష్ఠాదిమునిగణంబును
బూజించి యంచి. 4

ఉ. నారదమౌనితోడ నినునందనబృందముతోడ వేడుకం
బౌరజనంబులం ధరణిపాలుర మోసలనుంచి యెందఱే
హారతి పళ్ళెరంబుల మృగాక్షులు మ్రోలనెదుర్కొనంగ ధా
త్రీరమణుండు చేసె నట దేవియుఁ దాను గృహప్రవేశమున్. 5

మ. అది యట్లుండ ననంతరంబ సుతమిత్రామాత్యసామంతకో
విదవిద్యాధరవీరలోక వివిధద్వీపాంతరాయాతదూ
తదిదృక్షాగతసర్వలోక మహితాస్థానస్థు నారాజు నా
రమఁ డర్భాసనభాసియై పలికె ధారాళప్రశంసోక్తులన్. 6

సీ. పటువాతపరిఖావిపటునిష్ఠ వెలుఁగుట
రంగధామంబు కరస్థమగుట
దివ్యరథారోహతేజంబు దొరకుట
యిలునిల్పితనిభాను నెత్తికొనుట
వైష్ణవాంశము పుత్రవరగర్భమొందుట
గగనసరోయుద్ధకథలు సనుట
లోకవార్తలు దెల్ప పాకారి వచ్చుట
యతిలోకుఁ డని ధాత యనుటపిదపఁ

ఆ. గణ్వమౌని యాజ్ఞఁ గర్పూరతిలకకు
నాథుఁడగుట నిఖిలనరపతులకు
విస్తరించి చెప్పి విభుని దీవించి ని
జేచ్ఛఁదపసి యెక్కడేనిఁ జనియె. 7

ఉ. ఈగతి నిల్లునించుకొని యించుకసేపటులుండ భానుఁడ
స్తాగము దాఁటెఁ జీఁకటుఽజాండకరండము నిండె నిండిన
న్నాగగణంబుఁదోలు మృగనాయకసంఘమువోలె వెన్నెల
ల్భాగగనాంతరాళములఁ బొంగ సుధాకరుఁ డొప్పెఁ దూర్పునన్. 8

క. వనరుహలోచన చక్కం
దనమునఁ దనమనము మరుఁడుదరవీడఁగ మ
జ్జనభోజనములు దీఱిచి
జనపతి చనుదెంచెఁ గేళిసదనంబునకున్. 9

సీ. అదలించి పిల్చు నయ్యంబుజాక్షులు కొంద
ఱారిగద్దిగతనం బనుకరింప

గారవించుచుఁ బిల్చు కమలలోచన లెల్ల
మాపఁతుబలఁగంబు మాడ్కిఁ దనర
మాటికి మొనసూపు మకరధ్వజుఁడు కోలి
గడవానికైవడి కాంక్ష సేయ
నడుగైన నడనీక యాఁకవెట్టినసిగ్గు
సంపూర్ణమదధార సరణిఁ బొదలఁ

గీ. కటితటీకోటికింకిణికారవంబు
పార్శ్వఘంటాద్వయీనాదపదవిఁ బొదువఁ
దరళలోచన గంధసింధురము పగిదిఁ
గొంతసొంపునఁదోతెంచెఁ గాంతుకడకు. 10

వ. ఇవ్విధంబునం జనుదెంచి తలవంచికొని యున్న యక్కాంత నక్కాంత
లాననంబునఁ జిఱునవ్వులు దొలకఁ దనకుం గనుసన్నలనప్పగించుచుఁ
గార్యాంతరంబులు కల్పించుకొని చనునప్పుడు. 11

చ. చెనకనుపక్రమించుఁబతి చెంతఁదొలంగఁగఁజూచు నాతి య
వ్వనితఁ బరాకుసేయు జనవల్లభుఁ డుల్లము భీతినూనుమా
నిని యిటు కొంతసేపు ధరణీపతి తాఁదననేర్పు నాతినే
ర్పును గని నవ్వె నవ్విన సరోరుహాలోచన నవ్వె నవ్వినన్. 12

గీ. అంతఁ గొండంతభయముపశాంతమైన
లోలలోచన బాగాలు కేలికొసఁగ
మడుపొసఁగఁబోవు నెపమున మనుజవిభుఁడు
చేతఁజెయివట్టి శయ్యపైఁ జేర్చి పలికె. 13

క. నీవీవిభవంబిమ్మని
భావించిన నాకుఁ దాఁచఁబాడియె యనుచుం
గావించిన సరసోక్తుల
భావము గరఁగించి మఱియుఁ బైపైనంతన్. 14

ఉ. పయ్యెద జాఱఁజేయఁగరపంకరుహంబులఁ జన్నుదోయికిం
డయ్యెదఁ జేయుఁ బోఁకముడిపట్టు వదల్చిన నందవాసినం
దొయ్యలిమేను గానఁబడఁ దోడన డాయఁగఁ గౌగిలించిరా
జొయ్యనఁ గామతంత్రకలనోదధిఁ దెప్పలఁదేల్చు నయ్యెడన్. 15

క. మనములు కలియుటఁగనియును
దనువులు కడకడల నుండఁ దగునే యని య
మ్మనములగతిఁబెనఁగొనిరో
యన గాఢాలింగనంబు లద్భుతమయ్యెన్. 16

వ. అవ్విధంబున లజ్జావరంబు వదలి పురాతనోపాయంబులు వొదలిన. 17

సీ. అధరాధరామృతం బాస్వాదనము సేయు
మోహమందఁగఁజేసి ముద్దుఁబెట్టు
దరహాస మాననాంబురుహసీమ ఘటించు
మునిపంట నొయ్యన మోవి నొక్కు
నెడనెడఁ గిల్గింటు సడలిన ముడిగొల్పుఁ
జేలాంచలంబునఁ జెమరు తుడుచు
నసదు లేఁబల్కులఁ గొసరి పేరునఁబిల్చుఁ
గనుదోయి సౌఖ్యసంక్రమముఁ దేల్చు

గీ. గబ్బిగుబ్బల నెదనాటఁ గౌఁగిలించుఁ
బారువములకుఁ గళరవాభ్యాసమొసఁగుఁ
జేరి కొనఁగోట మక్కువఁజెక్కునొక్కు
యువతిసురతంబుఁజల్పునయ్యుత్పలాక్షి. 18

క. ఎదఁ జేర్చినప్రాణేశుఁడు
మదనా యని పేరుకొన్న మార్మొగమిడుచు
న్మదిరాక్షితోన వెఱవం
గదయన నుప్పొంగి మరలఁగౌగిఁటఁ జేర్చెన్. 19

వ. ఇవ్విధంబున మదనకదనాహూయమానమానసు లగుచుఁ గలావిశేషం
బులం బొదలుచు. 20

క. ముదితయు విభుఁడును నేర్పులు
వదలినఁ గని రపుడు పారవశ్యసుఖంబు
ల్మది నాటియున్న మదన
ప్రదరంబును బెఱుక బాళివట్టినభంగిన్. 21

క. ఈవిధమున విహరించుచు
భూవల్లభుఁడుండెఁ బూవుఁబోఁడియుఁదానున్
భావభవబ్రహ్మానుభ
వావిష్కృతహృదయు లగుట యవనీనాథా. 22

శా. ఆయిక్ష్వాకుఁడు నిట్టు రంగపతికత్యంతంబు నిత్యోత్సవ
శ్రీయోగంబులు చేయుచుం గుజనుల న్శిక్షించి వర్ణాశ్రమా
పాయంబుల్దెగఁ గోయుచుం గ్రతుహవిర్భాగంబు లింద్రాదిదై
తేయారాతుల కెత్తిపోయుచు జగద్గీతప్రభావాఢ్యుఁడై. 23

ఆ. అవనిరాజ్యసుఖము లనుభవించుచుఁ బెద్ద
కాలమున్నఁ జెంపకడలనుండి
కలయనరపువచ్చి గడ్డంబు మీసలు
గప్పగోరుబాగు గానవచ్చె. 24

క. హరిభక్తిఁ బౌరుషంబునఁ
బరమైశ్వర్యమున బెద్దప్రభువతఁడు వయః
పరిపాటిఁ బెద్దయై బం
ధురసూక్తిఁ గుమారవరునితో నిట్లనియెన్. 25

మ. సుకుమారాయిక మారణంబు లుడిగెం జుమ్మీ ధరాలోకకం
టకఘోరారులమీదఁ నల్గి ముడివెట్టంబోయిన న్నైటలాం
తికభూమండలవీధి ద్రొక్కఁక యిసీ దృగ్వ్యాప్తి రోధించి మా
టికి వ్రేఁలంబడురా బొమల్కొమరునాఁడే చెల్లె మా వైఖరుల్. 26

చ. గగనపరస్పరారి యనిఁ గైదువఁబట్టిననాఁడ కంటి నీ
జగడము నేర్పు నీదగు భుజామహిమంబిఁక లోకరక్షకం
బగు నఖిలాంతరీపవలయాంచితమేదిని కెల్ల నీవ రా
జగుమని యక్కుమారుఁ బురియం దభిషిక్తునిజేసి వెండియున్. 27

ఉ. నిశ్చయమొప్పఁ బ్రాంతరమణీమణిచండకులున్నవారు ని
శ్చలితారు లమ్మగురుఁ జాలక నూర్వురు చిన్నవారు ప్రా
క్ప్రశ్చమదక్షిణోత్తరవిభాగములన్న ప్రభులై వికుక్షికి
న్నిశ్చలభక్తులై మెలఁగ నిల్పి వినిర్మలచిత్తవృత్తియై. 28

ఆ. పరమనిష్ఠ రంగపతిఁ గొల్చియుండునా
రాజు మఱి వికుక్షి రాజ్యభోగ
చతురుఁడయ్యె నితని సతి యంశుమతి యశో
ధనకుమారి దౌహృదంబుఁదాల్చె. 29

సీ. ఎలకుండలకు రెంటికెక్కుడఁ గల్గెనో
నీలకిరీటము లీన్నలవేణి
మూసిపెట్టిరదేమొ ముకురంబు లొకరెండు
తెలిజిల్గు పావడఁ గలువకంటి
జిగురులు రెంటికే తగ్గవునఁ బోడమెనో
యందంపుఁ దొట్రుబాటించువదన
నిదురకుఁ బడఁజొచ్చె నెత్తమ్ము లొకరెండు
తెలఁగిది యెట్లొకో మెఱుఁగుబోఁడి

గీ. యనుచు వలిచన్నుఁగవకప్పు మొసలు గంద
పొండిమము పాదముల సడబడలికయును
నెల్లపుడు శయ్యఁగనుదోయి నెలయు నేర్చు
నేరుపున నెచ్చరింతు రన్నెలఁత సగఁగ. 30

ఆ. మెఱుఁగుఁబోఁడి కుక్షి మెఱుఁగెక్కి వచ్చుచో
రమణిభోజనాదరము తొలఁగెఁ

గాంచఁగన్నకలిమిఁ గడుపునిండినవారి
కత్తెఱంగు నిక్కమగునకాదె. 31

క. పన్నిదములరసి గెలుతురు
వెన్నెల తమ మెదుటఁ జూప వెలఁదులు తమలో
నన్నెలఁత మేని తెలుపును
నున్నకురుల సలుపుఁదెలిపి నూత్నప్రౌఢిన్. 32

చ. వృషభకకుత్ప్రదేశమున వీరవినోదము సల్పఁగోరు దు
ర్విషహపలాశగర్వముడివించి యమర్త్యులఁ బ్రోవఁజూపు శే
ముషి నిడునీరు గర్భవతి మోవఁగ భావికుమారహృద్య పౌ
రుషమహిమ ప్రవర్తన నిరూపకభూరి మనోరథంబునన్. 33

గీ. ఈవిధంబున సుకుమారు దేవి యతని
జఠరమ్మున నున్న విష్ణుతేజంబు నంశ
మెలయ గర్భంబుఁదాల్చి నెలలు తొమ్మి
దియును మోచి భానుకులంబు తేజరిల్ల. 34

మ. కనియెంబ్రస్ఫుటసర్వలక్షణ శుభాకారుం గుమారాగ్రణిం
జనిలగ్నగ్రహచారసంపదలు మెచ్చంబంచె దైవజ్ఞులన్
వినవచ్చె న్వినువీధిదిక్కున సుధీవేద్యంబులై యింద్రవా
హన వర్ధిల్లు పురంజయా మను కకుత్స్థా గెల్వుమ న్వాక్యముల్. 35

ఉ. అట్టి యెడన్వసిష్ఠముని యాసుకుమారనృపాలు గాంచి నీ
పుట్టిన బిడ్డకుం జదలఁ బుట్టిననామము లెల్లవించె వి
న్నట్టి కొలందులే యివి మహార్థము లింతకుఁ డీకఁజేయునీ
పట్టి జగజ్జిగీషు నిజపౌరుషభవ్యకథాచలంబునన్. 36

క. అనినఁ బ్రమదాంబునిధిలో
మునుఁగుందేలుం దదీయములు తరగలు చే
కొని చల్లు నెల్లవారికి
జనపతి వదనముల నెదల జడిగొని నిండన్. 37

క. అనిమిషగిరి రోహణగిరు
లినుఁపగదలఁ జిదియ నడిచి యిచ్చినబాగై
కనకమణు ల్పుత్రోత్సవ
మున విప్రులకొసఁగెఁ జువ్వె భూపతినగరిన్. 38

గీ. ద్విక్ప్రసాదంబులే కాదు దివ్యఘుస్పణ
చందనజలాదికంబు వసంతములును
నఖిలవర్ణాభిమతయ్యె నమ్మహంబు
పురుడు వెడలెఁ బుణ్యాహవిభూతులెలసె. 39

వ. సుకుమారుండును సకలజన గురుజనాదృత నామత్రయప్రచారుండును ధాత్రీసముపలాలనాధీనుండును ప్రతిదినవర్ధమానుండును నగుచుండె. 40

సీ. జరగు ఱొమ్మున ఫణిస్వామి నేఁడు జయించు
గతినెల్లి మతిగెల్తుగాని యనియొ
నిలుచు లేవంకితో నిజసంగరాగామి
పరనృపస్థితి తేటపఱతుననియొ
పాంసురూషణనొప్పు బలధూళి నినుఁగప్ప
గలచేష్టఫల మాదిఁగాంతుననియొ
యభ్యసించును విద్యలశ్రుతవ్యాఖ్యాత
నయి గురూల్లంఘని నగుదుననియొ

ఆ. యని యభిజ్ఞులెల్లఁగొనియాడఁ బెరుఁగుచు
నుచితకాలసంభృతోపనయన
తేజుఁ డకుృమారదేవుండు మేనికి
సంతరించె నిండుజవ్వనంబు. 41

క. నగనాగకమరకిటప
న్నగనాథుల కవనిభరము నాఁడున్నేఁడు
న్మగుడఁగ మోవంబడు నను
వగపుడిగె న్వంశకరుఁడు వాఁడీడేఱన్. 42

ఉ. ఆతని యౌవనోదయము నప్పటి చెల్వము రాజకన్యకా
జాతము శీతలక్రియల సంపదఁ దేలిచె శంబరారికిం
జేతులు నోవకుండ జయసిద్ధి తదీయవిలాసకీర్తి చం
ద్రాతపసాధసంబొకఁడ యంతకుఁ దోడ్పడిచేసె వాసిగన్. 43

ఉ. చొచ్చిపెనంగ కడ్డములు సూపుచ సాదన యొజ్జదొమ్మి సా
మిచ్చిపెనంగు మల్లశతమించుక యాడుచు మేవిదిర్చిన
న్నచ్చిన లావఱంజెదరి నల్గడలం బడుసగండంబులై
వచ్చు విహారశైలములు వాని పరిశ్రమకేళిఁ గేలికిన్. 44

క. ఉఱడు సుమీ ఖండా గొని
నఱక నయోమయములగు ఘనస్తంభములం
జిఱుతలు గొట్టఁగనగునని
చిఱునగవునఁ జూచుఁ దెచ్చి చెంగట నిడినన్. 45

ఉ. ఆతనిశబ్దభేదిశరమచ్చటికిం బఱతెంచునంచుఁ గా
దా తమయాంధ్రు బిడ్డలును దారునరాతులు మౌనులైనవా
రాతత చక్రవాళగుహలందు వసించియు వానియస్త్రవి
ద్యాతిశయంబు పేర్మిఁ దరమా కొనియాడఁ బినాకపాణికిన్. 46

క. కొలఁకులఁ గొండల కెలఁకులఁ
గలకలములు రేఁచు రాచకన్నెలఁజలిమం
దులవారల బలవైరులఁ
బొలుపార్పుచు నతని చెలువు భుజములబలువున్. 47

క. ఈరీతి జవ్వనపుసిరి
నేరఁ బురంజయుఁడు వీరశృంగారమయా
కారుండై సుకుమారమ
హారాజుం గొల్చియుండ నట వచ్చి వెసన్. 48

గీ. త్రెంచి గురువెందపేరు క్రొమ్మించువడిన
మేఘమనఁదోఁచు నొకకట్టి మేనియెఱుకు
ప్రాఁతనెత్తుట మక్కుడు వట్టియున్న
యంపఁ..మి ముందఱంబెట్టి యడ్డపడియె 49

క. పడియున్నవానిఁబతియే
ర్పడఁ గని యిదియేమి లేవరా రారా యె
క్కడివాఁడవురా మఱినీ
యడవియు నీపేరుఁ జెప్పరా వినవలఁతున్. 50

ఉ తుప్పలు పట్టెనేర బలుతూపులు నీగురిగింజదండకుం
దప్పితివేమి నావుడు నతండును దిగ్గనలేచి దేవరా
యిప్పటి కమ్ములింత చెడియెం గడినోరికిఁ బోదు దూపకుం
దిప్పలనీరె మాగురుల తీయనిపాలురుచింప వేమియున్. 51

క. మంచి గురిగింజపేరును
బించెపు తలపూవు నింకఁ బెట్టఁగడఁగనా
యంచు శిఖిబర్హంబును
ద్రుంచి శరములెంచి రాజుతో నిట్లనియెన్. 52

సీ. ఇది కొండకోనదాఁటు నిట్టిఁ జందురునిట్టిఁ
దలఁకించి తాఁకిన ములికిసామి
యిది బెబ్బులికినల్కి యెదవడ్డ యొకలేటి
బాలెంతఁ గాచిన కోలయొడయ
యిది కాఱుపోతుతోఁ గదసిన జముపోతు
నడకించి గెడపినయమ్మురాజ
యిది సింగము నడంచి యేనుఁగు విడిపించి
దొరవాసినిల్పిన తూపుజయ్య

గీ. కడమవియు నిట్టవియ కాని కడమ లేదు
నల్లపెనువాకులోఁ గొన్న తెల్లనీటి

యేటిబడిఁ గానఁగాతు సన్నెఱుకు లెల్ల
పీరుఁడని కొల్వవీన గర్వింతుసయ్య. 53

క. పులుఁగులలగుడులుగులముగఁ
దెలుఁగుల పిడుగే కలములయెదనుడుకు చివం
గులగొంగ బెబ్బులులవిది
బలుమెకముల గండమనఁగఁబడు నీతూపుల్. 54

ఉ. తాఁకిన యమ్ముగాక గుఱిదప్పిన యమ్మొకఁ డెత్తివచ్చినం
గూఁకటులెత్తి కొట్టుదుము కుఱ్ఱలనైనను వీళ్ళలోనన
ల్వీఁకలవార మేమివియు విల్లునుబట్టి పొలంబు మెట్టియే
పోఁకెటువంటి సంపదలుపోఁ జనుదేరము వీటి కెట్టిచోన్. 55

ఉ. కానకు సంపతప్పెఱుఁగు గబ్బి మెకంబులు సేరఁ గారుపో
తేఁనుగుదాయ యెల్గుపులి యేసినయేటుసివోయెఁ బోయిన
న్మానితి నిస్సిరోయనుచు మాకులకాయికమైన వేఁట య
య్యో నెలనుండి తుప్పు దిసకుండును తూపులు వేయి నేటికిన్. 56

క. నిను గడచిన తలిదండ్రులు
వినినాదుందుడుకుఁదుడిచి విడువంగలరే
యని యేనెరికిఁ జెప్పక
చనుదెంచితి ననఁగ వచ్చె శబరబలంబున్. 57

ఉ. వచ్చి యిదేమి చెప్పకిటు వచ్చితి వప్పుడు కాఱుపోతుతోఁ
బొచ్చెపు బొల్లి వెల్లి మెకము ల్దమ బెబ్బులిఁగూడి గూడెము
ల్సొచ్చి తిసంగఁ జెంచు లొకచొప్పున నూర్గురువోయి రన్నవాఁ
డచ్చెరుపాటు సిగ్గు నొలయన్వినుచుం దలవ్రేలవైచినన్ 58

మత్తకోకిల

అప్పుడాసుకుమార భూవిభుఁ డాతనింగని మాయలం
గప్పి రక్కసు లిట్లుచేసిరి గాక యొండెనెటు దాఁ

దప్పునో మెకమూరు సొచ్చునొ దండిబంటవుగావె నీ
చొప్పు చెప్పక చెప్పుచున్నది శూరవిద్యల నేరుపున్. 59

ఉ. మాయలు మాపురంజయుఁడు మానుచు మానఁగనేల నీకు నీ
బోయిలకేమి వేఁట గడివోయెనె యేటికిఁ జిన్నవోయె దం
దేయలుఁగమ్ము చక్కఁడచు నేపులినీ విలుద్రుంచుఁ బోయిరా
రాయిటువంటివా మతులు రాక్షసమాయల కీవు కర్త వే. 60

క. అని వాని మరల వేఁటకుఁ
గొనకొనఁగా నూఱడించి కులధర్మము త
ప్పని పౌరుషాభిమానం
బున కెంతే గారవించి భూవిభుఁ డంతన్. 61

చ. అడవుల నీవు దాల్చు నడియాలపు సొమ్ముల కీడుగాని మా
తొడవులు వెట్టుమంచుఁ గృపతో మణిమంజుల భూషలాదిగాఁ
నుడుగర లిచ్చినన్వగచు చొయ్యన నంది యతండు సైచుమీ
బడవని తప్పనేఁడు వెతఁ బట్టకమానితి వేఁట కానికల్. 62

ఆ. ఏఱి వెదురుజాతి యేనుంగుతలజాతి
పందికొమ్ముజాతి పాఁపపడగ
జాతిగనిన పూససరకుల కొకొక్కఁక్క
యిల్లు చూపు తెత్తు నెల్లిసామి. 63

క జల్లులు పునుఁగు జవాదుల
పిల్లులు సింగములపులులు పిల్లలు మాకుం
గొల్లలని తెచ్చియిచ్చినఁ
గొల్లలుగావన్ని చదురు గొడఁగులు వినవే. 64

వ. అని మెచ్చునచ్చెరువుం దగవు నగవుందేటపడ మాటలాడి మఱునాఁటివేఁట
పయినంబున కాయితంబు గమ్మని క్రమ్మర రాజుచేఁ గుమారున కనుజ్ఞ
యిప్పించి యంపించుకొని తన బలంబుతో వెడలి పురోపకంఠంబున

విడిసి రెండవనాఁటి ప్రొద్దుపొడుపుఁ గోరుచుండె. జనవిభుండును హజారంబు పేరోలగంబు చాలించి యందఱ ననిచి యనుసరించి తన యుండురా నంతిపురంబున కరిగి సముచితప్రకారంబునం బ్రవర్తించె. పురంజయుంకును నద్దినశేషంబును నాఁటి నిశావిశేషంబును గడపి కడ పటఁ గాల్యకరణీయంబులు నడపి మృగయావిహిత వేషభూషితుండై దండితనంబున. 65

గీ. కడలియల్లుని కుడికన్ను పొడుపుఁగొండ,
యెక్కునెడ నుత్తమాశ్వంబునెక్కి పౌర
మృగయులేతేఱ వెడలు నమ్మేటి మగని
సంభ్రమంబునఁ గని నిశాచరవిభుండు. 66

గీ. నిన్న మీయయ్యవలె నుంటి నెఱతనమున
నేఁడు మాయయ్యవలె నున్నవాఁడ వెలమి
నన్నిబాగులు నమరుగాయయ్య నీకు
నని కొలిచిపోయె నవ్వించు నడవితలకు. 67

మ. గహనంబుం గనుపట్టె మమ్మనఖిలాకారోపకారప్రథా
మహనీయంబులఁ జేసి యిట్టు చరతామాంద్యంబునమ్మంతెనా
నహహా యమ్మిగు లింతయుంబెరిఁగి సత్యంబంటి నన్గల్పక
స్పృహసేవం దలసూపునో యనఁగ నట్లేయున్న భూజంబులన్. 68

క. ఆవనము చూచి యుత్సా
హావిష్కృత మృగయు సాధనావళుల కథ
ల్మీవారును మావారును
గోవిదశబరయని రాచకొడు కటఁజొరఁగన్. 69

వ. ఖిల్లవల్లభుం డెల్లరం జూచి సాధనధనులకా విచారించి. 70

క. ఇందుండి పోగువారుం
దం దందందు న్వలల నుట్టుఁడ వ్వలియోదా
లందుండి కావు గప్పుడు
ముందటఁ గెలకులను నిలిచి మున్నలక మెయిన్. 71

క. పొంకించుఁడు మీయిఱ్ఱులఁ
గొంకుల సీసంపుగుండ్లఁ గొమ్ముల నురులం
బొంకించి దిగువగాలి వ
లంకుల బండంగి బండ్లు పఱపుండనుచున్. 72

క. తనవారు రాజువారును
బనిహరువును దెలుపుకొనుచుఁ బదరక యెన్నం
డొనరించిరొ యన నన్నియు
ననువుపఱచి కడలవెనుకయయి యతఁడరిగెన్. 73

క. తెర దీము బోను వేఁటల
వరుసలెఱిఁగి పెద్దలాగు వరుసగ నడుపం
జొరఁబఱవఁ బొడుచునడువం
దరుణవయశ్శబరులరరె తగుననిపించెన్. 74

ఉ. రాజకుమారుఁడు న్నయనరంజకమున్మృగయావినోదము
భ్రాజిలఁదేజిఁ దోలుచుఁగొలంకులఁ దేలుచు వేడ్కనేలుచుం
భూజపరంపరాపరిధి భూషితమై బయలున్నచోటరాఁ
గా జగడంబు చేసె నొకకందువఁబందులు జాగిలంబులున్. 75

సీ. కఱచినచెవిగూబ గరుసూడిగం డెండి
బెళకపైఁబడి త్రిప్పుకొలిపె గున్న
బిరుదందుపీఁ పెక్కపెడతఁల నమలంగ
సుడిసి కంపలఁబెట్టెఁజుల్లరంబు
కుక్కకూఁతలువెట్టికొనఁ బీఁటవదలక
గడకంటఁగాఁజూచె బడియపంది
లాఁచితప్పిన జాగిలము గొట్టుకొట్టునఁ
గూడినపిఱిఁ గూల్చెఁగొమ్ములాఁడు

గీ. వీరచేష్టితసూకరసారమేయ
కరినసంకులకలహంబు కన్నుదనియఁ
జేసెనౌరౌర యని సంతసించెఁ గెలన
మనుజనాథకుమారుండు మఱియుఁజూడ 76

ఉ. బయ్యనబాళి తేజులొకపట్టునఁ బట్టినవారు పట్టెదల్
డుయ్యఁగఁదూలి బిట్టొఱలి డొల్లఁగఁ గొన్నిటిఁబట్టెఁ బందులం
దయ్యములం దయాంతకుని దంష్ట్రిలు వేర్పడి పట్టినట్టుల
క్కయ్యము...త్తు...విన్నవిహగంబులు డేగలబారిఁ బాఱఁగన్. 77

ఉ. మాకుఁ బతంగభావ మజుమన్నన మున్న లభించె నింక మా
యాకలబల్మి లోకమున కెక్క శశిత్వముఁ దాల్తుమంచునే
మో కిటి కుర్కురధ్వనులు ముట్టినఁ బాఱు శరంబులన్నగు
శ్శాకదఁ బట్టియాడె నటులార్పఁగ నేర్పఱు లోర్పు లేర్పడన్. 78

వ. వెండియు. 79

ఉ. గండొకపందితోఁక తొడుకం గడకం బెఱపంది గొట్టిన
న్మొండియమూడి కుక్కతల...బడ నవ్వరాహమా
యండలఁ జెట్టు గుట్టయన కన్నిటిరాచిన నూడదయ్యె వే
లెండటు గొన్నదాని కొల దీనికి టంటెననంగ నెల్లరున్. 80

ఉ. బండెడ నొంటికా డొకమహోద్ధుర కుర్కురమ స్తకంబు దాఁ
జెండుచు...గయజెండిన చెంగట జింక దాఁటకా
బొండుగు బొక్కనం గఱచి బోరగిలంబడ వ్రేలెఁ జూడఁగా
రండిడి రెండుగాఁ దెగియు రాఁబెనఁగెం దనపిఁట వంతనన్ 81

వ. అంత. 82

ఉ. చీఁకటి ముద్దలన్...జీవములుంగనినట్టు లున్నయా
వ్రేఁకనిపందులన్ శబరవీరుఁడు బల్లెములంది క్రుమ్మి చే

బాకులగ్రుద్ది ..పయిపాటుల నొచ్చియు మెచ్చు రేఁచఁగా
నేకటదీఱఁజూచు మనుజేంద్రకుమారునితోడ వేడుకన్. 83

ఆ. వీరనామశబరుఁ డోరాచవేలఃప
యెగువ జొంపమెకము దిగువ వలలు
నాల్గు దెసలమూగె నను జూడు మొకకోల
యొకటిదాఁకి రెంటి నోర్వవలయు. 84

చ. అని విలువంచి యొక్కొకమహాకిటిఁదూఱఁగ నేయఁ దూపు దాఁ
కినవడిఁ జెంతనున్న యెలుఁగే పులియే యన కోరకోరలం
దునియలుగాఁగ నొక్కొకటి ద్రుంచి శరవ్యవహారముల్వడం
గనికని యింద్రవాహనుఁడు గన్నులమెచ్చెఁ బుళిందవల్లభున్. 85

ఆ. ఇఱ్ఱిఁగూడఁ దఱిమి యెగసినఁ దోడన
నెగసిపట్టి వ్రాలె నిలకు నొకఁడు
చినిఁగిగొంతువగులఁ జేకత్తి జళిపించి
కెడపెఁజేఁగటారిఁ బొడువ కొకఁడు. 86

క. కే....వు...న కొకొాఁడేలిక
పాదముపై నానవెట్టి పైఁబడుపోతుం
జేదోయిఁగొమ్ము మోరయు
వే దొరకంబట్టి యెక్కవిఱిచెం బెలుచన్. 87

ఉ. పంగిడిఁజిక్క కోదములపజ్జలఁద్రొక్కక మూకఁదోఁటు మా
తంగము నొక్కఁడొంటిమెడఁదట్టి పయింబడి సల్పియుల్గుచే
నంగమెఱింగి లేఁదొరిజ యాసయుగా దొడబడ్డ యెక్కుఁడే
ముంగులవేఁట కింతనిపుణుం డిఁక లేఁడని మెచ్చనెల్లరున్. 88

ఆ. ఇవ్విధముననెవ్వఁ డేవేఁట మెప్పించె
వానివానిఁ బిలిచి మేనకాని
వేడ్క పెచ్చుపెరుఁగ వేఁటాడ నెడలేక
యుండు నప్పురంజయుండునంత. 89

క. మేలుర యని వివిధాయుధ
జాలురఁజూడక భుజైకసాధనమృగయా
శీలుర సాహసపథజం
ఘాలురఁ జూచుటయు సన్నగైకొని వారున్. 90

వ. విక్రమించు సమయంబున. 91

సీ. ఒకచేతనెలుఁగొంటనొకకొండ గొఱియఁగా
నొకఁడు త్రిప్పెడుత్రిప్పుడొఱపుగాలిపె
నొకచేతఁ బులి నొంట నొకచేఁత లేడిగా
నొకఁడెత్తు నెత్తికో లొఱపు నిలిపె
నొకచేత సలు గొంట నొకదుప్పికొదమగా
నొక్కఁడూఁచిన యూఁపులుప్పతిల్లె
నొకచేతఁ బో తొంట నొకమున్నుఁబెంటిగా
నొక్కఁడార్చినయాట లొప్పిచెల్లె

ఆ. నొకఁడు నొకటఁ దెగక యొకటికిఁదెగకొక్కఁ
డోపి రిట్లు రెంటి కొకఁడ చాలి
వలలఁగల మెకాల వలకేలు డాకేలు
బిరుదు గిరుదుఁ బంచిపెట్టుకొనఁగ. 92

ఆ. వీరు లిట్లు మెఱయ వేఁటలోఁ దనయిట్టి
కొంకి గుండువీడి గుంపుఁగలయ
గుండువడ్డ దీము కొలములోఁగూడెనం
చొక్క బక్కయెఱుకు చక్క నగియె 93

ఆ. వారికిచ్చె నల్లవానికి విభుఁడీగు
లిచ్చెఁజూడు పుణ్యమెట్టులుండె
నడిచియడిచి దంచినమ్మకు నూరక
యున్న యుమ్మకొదవె నొక్కఫలము. 94

వ. ఇదియు నొక్కొక్క దిక్కునం జక్కటి యనిపించు నదియట్లుండె 95

క. చూచియు నిచ్చియుఁ దనియని
రాచూలికి వేఁటలాడరాఁ బ్రొద్దేదీ
యీచక్కటి నన నత్తఱి
వాచాగోచరముగాని వగ సంధిల్లెన్ 96

సీ. చౌరబడ్డ ముంగిస యురివడ్డ గరిమిడి
మునుపుగాగొల్లున మునిగిపోవ
జోడించిన సివంగి కేడించుకొను నిఱ్ఱి
వెనుకగాఁ గుట్టూర్పు విడిచి త్రెళ్లఁ
జూపివేసిన డేగ చోపి లేపినపుల్లు
మీఁదుగా మీఁదనే మిడిసి పడఁగఁ
గఱవఁద్రొక్కిన కుక్క వెఱవకెక్కిన పంది
క్రిందుగా బాణముల్చింది కూల

గీ. మృగగళగ్రాహికరముల బిగువు వదల
గల వలలు మీటువారు మూర్ఛల మునుంగ
మిట్టి వినువీథిఁ దిరుపులు గట్టికట్టి
రణహరులు రాఁగ నొక మహానినద మెగసె. 97

క. ఏమనఁగవచ్చుఁ దద్ధ్వని
చే మిగిలిన వేఁట ముగిసెఁ జేద్పుడరితరుల్
దీమసము వీరశబర
గ్రామణి యొకఁ డొంది యప్పురంజయుతోడన్. 98

క. గబ్బిమెకములని మున్నే
నబ్బురపడి చెప్పినట్టి యానాల్గిటిలో
బొబ్బమెకము రొద సుమ్మది
జబ్బా వినుమనఁగ నాకసముదెస నంతన్. 99

క. తిర్యఘ్న మృగఘ్న నర
ఘ్నార్యఘ్ను లనంగ నలుపు రసురలు వీరో
హార్యంశ జనిత వించే
హార్యక్ష వ్యాఘ్ర ఋక్ష హారిరిపు రూపుల్. 100

ఆ. అనియు వీరసాధ్య లజ్జభూవరశక్తి
ననియు సింహరూపు నట్టహాస
మతఁడు వలసినప్పు డందుఁ దిర్యగ్జాతి
ననియు వేగ వారిఁ దునుము మనియు. 101

క. వినఁబడిన మేలు కాకని
ధనువుం దూణీరయుగము దాల్చి కటుజ్యా
నినదమున దెసలు వసమరఁ
గనుగడలెల్లెడలఁ ద్రొక్కఁగా నునుఁగెంపుల్. 102

క.. ఘోరాజికౌతుకంబున
ధారాకౌశలము మెఱయఁ దనతేజీనా
లేరాచరౌతు వీరర
సారాధనచతురుఁడచట నాడింపంగన్. 103

సీ. సింగంబు పఱతెంచి ముంగోలలఁ దెమల్చి
నమలి కార్పోతుల నుమిసికొనుచుఁ
గాసరం బరుదెంచెఁ గేసరిప్రకరంబు
శితశృంగకోటులఁ జెలఁగికొనుచుఁ
బులి తాఁకుదెంచె నెల్గుల పొట్టలవియఁగాఁ
దిగిచిమూరొ్కని మోర ద్రిప్పికొనుచు
ఋక్షమేతెంచెఁ దరక్షువ్రజకిశేబ
రములు రూపఱఁ ద్రొక్కి చమరికొనుచుఁ

గీ. ఖతితమృగసంఘ సంకీర్ణపథమువట్టి
విక్రమోన్మత్త చేష్టితోపక్రమంబు

దప్పి తమలోనఁదమకుఁ దత్తరపుటలుక
తోనపుట్టినఁబుట్టుఁబో పీనికనఁగ. 104

ఉ. అంతట మూర్ఛదేఱి పులియా యెలుఁగా యెనుపోత సింగమా
కాంతుము పీనిగర్వ మని గ్రక్కునఁ బైఁబడఁ బాఱు వేఁటకా
అంతకుప్రోలికిం బఱచు నంతకుఁ జూడక దివ్యబాణవి
క్రాంతి నడంచెఁ దన్మృగవిహార ధరత్వము రాకుమారుఁడున్. 105

ఉ. రక్కసులుం భయంపడక రాసుతుపై నొకఁడింద్రదంతియై
యొక్కఁడు మేఘమై యొకఁడయోమయపర్వతమై యొకండు దాఁ
దెక్కలి మిత్తియై యరుగుదేఱఁగఁ జూచి యతండు వీరి యా
చిక్కులు సాగనీగి బలుసేగి బలంబున కంచుఁగ్రక్కునన్. 106

పంచచామరము. సమంత్రకంబుగాఁగనైంద్ర సాయక ప్రయోగమ
క్కుమార శౌర్యశాలిసేయఁ గోటి కోటి బాణము
ల్క్రమక్రమోదితంబులై వికారి దైత్యమాయలన్
గమర్చి తచ్ఛిరంబు లూడ్చెఁ గండశైల భాగముల్. 107

క. కొండలు వోలె సురారుల
మొండియములు గూలె రాలె ముమ్మరముగ నా
ఖండలతరుప్రసూనము
లొండొండ విరించినందనోక్తులు సెలఁగన్. 108

వ. అంత. 109

శా. వీరుం దవ్విలుకానిఁ గాంచి యొదయా వేఱొక్కఁ డున్నాఁడె ని
న్నేరూపంబుననైనఁ బోలు దొర నీవే రాజవు ప్రౌఢవు
న్వీరింగాచితి విమ్ములన్నగుచురా విన్నంది పోరాడఁగా
వారిం బాచితి వింక నొక్కవర మే వాక్రుత్తు మాకిత్తువా. 110

క. ఈ కానవచ్చు గీములు
నాకూరిమిగూడె మచట నాలుగుగడియల్

సీకోడం్రదను మనుమల
సీకన్నులఁ జక్కఁ జూడ నిలుచుట తగదే. 111

క. ఇది వరమని పావలతోఁ
బదమోదలఁబెట్టికొనిన వానికభీష్ట
ప్రదుఁడుగఁ గదలి కకుత్స్థుఁడు
తదుపాంతవనాంతరమునఁదగు మైనిలిచెన్. 112

క. పతితోడఁ బలికినంతకు
నతఁడును నధికముగఁబట్టె నటవీవస్తు
ప్రతతులులుపలుగసుతుల
న్నతులర్పొ్రక్కించె నతని చరణంబులకున్. 113

ఉ. రాకొమరుండు నందఱకు రత్నమయాభరణాదులిచ్చి యా
యాకొలఁదిం బ్రియోచితములాడి తదీయసపుత్రమానినీ
లోకమునంచి యన్యులఁజెలో యని వీళ్లకుఁ బంపి సూపకా
రాకలనోపపన్న మృగయాపల భోజ్యరసైకతృప్తుఁడై. 114

వ గంధోదకంబులఁ గరప్రక్షాళనాదులనివర్తించి శతపదగమనంబునకై
నడయాడునప్పుడు. 115

ఉ. క్రేవల వేఁటకాండ్రు దనకింపక డింపక వెక్కుఁబాకులం
బోవుచు మాంసభేదముల బోనము లాయితమైన దాఁకనా
యావిధు లాచరించి యవియన్నియు దేవరకెక్కునట్టి సం
భావనసేసి తారు మఱి బంతులుసాగి భుజించుచుండఁగన్. 116

ఆ. చూచి చూచి నగుచు లేచినవారిఁగూ
ర్చుండ నానతిచ్చు చౌయ్యనొయ్య
వెడలె బంతిబంతి వెంటఁ దాంబూలగం
ధములు విషిన సౌరభములగద్గుమ, 117

ఉ. ఎల్లరుఁ దృప్తులైన వెను కించుక సేపట విశ్రమించి రా
గిల్లినమూకతోడఁ దమకింపని యానముతోడఁ భిల్లరా
డ్వల్లభలక్ష్మితోడ వనవల్లభుతోడ జయంబుతోడ భూ
వల్లభనందనుండు హయవల్గనమొప్పఁగ వచ్చె వీటికిన్. 118

క. వచ్చి హజారంబునకు
న్వచ్చి హరులఁజూచు రాజునకునానతుఁడై
తెచ్చిన వివిధసువస్తువు
లిచ్చిన యెఱుకుదొరతోడ నిడియెన్మ్రోలన్ 119

మ. సుకుమారుఁడును గన్నులం దనుప రాసుల్వంశజాతాది మౌ
క్తికముల్ గాంచెఁ గటాక్షముల్మృగమదాదిద్రవ్యసంపత్తిచా
యకురానిచ్చె వినీతుఁడై తనకు సాష్టాంగప్రణామంబు చే
సి కరంబుల్మొగిడించునయ్యెఱుకుఁజూచెం జూపులాపోవఁగన్ 120

క. సకలవిపినాధిపత్యము
నకుఁబట్టముఁ గట్టికొమ్మనాసభ నని వా
సికిఁ దన గారుత్మతనా
యకమణిహారంబు యిచ్చియంపెఁ బొసంగన్. 121

ఉ. ఆ తరువాతఁజూడఁ బరియత్తెపుఁ జేతులు రిత్తిబండ్లు ద
ట్టీతలచుట్లుగాఁగ మగిడించిన పట్టెడపైఁడిత్రాళ్ళునై
యాతల వేఁటకాఱునికి యారసి రెండిడి యేమియన్న న
య్యాతలఁచంగనాకు వెఱపై గరుపాఱెడుమేను వింటివే. 122

గీ. కానకకుఁ దేఱఁ జనిచూడఁగా జవాది
పిల్లిలోనుగ మాపీటఁబెంచివవియుఁ
బెద్దనిద్దురఁ గనుమూసి పెట్టియుండె
పీరిజంతువు లీల్గుట వింతగాదు. 123

క. ఆయా మెకములసంతిక
మాయడవుల మొలువఁబెట్ట మాకున్వాలసెం
బోయెనొకకూఁతనన్నియు
నాయాలము వేయుగన్నులతఁడగుఁ జూడన్. 124

ఆ. అని పుళిందరాజునమ్మహారాజుతోఁ
బలుకుచున్నయపుడ కలదుకలదు
కంటి కంటి నదియుఁ గన్నులుచల్లఁగా
ననుచు వచ్చె నిర్జరాధివరుఁడు. 125

సీ. వచ్చినమానవేశ్వరుఁడుఁ గుమారుండు
దానసంభ్రమసముద్ధానవినతు
లాచరించియు విమానావతీర్ణుండైన
యా త్రిలోకీనాదుఁ డాదరంపుఁ
బరిరంభణంబులు వడిసీయ నతనికి
నర్ఘాసనంబిడి యర్ఘ్యపాద్య
ముఖ్యపూజలు తుదముట్టఁ జేసియు బృహ
స్పతిసర్వదిక్పతిప్రభృతులకును

గీ. దగిన సత్కృతులు సలిపి తదనుమతుల
సముచితాసనములనుండి యమరరాజ
సేమమా మీకు మీరు వేంచేయుటెల్ల
మా తపంబులపంటయై మనుపఁగాదె. 126

వ. అని సుకుమారుండు పలికెఁ బలికిన సునాసీరుండు. 127

ఆ. మీ తపంబులయును మా తపంబులయును
మేనిపంటలెల్ల మేనుదాల్చి
మనుజనాథ మిమ్ము మమ్ముఁ గృతార్థులఁ
జేయనీక కుత్స్థుఁ డాయెఁ గాదె. 128

శా. ఏతేజం బితఁ డయ్యె నీవెఱుఁగవా యీమాట యిట్లుండె ర
మ్మా తాత్పర్యముతోడ నీ వడిగెదమ్మా మామ మాసేమమే
నీతో నీయెఱు కప్డు సెప్పనది దానిం దేట గావింతు వి
న్మా తిర్యఘ్నమృగఘ్ను లిద్దఱు నరఘ్నార్యఘ్ను లన్నిద్దఱున్. 129

సీ. ఉగ్రుఁడన్న సుతమణిగ్రీవయు మదార
తయునను గంధర్వతనయలందుఁ
గవలుగవల్గాఁగఁ గాంచిన కొడుకులు
వారు నల్వురు బ్రహ్మవరమహోను
భావగర్వితులు దీపధ్వజనెచ్చెలు
లుమ్రప్పండ్రలోపల మొదలివారు
దేవాసురావధ్యులేవేళ కేరూపు
వలసినఁ దాల్తురు వారిలోనఁ

గి. పెద్ద తిర్యఘ్నుఁడే బొబ్బవెట్ట వినిన
దేవతిర్యఙ్మనుష్యులు తీఱవలయు
ననఁగఁ బోయి తిర్యగ్జాతి యడఁగవలయుఁ
గోరినపుడనియజు వేఁడికొంతమనిచె. 130

క. వాకటు దిరుగుట విధిమా
యాకృత మపుడతఁడు తిర్యగాకారధరు
ల్రాకాసులు వాహనములు
నాకూఁతకుఁ జెదమి వేఁడిసది పదిలముగన్. 131

గీ. వరుసఁ బెఱమువ్వురజరరవహ్నిశిఖల
మృగమనుజమౌనిసంఘము ల్దెగియెఁ బెక్కు
వీరికిని నామములు రక్తవృష్టితోడఁ
బుట్టునెడ భూతముఖములఁ బుట్టినవియు. 132

మహాస్రగ్ధర- హరిఁగొల్వఁ బోయి యే మాయనఁగనియతఁ డొంటానతిఁగాఁదదాజ్ఞా
పరతంత్రాఁగా మృగైకప్రభువయి పులియై భల్లుకంబై మహాకా

సరమై భాగీరథీపార్శ్వమున నడవి నచ్చండరాకాసు లున్నా
రిరవై సింగంబు దా బొబ్బిడిన గెడసెనందెల్ల తిర్యక్కులంబున్. 133

క. అచ్చటికి మనపురంజయు
వచ్చుటయుం గంటి మావరంబు వినియు నీ
నిచ్చలపు రౌతు తేజీ
నొచ్చుటలే దదికదా వినోదపుఁ గతయున్. 134

గి. వాహనంబు నారొదఁ జెడవలవదనుచు
నాఁడు నిజబలరక్షకై వాఁడువేఁడెఁ
దమవి యని పేరుగుచ్చునిదాన సకల
వాహనములకు దైవమా వరము నిలిపె. 135

క. ఆదనుజవధము సేమము
గాదే మిన్నంది చూడఁ గంటిమి తేజః
ప్రాదుర్భావము గలిగిన
యీదొరనాతూపు దొడిగి యేసి గెలుచుటన్. 136

మ. అని జంభారి కకుత్స్థుఁ జూచి నుతిసేయంగా వినీతుండయై
జననాథాగ్రణి మీకు సేమమనఁ గర్జం బొనె మేమేల య
ప్పని ద్వీపధ్వజుఁ డెవ్వఁ డాప్తులుగ ముప్పంద్రెవ్వరెచ్చోఁ గనుం
గొనగల్గె స్థారినీశుఁ డేమనియె నాకుం బోలినం దెల్పవే. 137

తరళ—అనిన వజ్రి నృపాలకా వినవయ్య దీపపతాకుని
న్వినిచెదం గలనామరాక్షస వీరమౌళికి నగ్ని జి
త్తనయకుం దరళాభిధానకుఁ దాఁగుమారుఁడు వాఁడు త
జ్జనని తజ్జననంబు నప్పుడ చక్క నెక్కె విమానమున్. 138

క. అనవుడు రాజును దేవా
తనకది యొకవ్రతమొ వంశధర్మమొ యెక్కం

బనియేమి విమానంబది
తనయునిఁ గని యనిన దేవతాపతి వరుసన్. 139

చ. వినుమది నాకలోకమున వేఁడుకకత్తియ దానిదానపీ
జనననిదానమొక్కముని శాపముఁజెంది సుతోదయంబునం
జునునది యయ్యెపుట్టిన దెసంబొసఁగెందరశాఖ్య దానికి
న్మినమిన మంచుతోఁ దొఁలకు మించునఁ జంచలయట్ల తోఁచుటన్. 140

గీ. దానిననుపుకాఁడొక్క గంధర్వుఁడెల్లఁ
దెలిసి సుతుఁగాంచుతఱి వేచి తేఱఁజువ్వె
వెస విమానంబునెక్కె రక్కసులతోడి
తొడుసుడిగెనంచు నది తొంటియొడలితోడ. 141

ఉ. ఆపగిది న్విమానవతియై యది వేడుకగానితోఁ జనం
దాపముఁగోపముం గదుర దాని నభోగమనానుధావియై
యాపొలమెల్లఁ ద్రిప్పి ఘనుఁడై యమరావతి కంటివచ్చి తా
నే పవిధారి బారిఁవడియెం బగబట్టెను దత్తనూజుఁడున్. 142

ఉ. ప్రేముడిఁ దారశేయుఁడని పేరిడియగ్నిజితాహ్వయుండు మా
తామహుఁడెత్తి పెంచి కలదానవుపాటెఱిఁగింపఁ బూవ్వె వాఁ
డేమొనరించు విఘ్నవిధులెక్కడఁద్రొక్కెనొ యద్రికన్యకా
కాముకుఁ గొల్చినాఁడు చిరకాలతపంబున నాజపంబునన్. 143

గీ. వజ్రమెదురెక్కకుండంగ వరము వడసె
వచ్చు యమదండమనకుండ వరమువడసె
వరుణపాశాదు లుడివోవ వరము వడసె. 144

..............................

క. ఈవిధమునఁదనకెదురన్
దేవాసురవరులు వివశనిజసాధనులై
పోవందీపధ్వజుఁడై
ధా వెలుఁగంభర్గవరకదంబము వడసెన్. 145

సీ. అగ్నిజిత్తమరింప యమజిత్కుబేరజి
ద్వరుణజిద్వాయుజి ద్వసుజితాత్మ
లను త్రిశిర త్రిశూల త్రిజిహ్వ త్రిబా
హు త్రికంఠ త్రికర్ణాహ్వయులును
గిరిరథో క్షరథ మేఘరథ సింహరథ మ
హారథ విరథ రథాభిధాను
లనుగల్య కరిసవాలకరాల కర్కశ
కామాంధ కలి కాకనామధరుల

ఆ నతఁడు సఖులఁ జేసె హతచతుష్టయముతోఁ
ద్రింశదాప్తసంఖ్య దేజ వినుము
వారి మహిమలెల్ల ఘోరాహవంబున
గురుఁడు నీకుమారకునకుఁ దెలియు. 146

క. కలరయ్య ఘూసరోమా
దులు నల్వురు జోదులఖిలదూష్యవ్యాపా
రులు వారి చతుర్విధబల
ములు ప్రబలము లతఁడు బన్నములు వఱపంగన్. 147

ఉ పోయి పయోధిశాయి పరిపూర్ణతరంగభవానిలానుసం
ధాయి నపూర్వచేష్టితవిధాయి సమస్త తపస్విమానస
స్థాయి రమానపాయునకదా కని యక్కడ చెప్పినార మ
మ్మాయి ననుంగకుత్స్థుఁడనుమా మఖవా యనియెన్నృపాలకా. 148

క. అనుటయు నిట్లను టేమను
టని యే నడుగంగ దేవుఁడస్మత్తేజం
బునిచితి వికుక్షిగర్భం
బున నది యతఁడయ్యెనతఁడ పోయెననియెన్. 149

వ. అని యింద్రుడు పలికిన నమ్మహీవిభుండు. 150

క. తన తనయుఁ బిలుచువాఁడ
యీ్యనజని మోహమున నాఁతఁడీశ్వర తేజో
జనితుఁడని మఱచి యీపా
పని నే నెట్టనుతు నసురపైఁబడ హరితోన్. 151

ఉ. ముందఱ వేఁట కంపి కడు మోసము చేసితి నిప్పుడేను జూ
తుందనుజాతుఁ డంచు మది దుందుడుకొందఁగ నాకసంబునం
బందిరి వెట్టినట్టు లెలప్రాయమునంబలవజ్జయంబు సూ
పందెగి నేర్చి పుణ్యపరిపాకమున న్ననుఁ జేరియుండగన్. 152

క. మగుడంగ నిందుఁబొమ్మనఁ
దగునే యీయసుర యేకతముఁడే బహుద్రై
త్యగణావృతుఁడఁటె యందో
డగుటకు నెవ్వఁడౌకొ యింద్రుఁడని దిగులొందన్. 153

ఉ. ఆయన యాయనాలపను నాననదీనత గాంచి యయ్యభి
ప్రాయమెఱింగి లెస్స చెవిఁబెట్టఁగదా కత దానికేమి ము
న్నేయది యేయెడం గలిగెనే నునుబొజ్జకు నీవెఱుంగవే
యాయనవద్యతేజ మితఁడౌటకు సందియమంది యోడెదే. 154

ఉ. ఒండొకఁడైనఁ బ్రాక్పరిచితోగ్రబలాభ్రసరస్ఫురద్విష
ద్భండన పండితు న్ననుఁ గదల్పక పీఁటఁడిఁగాఁ జుమయ్య యి
క్కొండికఁ బిల్వ నప్పగఱఁ గూల్పఁగ నీతఁడకాని చాలఁడ
న్యండని యొప్పఁజెప్పి తదనుజ్ఞను దెచ్చి కకుత్ స్థుఁజూపినన్. 155

క. అతఁ డితఁడు వృషభమగునే
ధృతికని శిఖిముఖులఁ జూచె దిక్పతులు బృహ
స్పతిఁ జూచిరి గురుఁడు శత
క్రతుఁ జూచె బలారితత్పరత్వమ చూచెన్. 156

వ. చూచుంగాకేమి. 157

సీ. మకుటంబు మాయమై చికిలికొమ్ములు పుట్టెఁ
బెనుదోరమై పెద్దపెరిఁగె మొగము
రెండుండి పెఱకన్నులుండక పొడలుబ్బె
సోఁగలై యడ్డంబుసాగె చెవులు
కంఠహారము డాఁగి గంగడోలుదయించె
వెడలుపునిడుపునై మెడపొసంగె
మునుపున్న పవిలేక వెనుక వాలము దోఁచెఁ
గేలుగాలుననలుగాలు నిలిచెఁ

గీ. గరపదాబ్జంబు లిరువాయిగౌరిజలయొ
నంసశిఖరములూఁపురంబై తనర్చె
నడువఁ దడవని కానికొల్వొడుగ నుఱికి
వెస బసవరాయఁడై అంకెవేసె వజ్రి. 158

ఉ. గ్రక్కున లేచి యమ్మహిమఁ గన్గొను రాజునకు న్నిజాంఘ్రికి
న్మ్రొక్కి పురంజయుండు తనమూఁపురమెక్కిన దివ్యదీధితుల్
గ్రక్కునఁ దోఁచి యందియలు గంటయు మువ్వల పేరుమ్రోయ నా
వెక్కసి గిబ్బయభ్రగతి వేల్పులతోఁ జనియెం బ్రతీచికిన్. 159

చ. వెలలిహజారమాన్నృపతి వేల్పులు దవ్వగు దాఁకఁ జూచి మూ
ర్ఛిలి సచివోపచారములఁ జేసి కుదుర్పడి నాప్రభుత్వపుం
బలుకుల బిడ్డ నెక్కడని పంచితి వాసవుఁడేమి పన్నె నం
కిలి పడకున్నె యంశుమతికిం దను వేగతిఁ జక్కఁ జెప్పినన్. 160

సీ. అని యలందరుచున్నఁ గని వీరశబరుఁడో
యయ్య నీకొడుకెంతకైనఁజాలు
వగవకుమా కానఁ దెగిన రాకాసుల
కంటె గొప్పలె వారుకలని కితఁడు
వాసిమానిసి గెల్చివచ్చు మీకతమున
మింటిరాజులఁ జూడఁ గంటి ననిన
నగి పోయెదే యన్న నాసామి యేనిఁకఁ
బోయెద ననిపోయె బోయజేఁడు

గీ. దేవి కెలఁగింప బిడ్డఁడా కావరంపు
రొదలయాఁబోతు పైమింటఁ గదలువాఁడు
వచ్చునా యని యులవ్రాలఁగ్రుచ్చి యెత్తి
తేర్చి సతిఁబతిదైవంబు దేల్చుచుండ. 161

—* లయగ్రాహి. *—

ఆయెడ వసిష్ఠమునినాయకుఁడు వచ్చి జననాయకుఁడు దేవియువిధేయములు పెక్కు
ల్స్రేయ వినయాదికములాయిరువురంబిలిచి మీయునికి చింతకొదలై యునికి దోఁచెన్
బోయనినిజాఖ్యలకు నీయనుఁగుబట్టి నృపుఁడాయపుడిటీకయిడుఁజాయననె యింద్రుం
డాయెగద వాహనమయాయనఁగకుత్స్థుఁడును నాయనపురంజయుడునై యిపుడు వచ్చున్ 162

ఆ. పురము లాసురంబు లెరియించును జయించు
నింతకేల మనసుచింత గొనఁగ
నని యతండు సనియె నయ్యింద్రవాహనుం
డభ్రగతిన పశ్చమాబ్ధిఁ గదిసె. 163

వ. అప్పుడయ్యిండిరాగురు నింద్రగురుండు పురంజయునకుం జూపి. 164

సీ. దీవించుచున్నాఁడు భావానుమోదజ
ప్రాబల్యశబ్దప్రపంచముగన
చల్లించుచున్నాఁడు సకలవీచికల నీ
యుదధి సీకరలాజలెదుటికెగయఁ
జళిపించుచున్నాఁడు ధళధళన్మీనాసు
లేర్పుజపంగఁ దోడేయుటకును
బన్నించుచున్నాఁడు బలిమిబారులుగాగ
జలమానుషకరేణు సంఘములను

గీ. జయము నీకెల్లభంగుల సంఘటింప
మొదలినెయ్యంబు దలఁచి సముద్రరాజు
చూడు మనవుడు తనతాల్చు సూడిగంబు
కానుకఁగవైచి రాచూలికరము మొగిచె. 165

ఉ. వైచినసూడిగంబు మురిపంబునఁదాలిచి దివ్యమూర్తియై
లేచి పయోధిపై కొకఁడు లేమలతోఁ జనుదెంచి వేళయు
న్వేచి సబాణతూణములు విల్లులు జోడు నొసంగి పోయినం
జూచి కకుత్స్థుఁడేమియిది చోద్యమన న్విని దేవమంత్రియుఁ. 166

చ. అతఁడు సముద్రుఁ డీవిడిన యాభరణంబె ధరించి వచ్చినాఁ
డతివ లగణ్యపుణ్య నదు లమ్మెయిరాక త్రిలోకబాధక
ప్రతతి వధించి యిండ్లు నిలుపందగు నెల్లరకంచుఁ దెల్పుజో
డితరదురాపమీవిలులు నేయఁగనింకియయుండుఁ దూణమున్. 167

క. ఇవరుణుఁ డౌర పరంబులు
సవరణయిదిదలఁచి యొక్కొచనుదెంచితివీ
వవులం దేకని జలనిధి
యవునిచ్చనెమ్మెచ్చె వరుణుఁ డయ్యెరుకువరున్. 168

చ. అని గురుఁ డుగ్గడింపఁ గలఝుం జలమానుషకన్యలిడ్డ కుం
దెనలును బోని సుళ్ళ నవనీరగణంబులు ప్రాంతమీనన
ర్తన చలితంబులై తొరఁగఁ బ్రాలసరిం బెఱసొంపులేర్పడం
దన పరివారదేవతలు దాను బయోధినతండు సూచుచున్. 169

క. తదుపరితీరాగ్రనభః
పదవికిఁ జని నిలిచి పొలిచెఁ బ్లక్షద్వీపా
భ్యుదయంబు షణ్ముఖంబై
యదిరా యన నగరషట్క మద్దరి మెఱయన్. 170

గీ. చూచి గిప్పనఁ జూచిన రాచబిడ్డ
తోడనతఁ డిట్టులనియెఁ దత్పురవరంబు

లేను వేర్వేఱ వర్ణించి యుఱుకపఱతు
ననుచు నద్భుతరస మొక్కఁ డనువుదాల్చె. 171

చ. గిరిరథమిప్పురంబు పరికించితె యల్లదె దుర్గ మద్రిపై
గిరిరథుఁ డిట్లు కట్టఁగలిగెం దనపేరన యూరు తేరుగా
వరమున వచ్చె నగ్గిరియె వానికి భర్గుఁ డనుగ్రహింప ను
క్షరథముఖోద్ధతావరజషట్కముతో నతఁ డుండు నచ్చటన్. 172

క. సాలము త్రిజగద్భీకర
కీలముగా వరముగల త్రికీలు పురము త
త్కీలత్రయి వెలుఁగునది త్రి
కీలమనుజులేవు రతనికిఁ ద్రిశూలాదుల్. 173

క. వసుజిత్పుర మది రవిశశి
వసుజిత్కురువిందవజ్రవప్రము యమజి
త్తెసఁగించెఁ గుబేరజిదా
ద్యసహోదరయుతుఁడు పిన్నతమ్ముని పేరన్. 174

ఆ. కల్యదానవుండు కరినాదులనుజులే
డ్వురు భజింపనుండు పురము నివుల
నిదియ యదియ వీరసదుదగ్రనందన
పురము నేఱితొఱఁగె దొరదొఱంగ. 175

ఉ. ఆపురపంచకంబు తనయంతలపోఁతల యిండ్లపిండుసూ
గోపురసౌధము ల్పురలు కొల్వునకుం డిగివచ్చు నిచ్చెనల్
చూపఱ జోలియేల యిటుచూపఱ చూపుల నాచికొన్న యీ
దీపపతాకపట్టనముఁ దేఱికనుంగొను మెంత యొప్పునో. 176

క. వేలావంతుని వెంబడి
నేలంబారాదిమేర నిడుపై యునికిన్

వేలాపురమనఁబడునది
కైలాగొదవించుఁ దరగగాడ్పులకెపుడున్. 177

సుగంధి:—దానిచెంతనందనప్రధాపిధాన దక్షనా
నాననానవద్యరత్న హర్మ్యమాలికా మయో
ద్యాన మొప్పుఁ జూడు మన్ననాసుగంధి కేలికా
కాననంబు జేరి డిగ్గె గబ్బిగిబ్బనాతఁడున్. 178

క. తోడన వచ్చిన శిఖియమ
రాడాదులతన్వనేక రక్షకరక్ష
శ్చ్యూదాకర్తనధూర్త
క్రీడా పరితృప్తులై దిగిరి యానములన్. 179

శా. ఆలో నిర్జరరాజమంత్రి వసురుద్రాదిత్యసంఘంబులన్
వేలంబు ల్విడియించి యుత్కలముగా నిల్పంగ నందుండు య
త్రాలిం బొమ్మని దాడి యాడియెలగోలందింప విద్యాధరు
ల్పాలంజేసి విమానముల్డిగి దిగీశశ్రేణితో నేర్పునన్. 180

వ. పురంజయుం జేరి యొక్కమహనీయసౌధంబున నుండిరనిస విని జనమే
జయుం డవ్వలివృత్తాంతం బెట్టనిన. 181

మ. సరసప్రాభవభావ భావభవజిత్సౌందర్య దర్యంతరాం
తరయోగార్జిత జీవ జీవయసుహృద్రాజన్యజన్యాసదృ
గ్ధరణీజాతపలాహృతద్విపఘటాకంఖాణసంవాసవా
సరరాజాద్భుతకృద్ధగర్ధగితభాసాచర్వితాశాంగనా. 182

క. భేరీభాంకారారప
దూరీకృతవైరివీరతోయజనయనా
పారవిషాదదవానల
వారణతరవారిధారవసుధాధారా 183

మాలిని — వితరణసురభూజా వీరవిద్యాబిడౌజా
ధృతిగతి నగరాజా దిగ్గతవ్యాప్తి తేజా
మతిమహిమసమాజా మానినీహృన్మనోజా
జితవినుతసమాజా చిన్నమాంబా తనూజా. 184

-: గద్య :-

ఇది శ్రీమత్తిరుమలతాడపాచార్యచరణసరసీరుహ సేవాసమాలబ్ధసామ్రాజ్య ధౌరేయ నిజకార్యాభరణాయమాన యెల్లభూపురందరవరనందన మట్లనంతమహీనాథప్రణీతంబైన కకుత్స్థవిజయంబను మహాప్రబంధంబునం జతుర్థాశ్వాసము.



శ్రీ ర స్తు

# కకుత్స్థవిజయము

## పంచమాశ్వాసము

క. శ్రీవేలల్లోచన దీ
నావనఘన సదయహృదయ యమితాభ్యుదయా
కావేరీవల్లభ యె
ల్లావనిపాలాఖ్య ధావదహితసమాఖ్యా! 1

వ. అవధరింపుము మనునందన కథాసుధాధారాధౌత మానసామేయజయుం
డగు జనమేజయునకు శంపాయనుం డగువైశంపాయనుండిట్లనియె. 2

సీ. పవడంబు మోసెత్తి లవణాబ్ధి కమృతాబ్ధి
తరగమీఁదనవచ్చు తరగవోలె
జలబలం బటిమెఱుంగులధార మెచ్చిన
ధరకు వ్రేలెడు శరద్ఘనము వోలె
దనుజోపవనికిఁ గెందలిరు జొంపము దాల్చి
పెకలి యేతెంచు కల్పకము వోలెఁ
దనుఁజేర రిపుతేజమును మోచికొని యుట్టి
పడుచున్న తద్యశోభరము వోలె

గీ. వదలు జడముడితోడ నారదుఁడు వింటి
రాక దవ్వులఁ గని కుమారమణి యితఁడు
దొరగిపోయిన యెకిరింతఁ దొడఁగివెతకు
మదనహరుఁడేమొ మనగిబ్బరొదకు డిగియె.

క. అని తెలుపఁ దెలిసి దిక్పతు
లును దానునెదుర్కొనఁగనిలుచునంతనె య

మాలిని — వితరణసురభూజా వీరవిద్యాబిడౌజా
ధృతిగతి నగరాజా దిగ్గతవ్యాప్తి తేజా
మతిమహిమసమాజా మానినీహృన్మనోజా
జితవినుతసమాజా చిన్నమాంబా తనూజా. 184

-: గద్య :-

ఇది శ్రీమత్తిరుమలతాతాడప్పాచార్యచరణసరసీరుహ సేవాసమాలబ్ధసామ్రాజ్యధౌరేయ నిజకార్యాభరణాయమాన యెల్లభూపురందరవరనందన మల్లనంతమహీనాధప్రణీతంబైన కకుత్స్థవిజయంబను మహాప్రబంధంబునంజతుర్థాశ్వాసము.



శ్రీ ర స్తు

# కకుత్స్థవిజయము

## పంచమాశ్వాసము

క. శ్రీవేలర్లోచన దీ
నావనఘన సదయహృదయ యమితాభ్యుదయా
కావేరీవల్లభ యె
ల్లావనిపాలాఖ్య ధావదహితసమాఖ్యా ! 1

వ. అవధరింపుము మనునందన కథాసుధాధారాధౌత మానసామేయజయుం డగు జనమేజయునకు శంపాయనుం డగువైశంపాయనుండిట్లనియె. 2

సీ. పవడంబు మోసెత్తి లవణాబ్ధి కమృతాబ్ధి
తరగమీఁదనవచ్చు తరగవోలె
జలబలం బఱిమెఱుంగులఖారమెచ్చిన
ధరకు వ్రేలెడు శరద్ఘనము వోలె
దనుజోపవనికిఁ గెందలిరు జొంపము దాల్చి
పెకలి యేతెంచు కల్పకము వోలెఁ
దనుఁజేర రిపుతేజమును మోచికొని యుట్టి
పడుచున్న తద్యశోభరము వోలె

గీ. వదలు జడముడితోడ నారదుఁడు వింటి
రాక దవ్వులఁ గని కుమారమణి యితఁడు
దొరగిపోయిన యెకిరింతఁ దొడఁగివెతకు
మదనహరుఁడేమొ మనగిబ్బరొదకు డిగియె.

క. అని తెలుపఁ దెలిసి దిక్పతు
లును దానునెదుర్కొనఁగనిలుచునంతనె య

మ్మని డిగి తా నిడునుచితా
సనపూజలు గొని మనోలసతఁబలుకలయన్. 4

మ. ఇటఁ గూర్చుండుఁ డనంగఁ బర్వతుఁ దదీయేచ్ఛాను సారైకలం
పటు నీక్షించి సుఖాసనాదులను సంభావించి రాచూలిచెం
గట దిక్పాలురత్రోవఁ జొచ్చి మునిలోకస్వామి లేమయ్య మీ
రిటఁ జిన్నంచిన మొందినా రనుడు వాగీశాత్మజుండిట్లనున్. 5

క. అచ్చరలాడఁగఁ గిన్నరు
లెచ్చుగఁ బాడంగఁ గనుచు నింపుగ వినుచున్
మెచ్చంగ దీపకేతున
కిచ్చక మో యనుచుఁ బోయి యెఱుఁగక యేనున్. 6

క. ఈవెలొకోటలొ మఱిపని
పాటలొ మీకింత యాటపాటా పోట్లా
యేటలు బాటలు బాటిలు
పాటికి వారెపుడు వచ్చిపడుదురొ మీఁదన్. 7

వ. అని యింద్రవాహనుండవై నీవిట యెత్తివత్తని పల్కిన నతండు. 8

క. వారంటివి వీరంటివి
పోరంటివి మీఁద బడకపోరంటివిగా
వారెవ్వరోయి పాఱుఁడ
వారనఁగాఁ దెలియ దేటివారో యనినన్. 9

ఆ. ఎఱుఁగకితడు వెఱ్ఱి నిట్టివారననేర
కనియెఁ దెలియఁజూడుఁ డనుచునొకఁడు
దిగిచి చించెఁ గృష్ణమృగచర్మమపుడు ప
ర్వతునిచేత నుండి బ్రతికె మహతి. 10

క. తదనీతికిఁ బర్వతుఁడుం
బెదరఁగఁ బులినాఁకివిడిచెఁ బెక్కేల యిఁకం

బదచాలు ననుచునేమును
నదవదపడిరాఁ ద్రికర్ణుఁడా దొరతోడన్. 11

చ. అనుచిత మిట్లు సేయుదురె యమ్మునినాథుఁ డసత్యమాడెనే
దనుజకులం బడంపఁగఁ గదా సుకుమారకుమారుఁడింద్రవా
హనుఁ డన నమ్మహామహ మహస్కరమండలమధ్యవర్తి పు
ట్టెననె యింతవికటించినఁ గార్యమె మీమదాంధతన్. 12

మానిని— పోరితము ల్మఱిపుట్టవె యేరికిఁ బుట్టిన నేమియపుంగములై
పోరరొ క్రమ్మఱఁ బొందులు సేయరొ ప్రోడలు సుస్థితిపొంచె సునా
సీరుఁడు మానిని జేటుఁగఁ జేసినచేష్టకుఁ జేద్వడఁ జేసియు మీ
వైరము మానఁడు వచ్చిరి సంధికి వారు కడంగఁగఁ వారెసురల్. 13

చ. పొనుఁగుపడంగఁ జేసి పగవృచ్చ నుపాయము లేదె వారితో
మను మెటులైనఁ బెద్దమనమా యిఁక నెట్టొకో యుగ్రదైత్య నం
దను లసహాయశూరులు వనమ్మునఁ గ్రుమ్మఱఁ గూల్చి వచ్చె నేఁ
డనిమిషరాజునెక్కి మనుజాధిపసూనుఁడు వారుదేఱఁగన్. 14

త్వరితపదగతివృత్తము—అననదరిపడుచు నతఁ డనె నొకఁడు తిర్య
ఘ్నుని దదనుజుల నొడిచికొనఁగలఁడొ నన్నున్
జెనకి చనఁగలఁడొయన సిగలుదెగి దైత్యుల్
గనునెదురఁ ద్వరితపదగతి నరుగుదేఱన్ 15

వ. దీపధ్వజుండు వారి నాలోకించి 16

చ. తల లివియేమి మీ పరుగు తత్తర మేమి యనంగ నంతకా
దులు వృషభాధిరూఢనరుతో మనతోఁటకు వచ్చి మమ్ము ని
ట్లలజడిఁ బెట్టిరన్న నతఁడప్పని నేమఱి సిద్రవోవఁగా
నెలుకలు గొట్టెనేమొ సిగలెక్కడిసుద్దులిసీ చనుండనన్. 17

వ. యమాదులుం దిరుగం బుట్టిరే. పుట్టిన నిట్టిపనులు దలపెట్టిరే. యంబష్ఠ
కుల చేష్టలకుం జొచ్చిరిపో యని యుపహసించి. 18

క. యమజిత్ప్రముఖులు వినులు
చిమచిమమన మనకు మౌని చెప్పిన నయమా
ర్గము లోకదదియు నిజమే
కమియఁగ లగ్గలను జొనుపఁగాఁ గలిగెనొకో. 19

క. నడచిన నిలమోసిన ఫణి
మెడవిఱుగదె నగినఁ బడవె మీఁదిజగంబుల్
తొడతొడలుగ మాయలుకకు
పడిపడి వారెదిరి మంద్రె వజ్రవిరోధీ. 20

వ. అనిపలుకుచుం బదరుచుండ విరథుండు. 21

తరల—పెరిఁగి దేహము వృద్ధి మిన్నను పేరు లేదనిపింతునే
సరిగసందియపందిదండలు చక్రవాళము మానసో
త్తరముగా ధరియింతు నీధరఁ దావకప్రభుశక్తికిన్
బిరుదు పెల్లిగమేరు దండము నిల్పనెత్తివహింతునే. 22

క. పోరదఁగు నెప్పుడన ని
ర్వీరాలాపములదాఁక వినివచ్చితినిం
ద్రారులిఁగ నెత్తివత్తురు
మీరాయతపకుఁడు సమిదమేయోద్ధతికిన్. 23

వ. అనినవిని పురంజయుండు మాఱుతనంబు నిమిత్తమాత్రంబు దేవద్వేషులు
మీకుఁజేసిన యపచారంబునన తెగుదు రనునవసరంబున. 24

—:బంధురవృత్తము:—

పటపటఁ బగులుచుఁ దనతనతలనే పడ్డది మిన్నని భూమిజనుల్
పెటపెటఁ బెటపెట లొదవఁగఁ బెలుచంబేలఁగ రాలఁగఁ దారకలు
చ్ఛటఛట కటురట దిషశిఖిశిఖలుం బంధురదుందుభినాదములున్
గటకట పురిదెసఁ బెరఁగఁగ విఱుగం గగ్గులకాడుగ వేల్పుమొనల్. 25

క. జనమేజయ తొలువేల్పుల
కొనమూకలు సురలనంటికొని పెదతలలం
జొనిపెఁ బెనుదూపులువ్వె
త్తునవిరాతలలకెల్లఁదోఁకలటంచున్. 26

చ. కనలు కకుత్స్థుఁ డప్డు కడకంటికిఁ దెచ్చుచు జోడుదాల్చి పేఁ
పునబిగియించి విల్దొనలు భూరిశరాసనమెక్కువెట్టి వా
హనము కకుత్ప్రదేశమున కానతుఁడై మఱిదాఁటెదాఁటెఁ బో
ముని యనలాదులం బనిచె మున్నగురుండని సేయ ధీరుఁడై. 27

క. ఆయేడ్వురు దిక్పతులకు
నాయెడ శిఖిజిత్తు యమజిదాదులతోడన్
బాయవడి యెదిరి మొగ్గర
మాయితపఱచికొని కొందఱవ్వల రాఁగన్. 28

సీ. అనలుండు ననలాత్ముఁడును దీపకేతుమా
        తామహుఁ దాఁకి రతండు దహను
వారుణాస్త్రంబున నీరార్చి యీశాను
        కనుఱెప్పనొసలిడి చినుఁగ నేసి
పిద్వ్రద్ధమంటకు వివిధబాణార్చుల
        పోరాటపుట్టించెఁ బోరఁ యముఁడు
తనదాయదరికిని దఱుమఁ దన్మహిషమ
        బ్బలియు రథ్యంబులఁ జెలఁగి కొట్టె

ఆ. విరథుఁ డగుచు మఱియు నరదంబు నతఁడెక్కఁ
దత్తదశ్వములను మొత్తెఁ బోతు
ధనదపవనవరుణతద్వైరులకుఁ గచా
కచి కరోరకలహగతులు గలిగె. 29

క. సమరము వసుజిత్తునకును
యమవరుణుల నడిమిదొరకు నయ్యె మహీయ

స్తిమిరారుణజలదమరు
త్ప్రముఖావిర్భావపరుషభావమున నృపా. 30

గీ. అనుడు నభిమన్యుపౌత్రుఁడో మునివరేణ్య
దహనజిద్వారుణాస్త్రుఁడు తడుపఁదడిసి
శిఖియు జముపోతుతేరి తేజీలఁదినఁగ
యమజిదసురుండు నేమేమియైరి చెపుమ. 31

చ. అన మునిపల్కెనట్లసురయమ్మున నించుకనాని వహ్నియుం
దనతపనాస్త్రముం బరపి తజ్జలధారల గ్రొచ్చి వాని వి
ల్దునియఁగ వాని రథ్యములు ద్రుంగఁగ వానిరథంబు గూలనే
సిన విలుఁ దేఱుఁ దెచ్చికొని చెండి యతండెగిచె న్శిఖాగ్నులన్. 32

మ. యమజిద్వాహనుఁడుం బరేతపతి వాహద్వేషిచే నక్షితా
శముగాఁ దేరిదెస న్మనంబవుర మెచ్చంబట్టె నీకంటె మే
ల్జముఁడా నీయెనుపోతటంచుఁ గదఁ బెల్చన్మోదినందిమ్మదీ
అమిఁ గొమ్ముంగవఁ ద్రిప్పకొంచునది వాఱంగాలుఁ దడ్డంబుగన్. 33

చ. తఱిమి రథంబు దున్నతల దప్పిడివారినఘోరదోరసిం
డఱుఁగకపోదునే తల పదంపడి యిందఱు గాలురున్కియున్
మఱపుగ నిల్పుటొక్కఁడన మంచిది చాలమి దెచ్చికొన్న నా
కఱగొఱఁ దీర్తుఁ గాక యొకకాలుఁదకా తలద్రుంపకేగెదే. 34

వ. అనిన జముని పలుకులకులికిపడి రాక్షసుండు మాయామహిషంబునెక్కి
పోవునప్పుడు. 35

మ ఇరువాగుంగని యేమి బాసటగరాఁ డెవ్వాఁడు నందెవ్వఁడె
వ్వారిఁ గాలుండనివచ్చు వారితెఱఁ గుల్వాయంపురజ్జాదిగా
సరికిం మాయవనిం బరస్పరగదాసంపాతలక్ష్యత్వమొ
ప్పిరి వారాసురసాధనం బెఢలె మాపెంద్దైవముం దానవున్. 36

క. దివిజులు తొలుతాఁకునఁ ద
మ్మెవిచిన దనుజులను మనుకులేశ్వరశరము
ల్వొవయనిమంటలు మింటికి
నెవయంబడి కెడప మొనసి నిలిచిరి తారున్. 37

మ. అటులయ్యొందఱు సింధుమందరవియోగాఖావముంజూపె ని
చ్చొటు నాఁగాఁ బెనుమూఁకయై విశిఖవీచుల్పర్వఁగా బ్రోసి యొ
క్కొట దీపధ్వజుతాతఁ జుట్టికొన జూడుక్కల్మండ నొక్కొండ పి
న్నగనవ్వంరరముం బగుల్ప నతఁడంతశ్చారదుర్వారుఁడై. 38

క. తనుఁదాఁకు తూపుమూఁకం
దనవి యొకటిరెండుమూఁడు నాల్గైదాఱేఁ
డెనిమిది తొమ్మిది పది దాఁ
కనిమేషము లేకయుంద గాండములేయున్. 39

వ. అయ్యవసరంబున. 40

-: వడిసీసము :-

తాఁజాలగలవాఁడ తనధృతినిఱుపేద
దరికినాలోఁజేవ దఱిగిపోవఁ
తానె బలిమికాఁడు తనకైదువంపేదఁ
దప్పదు నానాయుధంబు వృధగ
దా శరన్మేఘంబు దనతనజడివాన
తఱుచు నామిన్నేటి ధారలొలుకఁ
దానతమాలంబు దనవిరులొమ్మదుగ
ల్దవిలెనా క్రొగ్గంట్లు దళుకులొత్త

గీ. ధనదపవన గంగాధరతపనసుతులు
దనుజయోధులు బలముతోఁ దఱుమఁబఱచి
రనలపరుణులు తమతోడి యసురఁగూడి
యవులరేఁగులు తంగేడులనుచుఁ బాఱ. 41

వ. వస్వాదిగణంబులు చెల్లాచెదరయ్యె నయ్యెడ. 42

ఉ. వైచినఱంకెలం దెసలు వ్రయ్యగ నుబ్బినగిబ్బఁదోలుచుం
ద్రోచి నిశాతరేశ్వరులఁ దూఁటులువోవఁ గకుత్స్థుఁడేసెఁ బోఁ
బూఁచెఁ గదయ్య మోదుగులు పూయకపోవునె రాజభాస్కరుం
డేచి జగంబువారి తపమింకిటమీఁద ఫలింపఁ జేయునాన్. 43

వ. అత్తెఱంగునకు సైరింపక కొందఱసురవీరులు తమలోన. 44

ఉ. నాకులభీకదానవగణంబులతో సరిపోలువారె వీఁ
డేకులవాఁడివెట్టెఁ దనయెద్దను దాను నిటుండి వీనిము
న్నేకతమంత మజ్జమునియింటికి నంచుఁ గకుత్స్థుఁదాఁకిరా
లోకము లగ్గిసల్ల నెటులో యటనెవ్వరో యంటివేనియున్ 45

వ. వివరింతు నాకర్ణింపుము. 46

చ. కరివకరాలకర్కశుఁడు కల్యుఁడు నంతకజిత్తు నాదిక
ర్మరులయి దావతీక్ష్ణులయి ప్రాసగదాహలశక్తిశూలభృ
త్కఠినభుజాసమున్నమనగర్వము కర్ణకఠోరవీరవా
క్ప్రతనము లుల్లసిల్లఁ దగఁబాఁజిరి యబ్బిగిచూచి యాతఁడున్. 47

వ. కట్టెదుటికింజేరవచ్చి. 48

సీ. ప్రాసంబుతోఁ గరినాసురు బాహువు
గదతోఁ గరాళదుర్మదభుజంబు
హలముతోఁ గర్కశపలలాసిబాహాయు
శక్తితోఁ గల్యునుద్రిక్తభుజయు
వేకూలఁదునిమినఁ గైకొన్నకైదువు
ల్వీడువని కుడిచేతు లెడమకేలఁ
బట్టిపైకడరు నట్టిట్టులు తలలేటి
యమజిత్తుమూర్ఛలోఁ జిమగనేయఁ

గీ. దేరుఁదవఁ దెచ్చి తత్సూతుఁ డూరుసేర్చె
నక్కబంధంబు లెదురెక్కె నొక్కవడిన
వ్రేటునాటును నాయినువ్రేటు చూప
కవనిగలయక వలితనం బివురదనఁగ. 49

ఉ. ఆరభసంబునప్డు కరిశాదులచేఁ దలలేని బొందులం
జూరె కడంకలూరెనని చూపఱు మెచ్చుల మూరిఁబోయిరా
సూరెలమున్నె కన్నిడిన సూటిన వామభుజాభుజాదులం
బీరము సూపి త్రెళ్ళెనవి భీమమహోక్ష ఖురాహతంబులై. 50

క. తన రౌతునేటులంబడి
యనిఁదెప్పిరు ఘాసరోము నఱ్ఱదిమి శిరో
వనిఁ గఱికినెత్తురుఱుకం
దననోరం బెఱుకు వృషభదైవతరాజున్. 51

వ. నిరీక్షించి. 52

ఉ. నాలుగుడాఁచిపెట్టి పెఱనాలుకలన్వ్రేలుఁ గొంద శూలభృ
త్ఫాలము కన్నుకైదువుగఁ బట్టెవవనందగు శూలమెత్తి య
క్కాలివిరోధి వ్రేయుటకు గిబ్బవసంబరి మూతియూఁతగాఁ
గూలియు నఱ్ఱుపట్టిన కకుత్స్థుఁ గుదుర్వడఁ జేసెఁ దేరుటన్. 53

వ. అప్పు డప్పరంజయుండు. 54

శా. ఔరా యక్కరినాదులంగలయరావైతేనియుం దానవ
స్థల్లీరాడ్వేడుక రేచితీవిటులు పెల్చన్వచ్చి యుక్కోలకుం
జవిరాసీవిఁకఁ జెట్టగాక దివిషజ్జాలంబుతోఁ బోరు కెం
జివురాసీవగు జాతికం చొకట నేసెన్వాని మూర్ఛంబడన్. 55

చ పెలుకుఱి ఘాసరోముఁడు కుబేరజిదాదులు నప్పు డాతఁడం
దిలిగెన కా దలంచి పరువెత్తిరి క్రమ్మఱి సూతుఁ డగ్నిజి
త్ఫలలభుజు న్శిఖిధ్వజుని పాలికిఁ దెచ్చె బలంబులెల్ల దు
మ్ము లెగయఁ బాఱి చొచ్చెఁ బురిమూయనివాకిలి మూసినట్లుగన్. 56

వ. అంత దినాంతం బైన. 57

చ. వలయపువంపుగొన్న విలుపొందుగ వీరరసంబు చేత వ
ర్ధిలిన ప్రతాపవల్లి నలుదిక్కుల బ్రాకునొ రాకుమరుచే
యలవునఁ గ్రుంకుకొండ నుదయాద్రి చివుళ్లొకరెండు సూపెనా
నలరె మురారి కన్నులు సురాలి కనత్రవిచంద్రు లిద్దఱున్. 58

చ. అమరులనిట్లు గ్రమ్మఱచి యాటలుపాటలునై వియచ్చర
ప్రమదలు గొల్చిరాఁగఁ దమ పాలెపుఁదోఁటకుఁ బోయి కోడెగు
జ్జముడిగి రొమ్ము పుట్టిన తెఱఁగునఁ బావకజిత్ప్రయుక్తశూ
లము నుదురాడియుండఁ దదలంకృతిఁగాఁ గొనియాడి మెచ్చుచున్. 59

ఆ. కొంతసేపు చూచి యంతఁదదుత్పాట
నంబుఁ బిదప వాహనంబుఁ దడవి
ఢగధిపరుఁలు దాను దగునెడగురునార
దులు జయంబుపొగడఁ బొలిచెనతఁడు. 60

ఉ. అక్కడఁ బోరువిన్న యొడయుం డరదేఱిన తల్లిఁదండ్రితో
నక్కట నేఁడు కల్యకరినాదులలోపల నొక్కఁడేనియుం
ద్రిక్కకపోయెనే యినుకదేఱెనె తావకశౌర్యవార్ధి యం
దుకొన్నవులైరె వేల్పు లొకఁ డూఱటగా నిఁక నేమి చెప్పుదున్. 61

చ అని పలుకంగ నంత నసురాధిపుతాతయు లెస్సదేఱి యె
త్తిన వలచేతి హేతిఁ దనుదెచ్చిన సూతుని వ్రేయఁబోవఁగా
మన మఁడు వట్టి నీభుజము మాకొక కోటగ నమ్మి యుండఁగాఁ
గనుఁగొనుమయ్య నిన్నసదుగా ననలేదని యానమిల్లిన్. 62

చ. నిలువ కతండు మూర్ఛనఁగి నేఁడ కలన్మ్రగియించి వచ్చెద
న్నిలువు మనంగ నీ వరము నిక్కువమయ్యెడు మెల్లి నేఁటికిం
దెలఁచెద నిల్పుమం చతని దెచ్చి రణశ్రమ మాపుచుండఁగా
నలుగులఁ బాఱెఁబో గిరిరథాదుల రౌద్రరసంబు కొల్వులోన్. 63

క. ఆ రేయి నృత్తగీతవి
హారంబుల వేలుపులకు ననుభూత తిర
స్కారజ ఖేదక్రోధవి
కారంబుల రక్కసులకుఁ గడచె నృపాలా 64

క. పొడఁగాన మంగళాలల
నడియాలపుఁబసిఁడిబద్ద లవితూర్పుననా
వెడలి యిరువాగు ననికే
ర్పడఁదోఁచెం దరుణతరణిభానుశలాకల్. 65

క. క్రందుటని చూచుటకుఁబో
లెందొలిమల యెక్కె నినుఁడు లేఁదామరపూ
విందుపొడు పిందుపొడుపై
చిందులు ద్రొక్కించె నుభయ సేనాంబుధులన్. 66

క. అంతకు మును మేల్కని యా
సంతమసారాతివంశ జలజచ్ఛాయా
కాంతుఁడు కాలోచితకృ
త్యాంతరములు చలిపి సన్నహనసంపదతోన్. 67

శా. శ్రీమజ్జన్యకుతూహలంబు ముఖరాజీవంబు సూర్యోదయ
క్షేమావాప్తికిఁ దోడుసూపి యలరం జేయంగఁ బూజించి పౌ
లోమీవల్లభమైన వాహనము నాలోనెక్కె నుగ్రాది ది
గ్గ్రామస్వాములు నూకి రుక్షరథరక్షస్సేన కుక్ష్యాదులన్. 68

క. దానవుఁ డతఁడప్పుడు తన
సేనకుఁదలమిగిలి నిజవిజిత్వర చాప
జ్యానాద సింహనాదము
లేనాదముఁబేదనాడ మేదం జేయన్. 69

స్రగ్ధర—జలరాశి ప్రౌఢవీచీ సఖముఖరమహోక్షంబులం బొల్చి వెంటం
బడివాఁగం దేరురాఁగా బసువని నొకనిం బారలాడించుకొంచు
న్నడగొండం గొండరౌతై ననట గఱపుచు న్వచ్చెనో నాలకోరీ
జడివానం జిచ్చువానం జదుపుచుఁ బొదివె న్సర్వదిగ్రాజరాజిన్. 70

వ. అప్పుడు గురుండు కకుత్స్థునకు నుక్షరథుం జూపి. 71

చ. అజునివరంబు కల్మి నిటలాక్షమహోక్షముఁ దాఁకి గెల్చు ది
గ్గజములమోపు మూఁపురముగాఁ గొననోపు సురాసురాస్త్రము
ల్గిజిబిజిఁ బిప్పిగా నమలుగిత్త దతీయము తాదృశంపుట
క్కజముల తేరి గిబ్బలప్రకారము లాతఁడజేయుఁ డెమ్మెయిన్. 72

ఆ. ఈ...ద...య నీశుఁడేమౌనా వానిచే
ననఁగ నీహరాస్త్రమంది నమలు
దిట్టగిబ్బతోడఁ దేరితో రిపుఁ గూల్చె
రౌద్రబాణమునఁ బురంజయుండు. 73

చ. అమర దురాపుఁడుక్షరథుఁ డట్లయి నప్పుడ యుబ్బుఁ గ్రోధముం
దముఁ బురికొల్ప నొండొరులఁ దార్కొని పేర్కొని వహ్నివహ్నిజి
ద్యమయమజి జ్జలాధిప జలాధిపజిన్మఖు లాత్మవైరబం
ధములఁ బెనంగుచుండ ననిఁదాఁకె మహారథుఁ డప్పురంజయున్. 74

చ. అపుడు పురంజయుండును మహారథఘోరధనుర్భవాశుగ
ప్రపతన బాధక ప్రదర పంజరుఁడై కెలనం గృతాంతుపై
నుపహతిహేతుభూత శరమొక్కటి పూనఁగ దానితోన త
ద్రిపు నటఁ గూల్చె నజ్జముఁడు దేవరగాఁగల వేఁడి తూపునన్. 75

క. వెండియు భీషణశరమున
దండించి రథంబు గరిమఁ దాదృశ మహిమో
ద్దండత మండు మహారథు
కండలు తన వింటనేకి కాకుల కిచ్చెన్. 76

వ. అప్పుడు. 77

గీ. ఒక్క జిహ్వకు సురకోటి యొడ్డిగిలఁగ
నెల్ల నృపు లొండురసనకు డొల్లిపడఁగఁ
జిలువ లొక నాలుకకుఁ బెల్లఁగిలి చనంగ
నింద్రజిహ్వని జిహ్వాత్రయంబు తోఁచె. 78

ఉత్సాహ—వాకు వడఁక నపుడు గురుఁడు వానివేగఁ దునుమవే
యోకకుత్స్థ యోకకుత్స్థ యుక్షరాజమైనయీ
పాకరిపుఁడు నతని జిహ్వఁ బడన కడఁగెఁ దత్కథల్
నీకుఁ బిదపఁ దెలియు ననిన నిగిడిపడుచు నాతఁడున్. 79

ఆ. తన మహోక్ష మవశతన యవ్విషమశీలు
నాలుకకును దనకు నాలుగడుగు
లంతరమున నుఱుకునంతలోపల దాయ
దగ్ధఁజేసి రణవిదగ్ధుఁ డతని. 80

క. వ్రేలెఁడు నల్లెఁడు జుత్తెఁడు
నేల లెడల్గాఁగ నిలిచి నిర్జరమనుజ
వ్యాళవరు లసుర పఱచిన
నాలుకలా యేఱి నమలెనా మనతనువుల్. 81

ఆ. అని చెలంగి రుబ్బె నాఁబోతు వేల్పుఱేఁ
డమర నిలిచె మూఁపురమున జోదుఁ
గౌఁగిలించి రమరగణనాథులహిరాజు
లభినుతించి రేగి రఖిలనృపులు. 82

చ. అనవుడుఁ బాండవుం డివి మహాముని యౌ వినఁ జిట్ట లంతరీ
పన్నృపులతోనవచ్చి తనపట్టిని గౌఁగిటఁబెట్టి నేమనం
గని సుకుమారరా జనినఁ గవ్వడి మన్మని కాతఁ డిట్లను
న్మను దనబొజ్జ విష్ణుకళ మోచిన పుణ్యముగాచె నాతనిన్. 83

ఆ. ఎంతకెంతసాలఁ డీశ్వరుం డెదరోటఁ
జిఱుతవాని కనిన సింహపీరి
తాన మ్రొగ్గె నతఁడు నానాఁ డయోధ్యలో
నంతకింత సాలె నది యటుండె. 84

క. ధనదజిదాదులు చేడ్వడి
దనుజకులం బడఁగె ననియె తలఁచి త్రిజిహ్వున్
బనివిధి కఠినంబయ్యెనె
యనుకైన మనంబు దైవమా నీకనుచున్. 85

వ. బృహస్పతి యాలింగనంబు బిగువు వదలక యక్కుమారవరు నిఱుగెలంకుల నొత్తికొనుచు నుపలాలించె, దుందుభులు మొఱయ దివ్యకుసుమంబులు గురియఁ దదాసారంబు నడుమ నతిజటామకుట గంగాప్రవాహాంతరాంతరాళంబున నలువొందు నందివాహనుం డన నింద్రవాహనుం డొప్పునప్పు డోసరించి పొగడి మగుడం జేరి వీరకంఠీరవా! నేఁడు మూఁడులోకంబులు నీభుజాగర్భంబున నావిర్భవించె, ముంచినవిపదకూపారవిశేషం బశేషంబును నొకనిమేషంబున నింకె, నింకఁ దక్కురక్కసు లున్నంజన్నం గొఱంత లేదనితోఁచె, జయంతునకుఁ దమ్ముకుఱ్ఱలు పెక్కండ్రు గలిగినఁగదా యింద్రుండు నీఋణంబీఁగికొను నాకర్ణింపుము 86

సీ. ఒకనాఁడు తొల్లి పేఁ డొకసురాంగనఁ జూచి
యువిద నీయొప్పు నన్నొడిచె ననిన
వికటోక్తియెదుటఁ దద్విభుఁడు గంధర్వుండు
విని తాఁకి యొకనాఁడు పెనఁగి యొడిచి
చికిలితూపున మూఁడు చీరికల్గా జిహ్వ
సించి యొప్పొడిచె విచ్చేయు మనిన
నొకకాలఁ జిరకాల మోహో తపోవృత్తి
మొనరెనాఁజేసె నీయుదురుమిడుకు

గీ. చీరికలు నాలుకలుగాఁగ సెలవిసాప
గడియలోఁ బేరుగల ముజ్జగములమగల
దొంతులును దొల్లిపఱతేఱఁదొరఁగినపుడ
వానఁగరఁగంగ నజుఁ డిచ్చెవరమతనికి 87

వ. తద్భయంబు త్రిలోకీచర నిశాచరవీరులకు లేకుండెకు మనిన పైమాటయుం బడసి యుండె. 88

ఉ. ఈతఁడు నాఁటఁ గోలెఁగద యేఁచెఁ ద్రిజిహ్వుఁడనంగ నవ్విధం
బాతరువాత మేమెఱిఁగి యవ్విధిపాలికిఁ బోయి పొక్కుచు
న్నామ తెఱఁగేమి చేసితివనా వరమిచ్చినతండ్రి యన్న నాఁ
డాతఁడు మీకు దిక్కుగల యాజిన చాచు నతండు నాలుకల్. 89

క. ఆగడియ యెచ్చరికతో
వేగించిన నిలుతురనియె విని యెచ్చరిక
ల్సాగునొకో యని యుంటిమి
సాగెనకా యేను నీదు సన్నిధి నుంటన్. 90

వ. అని పలుకునవసరంబున. 91

ఉ. ఏడ్పును గ్రోధముం బెరయ నెక్కి త్రిశూలుఁడు రుద్రసంఘముం
గీడ్పడఁ గొట్టి బాణములు కేలనొకందును మ్రోల రెండునై
తోడ్పడిరా రథంబు డిగి తూఱఁదదీయ మనఃప్రసారము
ల్చేద్పడఁ జేసెఁ దామసశిలీముఖ మయ్యిన వంశవీరుఁడున్. 92

శా. దానశ్రేణికిరాకతండు కెలనం దత్తాదృగీశత్రికీ
లానేకాశుగ ఘుక్కుచాకచి సముద్యత్పాలకల్యామణి

శ్రీనేతోరణమొప్పఁదూఱి విజయశ్రీఁబెండ్లియై వత్తుఁగా
కేనంచుం జొరఁగా హరుండెఱిఁగిపోయెం బోయినం గ్రక్కునన్. 93

క. మొనమున్నదారత్రికీలుం
దనయన్ననవైరివధ్యుఁ దమ్ముఁడు శూలం
బునఁ గూల్చికూలె మ్రోల
న్వీనువీథిందోడునడుచు విధికూలములున్. 94

—అక్కిలివడిసీసము—

వినుమీ విచిత్రమీవేధోవరాగమం
బనఘ యప్రతిహతంబగులలాట
కీలత్రయమునఁద్రికీలుండు నరుల క
వధ్యుండుఁగాఁ బెద్దవానిఁ జేసె
నవిరోధిఁ గెడపఁ గీడని విన్న శూలత్ర
యంబు కల్మిఁ ద్రిశూలుఁడై యనన్య
వధ్యుఁడై తరువాతివాఁడొప్పఁజేసెఁ ద
త్కథవిన్న నృపసూతిత్రికీలు

గీ. వలని ప్రోవఁ ద్రిశూలుండు వచ్చునపుడు
గొలిపెఁదామస మీశానగురుఁడు ద్రిప్పి
యన్నఁగరశూలమునఁ గూల్చె ననుజుఁడతఁడు
నడఁగఁ దనశూలములన బాగయ్యె జనులు. 95

క. రక్షోబల మప్పుడపా
రక్షోభము ద్రిప్ప నిబ్బరంబునఁ బ్రతిపీ
రక్షోదక్షమతకు సమ
రక్షోణికిఁ బాసి భయభరంబునఁ బఱచెన్. 96

చ. ఇరువురు చిక్కిరాజికథ కెల్లరుఁబో శిఖిజిత్త్రికర్ణుల
య్యిరువుర నప్పగించి చనియె న్మొన యన్నటు లుండ దయ్యెరెం
డెరగలిమంట లంటి విడి యేగిన చందము దోఁచె మండివా
రరిబల కాననంబునకు నస్త్ర శిఖల్నిగుడ న్వెలుంగఁగన్. 97

క. ఎందఱు గంధర్వులు పడి
రెందఱు గుహ్యకులు మడిసి రెందఱు నృపసం
క్రందను లీల్గిరి యపుడా
దొందడి మితిమీఱి వారితూపులు దొరఁగన్ 98

వ. నృపాలా యేమి చెప్పుదు నాకర్ణింపుము. 99

ఆ. దెసలు మునిఁగెఁ మునిగె దేలెఁదేలెఁ గకుత్ స్థుఁ
గ్రాచెఁ గ్రాచెఁగల్ల కల్లయనఁగఁ
గతలు పుట్టినట్టి వెతలనజాండంపుఁ
గడవఁబెట్టకతఁడు గడవఁబెట్టి. 100

చ. అడుగవుగా త్రికర్ణుని గుణావళి వానితపంబు వెన్నునిం
బడిసెఁ బ్రసన్నుఁగా హరికృపం గృపగల్గి జగద్రహస్యము
ల్పొడతలనున్న కర్ణమునఁ బెల్లగిలన్సకలార్థవేదియై
నడిసనినాఁడతండతని సంగరకాలమమోక్షకాలమున్. 101

క. పోరులు పుట్టినన్దనుజులు
తోరానతఁ దరిగి యలుక దొడంనతూకే
ఘోరాహవకాలంబని
నారాయణుఁ డానతిచ్చినాఁడాతనికిన్. 102

ఉ. కావున మోక్షకాలమయి కల్గెఁ ద్రికర్ణుని కల్కి యత్తఱిన్
భూవరవహ్నివై రిపయిఁ బోయి పురంజయుఁ డెట్టులాడుచు
న్రావల దిప్పుడీవని మరల్చె ననాదికి మానవాస్త్రర
క్షావిధి దీపకేతునిహజారముప్రమోలికి వాని తేరితోన్. 103

ప్రహరణకలిక— అరదముడిగి యందతఁడును గనునీ
దురలఁగఁ గొలువై యొనర దనుజకే
సరిఁగని వినవే జయహలహలికా
పరిభట భయదప్రహరణకలికా. 104

ఉ. తూఱెఁగదయ్య నీ ప్రెగడదోయి కృతాంతునికొంప నేరుపు
ల్పూఱలఁబోఁ ద్రికీలుఁడుఁ ద్రిశూలుఁడు హా నినుఁ బాసిరంచు వి
ల్పాఱఁగవైచి పద్మ నవలధ్వజమేరువు ద్రెళ్ళఁ జంపుసొం
పాఱడివో హజారపుటజాండమునం బవివోని మూర్ఛిలెన్. 105

క. డిల్లంబులైన మేనుల
నుల్లంబులఁ దేల్చికొని రణోత్సవరతి రా
గిల్లిరి తన్మూర్ఛయుఁబో
గిల్లిరి యుపచారవిధుల గిరిరథవిరథుల్. 106

ఆ. మగుడ దీపకేతుఁ దిగిచి యయ్యిరువురు
నున్నతాసనమున నునిచిరపుడు
నడుము విఱిగిపడిన నగరాజుఁ గమ్మఱ
నదికి నిలిపినట్లు యవనినాథ. 107

వ. అప్పు డద్వీపధ్వజుండు. 108

గీ. అన్నిదిక్కులవరముల య్యసురులొంద
నుడియఁ దెలుఁగునె గీష్పతి నుడువకున్న
నమరవిద్యారాదుల యాంధ్ర విడిచి
వాన్విఁజెఱసాలఁబడవేయఁగాననైతి. 109

క. అని యొల్లఁబోవఁదాపము
కనుకని పోఁదేర్చి పాపకర్మపుటొడయా
ననుబంచిన మనకించిన
పనిమించదె యంచు నతనిబలుకుఁ బ్రతాపిన్. 110

చ. గిరిరథుఁ జూచి నీతి పరికించి త్రికర్ణుఁడు నీవుముట్టి య
ప్పురుసున నగ్నిజిత్తునకు బాసట గండరిసైన్యవార్ధికిం
గరయుఁ గకుత్స్థుతాఁకునకు గట్టునునై యొకఁడున్న యాంతకుం
బురుడన కొప్పకిప్పటికిఁ బొంగెడు ట్రింగెడు వేల్పుమూఁకలున్. 111

క. ఇది వినుమా మొనదెరలిన
వదలక యేనొకఁడఁ దారవై పున మొదలం
దదధీనమానవశిత
ప్రదరము నాయెత్తిచన్నరథముం దెచ్చెన్ 112

చ. తుదినిటు రాజుతోఁ బొదుతుఁ దోలుదు గుంపులనంచుఁ దాత యొం
టిఁదొడరినాఁడు కావున వడిం జనకుండిన నీతిగా దనం
గదలెఁ గృశానుకేతనుమొగంబునఁ దానొక క్రొమ్ముక్కువై చి పో
పొదమని తమ్ములున్నడువఁ బోరికి నద్రిరథుండుదగ్రతన్. 113

చ. గిరిరథమెక్కి తమ్ము లిరుఁగ్రేవ గిరిద్వయ మట్లు దవ్వులం
దురమునఁ దేరులై యొదవఁ దోఁబడి వాగులవచ్చు లీలరాఁ
గురియఁగఁ దేరిమీదిఁ పురికోటల కేతనదండకోటులన్
జిరిగిన నింగిమేన వడిసెం బయపైనన రక్తపూరమున్. 114

వ. చేరం జనునప్పుడు. 115

క. లావలికించిన మొదలివ
లావలికించిన తెఱంగు లవలవలై కా
లావలికి నిడిన దనుజబ
లావలికిఁ గకుత్స్థుఁ బొదువ నల నపు డొదవెన్. 116

గీ. బలపయోరాశితోఁ కలపట్టు మునుగఁ
నిలిచి యీఁదు తిమింగిల గిలగిలములొ
యింద్రుఁ డెద్దైన మరలు మహీధరములొ
వెడలు నడదీవులో యన విరథరథులు. 117

క. దానవసైన్యము వెలువడి
మానవలోకేశగణ మమర్త్యగణము నీ
కొ నాకౌనని మూర్కొన
రా నపుడెదిరించి రచలరథుననలాదుల్. 118

వ. ఆయేడ్వురయందును దలకడచి దహన దండధర దర్పక ద్విషులు తమ వాహనంబులం దఱిమి యయ్యవసరంబున. 119

క. మనినట్లు మనియె మస్తక
మనినట్లనినారు ద్రష్టలయినట్లయ్యెన్
బనిదాఁకెఁ దగఱు గిరి న
య్యెనుబోతును నెద్దుఁ జాదలే కొండాడన్. 120

ఉ. అమ్మెయిఁ దద్రథాచలము నంటినఁ గొమ్మల మస్తకంబు పే
రెమ్ములఁ జెక్కులూడెఁ దల కెక్కిన వాహనతాసమత్వ గ
ర్వమ్ములు వ్రక్కలై పడినవై ఖరి దానికి నేమి సెప్పుదు
న్సొమ్ములవారిపుణ్యములు సుమ్మని రూపులతోడ నిల్చుటల్. 121

వ. అప్పుడు. 122

చ. అనలుని గాఁడుచుం జమునినాఁడుచు రాక్షసునాడుచుం గవ
ర్ధినొసలు చూఁడుచుం దనుజప్రేవులు దోడుచు గాడ్పుకడ్పులో
గునుకులు గోడుచు స్వరుణుఁగుండియ దేడుచు వాహనేంద్రునం
దిని జనవేఁడుచు న్నృపతి నేర్పులు దీడుచు వెండివాఁడిగన్. 123

క. శైలశతాంగనిశాతశ
రాళిఁ గరాళించి ముంచు నప్పటి పటిమం
బాలం బాలఁబంబగు
గాలము గాలముగఁ దగు జగర్ఘుషమునకున్. 124

వ. ఆపదుద్ధారకుండు గలిగెం గాని. 125

క. గాయఁబులు మానిచికొనఁ
బోయిరి దిక్పతులు వృషభమునపై మొనపై
మ్రోయుచుఁ బడుశరములఁ బొడి
సేయుచు నృపుఁడేసె నగ్నిజిద్గిరిరథులన్. 126

క. పదిశరముల కొకఁడేనియు
ముదుసలి రాకాసిఁ దాఁక మొనయించిన య
ప్పదిలక్షల తూపుల కొక
ప్రదరము గిరిరథుని నుచ్చిపాఱక పోయెన్. 127

ఉ. దానఁ గకుత్స్థుఁ డెల్లజిగి దన్నిన కన్నరచూపు చూడ న
ద్దానవుపైఁ గుభృత్తట నదత్క్వరఖండతరక్షుసింహ సం
తానముపైఁ దదగ్రపురదంతురసాలరట ద్భటాలిపై
నానకనాదసౌధ శిఖరాదులపై శరకోటి ముంచినన్. 128

క. అవి దాఁకి విరిగిపడఁగాఁ
జివికెర దానతూపులివి యిసీ యని యత్తే
రవియింపఁదలఁచి యేసిన
పవిబాణము కొండఁదాఁకి పళ్లున విఱిగెన్. 129

చ విరిగినఁ జూచి నివ్వెఱఁగు వెల్వెలఁజేయఁ గకుత్స్థుఁడేటునే
మఱక యిదేమొకో కులిశమంత్రము తప్పు గొడంగినాఁడనో
కొఱఁతలు పుట్టెనో శుచితకు న్మఱియిప్పుడు వీనియస్త్రముల్
చెఱపనె దివ్యబాణములచే నని సంశయమొంద నవ్వలన్. 130

చ. తలమొల కాలు కే లురము దౌడలు రెండు మొగంబు వీఁపనం
గలయవి యెల్ల ముమ్మరపుఁ గ్రైదువుదాఁకుల రక్తవారిఁ జొ
త్తిల విరథుండుఁ దమ్ముఁడును ద్రిమ్మఱుచుండిరి మంటపూఁతతో
మెలఁగచుఁ గాలమృత్యు వపమృత్యువు మూఁకలుమట్టికట్టుగన్. 131

సీ. గురుఁడంత నతని దార్కొని యుగ్రవరశక్తి
శైలశతాంగుఁడస్త్రములఁ బడఁడు
నగము తత్తటశిఖామృగమహీరుహవర
హర్మ్యాదులను దూఱనమ్మలేదు
తెగదాయుధాంతరంబగగోపల విషా
ణాంఘ్రి ముష్టిశిరోభిహతులు గొనవు

పై మెకంబుల చాలు బంగరుజతతోడ
నక్కొండ గలకాల మతఁడు బ్రదుకు
ఆ. ననిన జెవికి వ్రాలి యతఁడేమి చెప్పెనో
చెప్పగిట్టకదియుఁ జెంతకుఱికి
విసరెఁ తోఁకఁగొట్టి యసురేశు బ్రతుకెల్లఁ
జెండివేసిఁ గొండ పిండిచేసి. 132

క. లోకంబులు వెఱఁగుపడన్
రాకాసులు గోడుగోడునంబడియేడ్వన్
బైకిఁగలబలిమితో గిరి
నాకొట్టాతుమురుసేసె నని గురుఁడంతన్. 133

క. ఈదురవస్థయు నేర్పున
లేదుర యనిపించె నౌర లేదౌరయలఁతిం
బోదురయని వింటిన యీ
మేదురతరశక్తిఁ దొంకమేకొనఁగలదే. 134

మ. అని యాసంశయ మప్పురంజయుని పల్కాలించి చాలించి వా
హనమైనప్పుడ వాలమయ్యెఁ బవి జంభారాతికౌనయ్య చూ
చినవజ్రాకృతి నుందలేదు మఱియస్త్రీభూతముం గాదు దె
ల్పిన బాగయ్యె ననన్విరథుఁ గూల్చె న్రాజు దివ్యాస్త్రముల్. 135

క. వావిఱిచి వాఁవిబనువుచుఁ
జేవిలు వడవైచి యగ్నిజిత్తడలఁగనో
భూవర యిఁక జెవుఁడనఁగా
బైపడునవి యతఁడు గురునిపలుకెడసేసెన్. 136

ఉ. చేసిన వెండియుం దఱిమి చెప్పి గురుం డొకవిల్లు పట్టినం
దోసముగాక వానినొక ధూర్జటియే తెమలించినాఁడు నా
బాసవినం బ్రపంచము నపాయము వాయు మహాస్త్రమేయు మే
దీసడి దాయ నిద్ధరకుఁ దెచ్చిన వీరుఁడ వీవె కావొకో. 137

క. నావుడు బ్రహ్మశిరశ్శర
మావీరుండేసె నపుడు నరిగొన్నపుడుం
భావింప భయావహము జ
యావహమును నై తనర్చె నది జగములకున్. 138

క. మిన్నలసె మింటి కెగసిన
మన్నలసెం ద్రొక్కి యాడ మాటికి వీరు
ల్మన్నలసెఁ గుంచె సురముని
కన్నలయఁగ ననుభవించెఁ గదనరసంబున్ 139

140

వ. అంత.

చ. జలజాతాసనుఁడున్హరుండు హరియు న్సత్యాదిలోకంబు లం
గలవారెల్లను బిండుగట్టి కొలువంగా భారతీపార్వతీ
కలశాంభోనిధి కన్యకాసహితులై గంగాతటిందోఁచి రిం
పుల దీపధ్వజునింద్రవాహనునితోఁ బోరాట వీక్షింపగన్. 141

శా. సాకేతప్రభుఁడుం బురంజయునకై జాలింబడ న్నెవ్వగ
ల్నీకేలా చనుదెమ్ము చూడవలతేనిం దేవితోనంచు ని
క్ష్వాకుస్యందన మెక్కఁబంచి పురి గావన్మంత్రులం బెట్టి యా
రీకారోక్తి నరుంధతీవిభుఁడు వారిందెచ్చె నవ్వేఁళకున్. 142

ఉ. తెచ్చె దురంబుఁ జూడఁ జనుదెంచి భువర్భువనాంతరాళముం
జొచ్చినచోటి దివ్యనదిసూరెల లోకము లెల్ల గొల్వఁ గొ
ల్విచ్చిన మువ్వురేలిక నేలికసానులఁ గొల్వఁ బంచి తాఁ
దచ్చరణంబు లొత్తెఁ గనుదమ్ముల వారికి దివ్యదృష్టిగన్. 143

చ తనపతితో నరుంధతియుఁ దత్కథ విన్నది గానఁ జూడరా
జునగఁగఁ దోడికోడల నసూయ యెఱింగినఁ గూడి యిద్దఱు
న్మను చనుదెంచి యంశుమతి ముచ్చటకు న్రథమెక్కి యున్కి నీ
తనయునిఁ జూడ నట్టిదని తా జగదీశులజోకఁ జూచితే. 144

ఆ. ఎంత కొడుకుఁగంటి విల్లాంధ్రతల్లి నీ
వనుచునుండి రమ్మ్రగాక్షిపొంతఁ
దత్తదాగమోచితస్థానసంవిధా
నములు నచటఁ జూడ నమరెనంత. 145

పణవవృత్తము—ఆ దీపధ్వజుఁ డఖిలానీక
ప్రాదుర్భూతము పణవక్ష్వేడా
నాదవ్రాతము నమరన్ భేరీ
నాదం బాజికి నదచెం బెల్చన్. 146

రథోద్ధతవృత్తము—కీలకీల ఘనకేతనంబున
న్మ్యాలఫాలశిఖసొంపు పెంపను
త్తాలతాలసితతద్రథోద్ధతా
భీలభీల నెఱపెన్ హయక్రియల్ 147

క. సురగరుఁ డంతఁ బరిస్ఫుర
దరిబిలపారాంతరాత్రియాన్వేషి వికృ
స్వరవిపులలోచనంబులఁ
బురంజయుని జూచె వెఱఁగు పొంపిరివోవన్. 148

శా. కంటే దుస్సహఘోష దైత్యచతురంగ వ్యూహసన్నాహము
న్వింటే నేఁడు బలాధిపత్యపదవి న్నిల్చెం ద్రికర్ణుండు కై
కొంటే యద్ధళవాయి మొగ్గరపుఁ జిక్కు ల్మెచ్చు నింద్రారి మే
లంటే తద్ధ్వజకీల దాననగు లోకాలోక పాకక్రియల్. 149

చ సరకుగఁ జూచి యంగబలసంపదచే నతఁ డెన్నడిట్టు మొ
గ్గరముగఁ బన్ని చూపె నటుగానఁ దరించిన వెన్నియున్న వె
న్నిరవెతలంచు బ్రమానువడ నీ మగచూపులు సేదదేర్చెనం
చరిగొనియాడఁ బన్నె నమరాదులఁ దానొక మొగ్గరంబుగన్. 150

క. నారాయణాదులకు సుక
మారునకును నంశుమతికి మదిఁ బదరకుఁడీ
పోరులిసెఁదారసిలె నని
నారదుఁడెడతాఁకి వేగ నడుపుచునుండెన్. 151

ఉ. రెండు ముహూర్తముల్గడ చెరెండుబలంబులు నట్లు భండనో
ద్దండత రేఁగి యేర్పడఁ బదంపడి దీపపతాకునింద్రిక
ర్ణుంతు బలంబు లోడిగికనుంగొనుమాననునంచు మ్రొక్కి యు
క్కండ రథంబుఁ దోలుకొని గంతులు వెల్వడ విల్లు మ్రోయఁగన్. 152

క. సాలాయితసంతతకరి
జాలావృతిచే రథాధి సౌధస్థితిచేఁ
ప్రోలుం బోలె విరాజిలు
వేలుపుమొన సూర్యసోమపీధులు తీర్చెన్ 153

క. బలియుఁ డతఁ డిట్లు సొచ్చియు
బలవీధుల కడ్డములుగఁ బలువురఁ గడపెం
గెలుపులపాళ్లకుఁ బరులా
పొల మటు చొరకుండఁ దడుకువాడిచిన భంగిన్. 154

క. తదవసరంబున జోదులు
పదివేవురు వెంటఁబట్టి బాగై రాఁగా
బొదివెలువడి రథ్యఁబులఁ
గదలించిరి ఘూసరోమ కదలీరోముల్ 155

వ. అంత. 156

సీ. ఎగసిన బలధూళి యెదురుగారాకుండఁ
బులుఁగుతేఁ డెఱకలఁ బోవఁ జదియ
నిగిడిన పెనుదూపు సిగలెల్లఁ జల్లగఁ
జదలేటి తుంపురజల్లు చల్ల

వెలలిన కటికినవ్వులువిన్న వెగటాఱ
నగినవానికిఁ జిన్ననగవు దొలఁక
దోఁచిన వికృతాకృతులు కన్నకంటికిఁ
గుసుమాస్త్రి చనవరి కొలువు సొగియఁ

గీ. దారసిల్లిన వీరవాదములు తెలియ
వేత్రహస్తుండు సభరంతు వెలువఁజేయఁ
గదన పరిశీలనక్రమ కౌతుకమునఁ
దవిలె బ్రహ్మోదులింపొంద దానవారి. 157

ఉ. ధూళిని జోళముల్దొలిచి దోరసి ఘోరశిలీముఖానల
జ్వాలల జొంపము ల్దలఁచి సన్నము తోరము వామనంబును
త్రాలము జిల్గుపట్టముగదా యనురూపుల యున్నరూపున
య్యాలగుచూచుఁ జూచుసుతు నంశుమతీసుకుమారనేత్రముల్. 158

గ. ఈవిధమున దేవత్రయ
దేవీత్రయ చరణ నిహిత దృష్టిబలావి
ర్భావంబు నిర్నిరోధం
బై వారికి దవ్వుసేరువనిపించె నృపా 159

క. ఆలో నటు దొడరిన పది
వేలరథమ్ములకు నడ్డవేదము లెసఁగం
దోలెఁగకుత్స్థుఁడు బసువని
వేలుపులన్నృపులఁ బొమవవిడిచి త్రికర్ణున్. 160

ర. అపుడమరారి వీరరథికాయుత ముబ్బి నిగుడ్చు బాణజా
లపుజడివాన లాశుగబలంబున మాయము చేయుచుంబలా
శిపతుల ముక్కులుం జెవులు చెక్కఁగఁ జక్కఁగ వచ్చి యుండఁగాఁ
జపచపనైన తద్వధవిచారవిశేషముతోఁ గకుత్స్థుఁడున్. 161

క. ఎవ్వనితల దునిమిననది
చివ్వనఁబుట మెగయుఁ బుట్టచెండుం బోలె
న్నవ్వు నొకనవ్వు నెత్తురు
చివ్వన లోఁబడఁగ బంధసీమన నిలుచున్. 162

చ. నిలిచిననేమి వెన్నుదెస నెమ్మొగమయ్యె నొకింత యోఱయై
వలపల చూచె, దాపలికి వాగె మరల్చె వియోవయోగముల్
దెలిపెడు లీలఁ బంపెననదీర దిలంబడి వచ్చి యట్టపై
నిలిచిన కృత్తమస్తకము నివ్వెఱగొల్పగఁ బండిబారునన్. 163

క. ఆలిటకుం గదరౌదల
నేలఁగ గురుఁ దరులఁజూచి యిది యోహాహో
యేలిక యన్నంతకుఁ జను
ఫాలాక్షునికరుణ మీకుఁ బదికోటులకున్. 164

గీ. వలసి వలగొన వెనువెంట వచ్చినారు
చొచ్చిపూజింపఁ బూవు లందిచ్చినారు
దివియ లెత్తంగ వత్తులు తెచ్చినారు
మీరు మీఱాజు హరుఁగొల్వ మెచ్చినారు. 165

చ. అనవుడు దీపకేతుఁ దెగటాఱ్పక వారలఁ దీర్పరామి లోఁ
గనుఁగొని మూఁకలం దిసుత్రికర్ణుని జూచుచు వారిపై విలా
పనశర మేసె నేసి యిరవారఁగ దాయను దచ్చమూపతి
న్మనుకులరా జనింగెడపె మాపడి వెన్నుని రూపుతూపునన్. 166

గీ. ఘాసరోమాదిదశసహస్రీసమృద్ధ
విలపనము మీఁద రేఁగుట దెలిపె నపుడు
తద్విలాపన...తనవోలెఁ...
దద్ద విలపించె శిఖికేతు నొద్దిబారు. 167

శా. అంతంధైర్యమ కార్శ్య మౌటఁ గని యయ్యగ్నిధ్వజుం డారిపుం
ద్రుంతుంగాకని ఘాసరోమకదలీరోమాది సందోహసం
క్రాంతంబైన విలాపనంబునకుఁ దత్ప్రత్యస్త్రముం బెద్ద బా
రెంతో యంతయు పందు వంత కిఁకఁ బోయెం బంటయుం జంటగన్ 168

ఉ. చేసిన సూతుఁడుంబదనుచేసిన రథ్యము లామొగంబుగాఁ
జేసి బళీ యనం దరటుచేసిన నాదును బర్వగర్వము
ల్వీసరిపోవఁగా నొకనిమీనుల నంటకమున్న యట్టె య
వ్వాస వాహను న్మొదలి వానిరథంబు మనోరథం బనన్. 169

ఆ. మున్ను పన్నియున్న మునువేల్పుమొనలును
వెన్ను దన్నియున్న వేల్పుమొనలు
దీపకేతు బలము శినరాజువంశప్ర
దీపకేతుబలముఁ దెలియ నిలిచె 170

సీ. పెనుమ్రాకు లసురేంద్రుననుసరించిన గండ్ర
గొడ్డండ్లు రాచూలి కొలువు సేసెఁ
బొడుపుప్రొద్దులు రాజుదడమౌరయనఁ బావ
మొగములు రాకాసి ముడులఁదోచెఁ
గార్చిచ్చుపనులు రక్కసుపీక వెలసిన
మఘవవాహనువాగె మబ్బులుఱిమె
నడగొండ లలతేనిఁ కడబారువెట్టినఁ
బిశితాశిపతిపాలఁ బిడుగు లుఱిమె

ఆ. నరుమనుఱుమ రోయనటు సేయ దివ్యాస్త్ర
లీలలివి సమాజకేలి దెలిపె
దనుజమనుజు లుడుగ రనియెఁబోజగదీశ్వ
రత్రయంబుతో జగత్త్రయంబు. 171

చ. పులివలె మ్రోగి దైత్యుఁ డరివోసిన కోలకుఁ గాలపాశమై
తలఁకొను తేజమిచ్చె మఱి దాని కకుత్స్థధనుర్భరంబులై

యెలుగులు గొట్టె బిట్టెగసి యీమహిమద్దశకంఠ బాణకం
దళితము లీశ్వరాదినయనంబులకుం బొనరించెఁ బండువుల్. 172

వ. బృహస్పతి మొదల సమరనిహతులగు నంతరీప భూపాలప్రభృతులకు
మృతసంజీవనీ బలంబునఁ బ్రాణంబులు దెచ్చి యచ్చిత్రసమీకవిలోక
నంబు చేకుఱఁ జేసియుండెఁ బురంజయుండును దోడ్తోడ. 173

ఉ. వాకునఁ గేలిగోల శతపత్త్రిముగాఁ గొని యేయఁ బుట్టె ద
ర్వీకరనాయకాదులు దవీభవదానన పృచ్ఛకోటితో
నాకడ దానవప్రశమనాశుగ మన్నిటికన్ని భిన్న వ
ల్మీకముఖంబులై మిగిలి మ్రింగెఁ జెలంగె నహోనినాదముల్. 174

ఆ. అధిపుఁడేసె శక్తి నది యాదిశక్తియై
నొసలికన్నుదెఱవ నసురవింట
మించుఁగొండ వుట్టి మాయమ్మ నీకేల
కోపమనుచు నెత్తుకొనుచుఁదొలంగె. 175

క. ఆమెయి నామోచితమగు
తేమానమునడపి కొన్ని దివ్యాస్త్రంబుల్
సామర్థ్యాంతరసామ
గ్రీమగ్న సమస్తభువనకృత్యములయ్యెన్. 176

వ. అయ్యవసరంబున దీపధ్వజుం డింద్రవాహనుం జూచి. 177

క. ఏనొక పాశుపతంబును
దానొక నారాయణంబుఁ దక్క శతశరి
న్నానాఁటఁబొగలఁబోరితి
మీనేరుపు లెట్టులుండునిఁకఁబోకడకన్. 178

చ. నులివడకుండ నాసరికి నూల్కొనెఁగా కొకఁడంచుఁగార్ముకా
దులు వడవెట్టి జెట్టివగ దూకొని మింటికి దూకె దూకినం

గెలువు కకుత్స్థ యీ యసుర గెల్వక మున్నని యుద్ధనిశ్చయో
చ్చలితుఁడు వీఁడు పైఁబడిసఁజాక నిశాకరశేఖరోక్తికిన్. 179

క. వైయర్థ్యంబు ఘటింపఁగ
నేయవతారంబునోపదే యని మీ తూ
పేయుమని గురుఁడు దెలుప నృ
నాయకసుతుఁ డాశ్రయించె నారాయణమున్. 180

మ. ప్రలయప్రాయ మమేయమాయ మకృతప్రత్యస్త్రమయ్యస్త్ర మం
బలిసాధ్యం బని కానలేకసుర తజ్ఝంఝామరుత్తూలమై
శలభంబయ్యెఁ దదగ్నికీలకు సకాశంబైన యాకాశపుం
గెలనన్మ్రగ్గిరి తన్మహారథులు నగ్నిజ్వాలజన్యావనిన్. 181

వ. తదీయదావదహనజ్వాలాముఖంబులఁ దత్తదసురవరపురంబులు నెరిసె
నంత. 182

క. నరవరులును సురవరులును
నురగవరుల్రాఁబురంజయుం డట చనుచున్
హరిచరణసరసిరుహములు
శిరసునఁ గీలించి వినుతిసేయుచు నుండెన్. 183

మ. అజరుద్రుల్గని పోరుచూచుటకొ యీయాదాయ మాసించియో
విజయంచేసితిరయ్య మీరిచటికి న్వేవేగ విద్వన్మణీ
భజనప్రాపక పాదపంకరుహ మీభావంబు లోఁతంచు సీ
రజనాథుం బ్రణుతించిరప్పుడు గభీరప్రౌఢ సూక్తంబులన్ 184

ఆ. దీపకేతనాదిదితిజుల వధియించి
బడలినాఁడు రాజు పనుపవలయు
ననియె దివిజమౌని యహిరాజపర్యంక
హరిహిరణ్యగర్భులనిచిరతని. 185

చ. అనిచినఁ దల్లిదండ్రులఁ బ్రియంబునఁ దోడ్కొని దేవదుందుభి
ధ్వనులు సెలంగఁ గల్పకకదంబము పువ్వులవానలానఁగా
ననిమిషకోటులెల్లఁ గొనియాడఁ బురంజయుఁడయ్యయోధ్యకుం
జని తనగబ్బిగిబ్బను హజారము డగ్గఱ డిగ్గె డిగ్గినన్. 186

క. కనుఁజెవులుఁబువుల పేరుం
బెనువాలుం గాలుఁగేలుఁ బెదతల తొడలు
న్ననుమొగము మూఁపువృషభము
తనవునకుం బాయ దేవతాపతి వొలిచెన్. 187

ఆ. పొలిచి వినుతిసేయ పురుహూతునమరుల
నంతరీపనృపుల ననిలభుజుల
నుచితవిధులఁ బ్రీతి యొనరించి తగనంచి
యంత సంతసంబునందె రాజు. 188

వ. తదనంతరంబ. 189

సీ. ధీమాన్యగణకోప ధీదండబలపాక్షి
చరదూతజవిదండి షండరక్షి
కవితాది బుధసభ్యకథకలేఖగురు
స్మరధర్మభరతాశ్వ మనునయార్థ
తతతంత్ర చిత్రావధానసాముద్రిక
స్మృతి దైవశకునజ్ఞ శిల్పివేత్రి
దానేష్టిదృగిభాశ్వధనధాన్యమణిగంధ
భాండగోకువనాస్త్రబంధ్యధిపులు

గీ. పడగగొడుగుగందము కుంచె పంజుసురటి
పావళాలవట్టము గిండిపడిగె మడప

మరయఁదే వాదకరజకక్షరులు దాసి
నట్టువలుబాల చెలివెజ్జు బట్టుజెట్టి. 190

వ. అనుదినంబుఁ దత్తదుచితప్రకారంబులం గొలిచి యుండ. 191

క. సాకేతమునఁ గకుత్స్థుఁడు
రాకా లఁ బల్వురవివాహంబై
లోకాలోకాంతరభువి
కేకాధిపుఁడనఁగ రాజ్యమేలుచునుండెన్. 192

క. ఇది ధనరాసుల కథయని
చదివిన వ్రాసినను వినిన సకలము భద్ర
ప్రదుఁడగుచు రంగనాయకుఁ
డొదవించు న్సిరులు నిక్కముర్వీనాథా. 193

క. అని వైశంపాయనముని
వినిచినకథ విని ప్రమోదవివశుండై య
ర్చనమొసఁగి యనిచి యాతని
జనమేజయుఁడుఁడె నాప్తసామ్రాజ్యుండై. 194

ఉ. కారణజన్మ భూజగదకారణబాంధవ విద్విషద్ఘటా
గౌరవ సింధుబాడబక గౌరవహాదభిమాన మానసాం
భోరుహసంచరత్పరమపూరుష బంభరకన్యకాతుల
పూరుషముఖ్యదానపరిపూతనిరస్తసమస్తకల్మషా. 195

క. లీలామురహర తిరుమల
తోలప్పాచార్యచరణతోయజసేవా
లోలపరాసుసమీర
వ్యాలత్కరవాల చోడవంశనృపాలా. 196

ఉత్సాహ—పావనప్రథానిధాన పరవధూప దాఙ్జలా
ఙ్జావృతప్రకృష్టమాంసఖండ ... ...
... ... ... ...
ధావనప్రహాసి భిల్లతామరసవిలోచనా. 197

:- గద్య. :-

ఇది శ్రీమత్తిరుమలతాడప్పాచార్యచరణసరసీరుహసేవాసమాలబ్ధసామ్రాజ్య
ధౌరేయ నిజకార్యాభరణాయమాన యెల్లభూపురందరవరనందన
మల్లనంతమహీనాథ ప్రణీతంబైన కకుత్స్థవిజయంబను
మహాప్రబంధంబున సర్వంబును బంచమాశ్వాసము.

ం—ం